## జలోజ్వల

మృత్యు ముఖం మీద జీవన తిలకం దిద్దే
నా మాతృస్తనార్తి జలాజలా రాల్చే కన్నీళ్ళలో స్తైనం
ఫ్లోరోస్విషాన్ని నింపేదెవరిని నేనడుగుతున్న.
ఏ బొమికలు పేర్చిన కత్తులగోసు దగ్గర
నా తల్లి ఆగిపోయి "కొడుకా! నేలమీద,
నీరు మీద జరిగిన కుట్ర తెలుసుకో!" అని బాస చేసిందో
నీకు తెలుసా?
ఆశలు మొలవని కాలిన బుగ్గలయిపోయిన
మా అమ్మ కళ్ళకు దట్టంగా కరువు కాటకాల కాటుక
పూసిందెవరో తెలిసిపోయింది.
పగిలిన ఎండమావి పలకాల మధ్య
గొంతు కూరుకుపోయిన దాహార్తి గురించి ప్రశ్నిస్తున్న.
దొంతరలు, దొంతరలుగా మా బొమికల నిండా
ఫ్లోరోసిస్ పొరలు నింపిందెవరని నేనడుగుతున్న.
మందలు, మందలుగా మా పశువులు
పట్నందారి కబేళాకు తరలించబడటం
ఎవరి పుణ్యమని నేనడుగుతున్న.
మా గూనివంపు వెన్నుపూస మీద
మేం మురిసి ముక్కలయిపోయిన పంటచేల మురుపుమీద
పురివిప్పిన ప్రాజెక్టుల మోత ఎవరికి? మేత ఎవరికి? అని నేనడుగుతున్న.
అసమవేదం నిత్య పారాయణం చేసి దేశమంతా
తారతమ్యాల అభివృద్ధి వెలుగునీడల్ని నింపిన నీ కుట్ర తెలిసిపోయింది.
ఓట్ల జగన్నాటకంలో సూత్రధారి కుట్ర తెలిసిపోయింది.
మేం అటూ ఇటూ దగాపడ్డ జనావళిని కూడగట్టి
ఇప్పుడో వారధి నిర్మిస్తున్నాం
ప్రకృతి వనాలు సమంగా పంచడం కోసం
బిడ్డల్ని, జనసంద్రాన్ని గోదావరి, కృష్ణను తోడుగా వరదలెత్తిస్తాం.

- డా॥ [illegible]




సంపుటి : 17 సంచిక :
ఆగస్టు 1993 142

ప్రజాసాహితి కార్యాలయం :
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

రచనలు పంపవలసిన చిరునామా :
నిర్మలానంద,
వర్కింగ్ ఎడిటర్, ప్రజాసాహితి
7-23, తమిళ్ స్ట్రీట్
చినవాల్తేరు,
విశాఖపట్నం - 530023

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :
కొత్తపల్లి రవిబాబు,
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.
గుంటూరుజిల్లా



[illegible]
(సౌజన్యం : చలసాని ప్రసాదరావు
శిలా చిత్రాలు)

రెండవ కవరు పేజీ కవిత
జలోజ్వాల :
- డా॥ చెరుకు సుధాకర్

మూడవ పేజీ కవిత :
అహో! బిలంలో దాగిన వెన్ను ...!
- నిఖిలేశ్వర్

నాల్గవ పేజీ పాట :
పోరే మనకు దారి :
- వి. నాసరయ్య.

---

ఈ సంచిక వెల. రు. 8-00

వెల : రూ. 5 సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100
(సం॥లో ప్రచురించిన పుస్తకాలతో)
డి. డి. లు మేనేజర్, ప్రజాసాహితి
విజయవాడ-2 పేరుతో పంపాలి.

[illegible]

## సంపాదకీయం



# కరువు

కరువు....

పుష్టి కరువు, వలస కరువు, గంజి కరువు, డొక్కల కరువు.... మానవ నాగరికతను వెక్కిరిస్తున్న కరువు. నిత్య కరువు. బాధితుల మానవీయ గౌరవాన్ని పతనం గావిస్తున్న కరువు. శ్రమ జీవుల్ని దిక్కులేని వార్నిగా దిగజారుస్తున్న కరువు. ఆకలికీ, అనారోగ్యానికీ, అప్పులకూ బలిచేస్తూ కుటుంబ జీవనాన్నీ, వ్యక్తి మనుగడనూ ప్రశ్నార్థకం చేస్తూ పశుప్రాయం చేస్తున్న కరువు. మానాల్నీ, ప్రాణాల్నీ బలి గొంటున్న కరువు.

....ఇది 21వ శతాబ్దం అద్భుతాల్ని ఆశ పెడుతున్న ప్రభుత్వాల నిర్వాకం. ప్రజాస్వామ్యం, శాస్త్ర ప్రగతి, సామాజిక ప్రగతి, శాంతి, భద్రతలను గుత్తకు తీసుకున్న ప్రభుత్వాల పాలనా ఫలితాలు ఇవి. 70-80 శాతం ప్రజానీకానికి వ్యవసాయాన్నే కేవల జీవనాధారం చేసి, ఒక కోటి గ్రామీణ కుటుంబాలను భూమిలేని నిరుపేదలుగా చేసి, వ్యవసాయాన్ని ఋతు పవనాల జూదానికి వదిలేసి,

ఫ్యూడల్ దోపిడీ అణచివేతలనూ, వ్యవసాయ రంగంలోనూ, పారిశ్రామిక రంగంలోనూ సామ్రాజ్యవాదుల దారి దోపిడీని పరిరక్షిస్తున్న ఫలితంగా మన దేశంలో అశేష ప్రజానీకం దుర్భర దారిద్ర్యం పాలయినారు.

రుతువుల మాదిరి క్రమతను సంతరించుకున్న కరువు పాలక పీడక వర్గాల పుణ్యమా అని దేశమంతటా పాము పడగలా విస్తరిస్తున్న కరువు నీడ.... శాటిలైట్‌లూ, అణ్వస్త్రాల ఆవిష్కృతి, సూపర్ కంప్యూటర్‌లూ, స్టార్ టి.వి.లూ, ఐదు నక్షత్రాల హోటళ్ళూ, అంతర్జాతీయ క్రీడోత్సవాలూ, పరిశోధనా పాటవమూ తదితర ఆధునిక, అత్యాధునిక వేషాలతో పాలక వ్యవస్థ కరువు నీడ వెనక పగటి వేషగాడులా నిలుస్తుంది.

జీవనదులు దేశమంతటా అల్లుకొని పారుతున్నాయి. వాటి జీవ జలాలకు అడ్డు కట్టలు వేసి, వినియోగించుకోగల మానవ వనరులూ పుష్కలంగా వున్నాయి. అయినా రుతు పవనాల్లో స్వల్ప తేడాలకు కూడా దుర్భిక్షం ముంచుకు పడే దుస్థితి దాపురించింది. ప్రాకృతిక, సామాజిక వనరుల్ని సకల జన జీవన కళ్యాణానికి వినియోగపరచాలనే ఆదర్శం మన పాలక వర్గాలకూ, ప్రభుత్వాలకూ పరాయి. ప్రాకృతిక, సామాజిక వనరుల్ని యథేచ్ఛగా కొల్లగొడుతూ నోరుగల వర్గాలకు నాలుగు మెతుకులు విదిల్చి, అశేష ప్రజానీకాన్ని ప్రాకృతిక ప్రమాదాలకూ సామాజిక దోపిడీకీ బలిచేసి, తమ పబ్బం గడుపుకోవడమే వాళ్ళకి తెలిసిన విద్య

భాషా, సరిహద్దులతో పాటు నదీ జీవ జలాలు కూడా వివిధ ప్రాంతాల ప్రజల మధ్య వివాద హేతువైన దౌర్భాగ్య పరిస్థితిని పాలక వర్గాలు తెచ్చిపెట్టాయి. ఆంధ్రలో రాయలసీమా, తదితర ప్రాంతాల మాదిరే అన్ని రాష్ట్రాల్లోనూ అభివృద్ధికి నోచుకోని ప్రదేశాలు ఒక పద్ధతి ప్రకారం సృష్టించ బడుతున్నాయి. పాలక వర్గాల స్వార్థ ప్రణాళికలలో భాగంగా ప్రాంతీయ అసమానతలూ, వెనకబడిన ప్రాంతాలూ ఒక ప్రత్యేక లక్షణంగా నెలకొన్నాయి.

రుతు పవనాల జూదం కన్నా, పాలక వర్గాల అశ్రద్ధా, చిత్తశుద్ధి హీనతా, స్వార్థమూ భారతదేశంలో కరువులకు ప్రధాన కారణం. వర్షాభావం కరువుకు తప్పని సరిగా దారి తీయనవసరం లేదు. సమర్థవంతమైన సమగ్ర జల వనరుల నిర్వహణ, వర్షాభావ పరిస్థితుల్ని అధిగమించ గలదు. నాలుగున్నర దశాబ్దాల స్వతంత్ర పాలనలో దేశాన్నంతటినీ దుర్భిక్షం బారి నుంచి విముక్తి చేయగల సమగ్ర జల నియంత్రణ

పథకాల్ని అభివృద్ధి చేయలేని పాలక వ్యవస్థ వైఫల్యమే నేడు అంత కంతకూ విస్తరిస్తున్న కరువు. బ్రిటిష్ వలస పాలకుల అడుగుజాడే మన పాలకులు ఎంచుకున్న ప్రణాళికా మార్గం. దేశంలో 99 జిల్లాలు తరచూ అనావృష్టికి గురయేవిగా గుర్తించ బడినాయి. ఆంధ్ర ప్రదేశ్, మహారాష్ట్ర, కర్నాటక, ఒరిస్సా, రాజస్థాన్, గుజరాత్, ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్, బీహార్ రాష్ట్రాల్లో కరువు నిత్య సత్యమై నిలుచింది. 1985లో పద్నాలుగు రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాల్లోని 260 జిల్లాలు కరువువాత పడినాయి. 1960, 1980 దశకాల్లో దాదాపు ప్రతి ఏటా కరువు సంభవించింది. ఆకలి చావులూ, వలసలూ జాతి జీవనంలో అంతర్భాగమైనాయి. ప్రభుత్వాలు మాత్రం ఏమీ ఎరగనట్టుగానే, ఏమీ జరగనట్టుగానే కనీసమైన సిగ్గుగానీ, బాధ్యతగానీ, లేకుండా అట్టహాసంగా వర్తిస్తున్నాయి.. కరువు సమస్య అన్నది దోపిడీ పాలక పార్టీలు, దోపిడీ ప్రతిపక్షాలకు మధ్య అధికార కుమ్ములాటకు ఒక పాచికగా మాత్రమే ఉపయోగపడే అంశంగా రూపొందించ బడింది.

సామ్రాజ్యవాదులతో దేబిరించి తెచ్చుకున్న 'సహాయమూ', వారి కనుసన్నల్లో అమలవుతున్న అవకతవకల పథకాలూ జాతి జీవనాన్ని శాపగ్రస్తం చేస్తున్నాయి. సామ్రాజ్యవాద సంస్థలకూ, దేశవాళీ దళారీలకూ వరాలు కురిపిస్తున్న లోపభూయిష్టమైన నీటి పారుదల ప్రాజెక్టులను నిర్మిస్తూ, అక్కడక్కడ పచ్చటి ఒయాసిస్‌లను కల్పిస్తూ, దేశ సమగ్రాభివృద్ధిని అలక్ష్యం చేశారు. దేశమంతటా తక్కువ ఖర్చుతో పచ్చటి పొలాల్ని పోషించగల, జీవన భద్రతనూ గ్యారంటీ చేయగల చిన్నతరహా, మధ్య తరహా నీటి పారుదల ప్రాజెక్టులను ఉపేక్షించారు. అనేక ప్రాంతాల్లో ప్రాచీన కాలం నుండీ నిర్మించబడిన చెరువులు, కాలవల అభివృద్ధినీ, మరమ్మత్తులనూ విస్మరించారు. అటువంటి నిర్మాణాలను నిర్మించుకోగల ప్రజల చొరవను తిరస్కరించారు. సమగ్ర జల నిర్వహణ పథకాలు లేని కారణంగా ఒకవైపు వరదలూ, మరొక వైపు తీవ్ర అనావృష్టి ఏక సమయంలో రాజ్యమేలుతున్నాయి.

నేటి శాస్త్ర సాంకేతిక ప్రగతి దృష్ట్యా కొన్ని మినహాయింపులతో ప్రకృతి వైపరీత్యాలు మానవుడు అధిగమించలేనివి కావు. ఆ రీతిగా బెంగాల్ ఫ్యామిన్ లాంటివేకాక, సంభవించిన అనేకానేక కరువులూ, వరదలూ, మహామారులూ సామాజిక వైఫల్యాలే.

చిన్న చిన్న నీటిపారుదల ప్రాజెక్టులవల్ల విస్తృత ప్రాంతాలకు నీరందడమే కాక భారీ ప్రాజెక్టుల మూలంగా భారీ సంఖ్యలో ప్రజలు నిర్వాసితులయే

ఘోరాలు తప్పుతాయి. అయినా ప్రభుత్వాలు భారీ ప్రాజెక్టులకే పట్టుబడుతున్నాయి లక్షలాది ఆదివాసీ, పేద ప్రజలను నిర్వాసితులను చేసే, వేలాది ఎకరాల సారవంతమైన అడవుల్ని నిర్మూలించే భారీ సర్దార్ సరోవర్ ప్రాజెక్టు నిర్మాణం నిలుపుదలకై ప్రజానీకం ఉవ్వెత్తున ఉద్యమిస్తుండగా, ప్రభుత్వాలు దాని నిర్మాణానికై నడుం బిగించాయి. ప్రభుత్వాల ప్రజావ్యతిరేక స్వభావానికీ, నిరంకుశ పాలనకూ ఇదొక స్పష్టమైన ఉదాహరణ.

మానవ నాగరికత పురోగమనం నీటి వనరుల మీదనే ఆధారపడివుంటుందన్నది జీవన సత్యం. దేశాన్నంతటినీ సస్యశ్యామలం చేయగల జల, మానవ వనరులున్నప్పటికీ రాయలసీమలాంటి ప్రాంతాలు నామ మాత్రపు పది శాతం నీటిపారుదల సౌకర్యాలతో వెనుక బడిన ప్రాంతాలుగా పాలక వర్గాల మొసలికన్నీళ్ళకు ఆలంబనవుతున్నాయి. నార్ ఎడారి తరవాత అత్యల్ప వర్షపాతంగల ప్రాంతంగా పేర్కొనబడిన అనంతపురంజిల్లా ఇందులో భాగమే. రాయలసీమ నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధికి హామీ యిచ్చిన 1937 శ్రీబాగ్ ఒడంబడిక భూస్థాపితమైంది. ఆ తరువాత ఏర్పరచిన వివిధ కమీషన్‌ల, బోర్డుల చేసిన సిఫార్సులు పేపర్ మీదనే ఇంకిపోయాయి. వక్రీకరణలకూ, వాయిదాలకూ బలి గావించబడినాయి.

వర్షాభావం ఏర్పడి నప్పుడల్లా వరుణ దేవునికి పూజలు జరిపించే కార్యక్రమానికి పరిమితమయిన ప్రభుత్వాలు, వాటి దివాలాకోరుతనాన్ని చాటుకుంటున్నాయి. ఇప్పుడేమో కృత్రిమ వర్షాల కృత్రిమ వరాల్ని కురిపిస్తున్నాయి. భారత దేశ అటవీ సంపదను చట్ట వ్యతిరేకంగా నిర్విచక్షణంగా దోపిడీ ప్రయోనాల కోసం ఏటా వేలాది ఎకరాలను నరికి వేస్తున్న కాంట్రాక్టర్లకూ, అటవీశాఖ అధికారులకూ, దళారీలకూ ప్రభుత్వాలు పకడ్బందీగా రక్షణ కల్పిస్తూ తమ వాటా తాము మింగేస్తున్నాయి. వర్షాభావానికి ఈ అటవీ విధ్వంసన ఒక ముఖ్య కారణంగా వున్నది. చల్లదనం కరువై వర్షాభావము, అటవీ నేలలకు వృక్ష ఆచ్ఛాదన కరువై వరదలు ఏక బిగిన సంభవిస్తున్నాయి.

సామ్రాజ్యవాదుల, సోషల్ సామ్రాజ్యవాదుల బందిపోటు ఆర్థిక విధానాల వల్ల స్వదేశీ ప్రభుత్వాల నిరంకుశ, దళారీ పాలనవల్ల ఆఫ్రికా ఖండంలోని ఇథియోపియా, సూడాన్, మొజాంబిక్, అంగోలా, లైబీరియా తదితర దేశాలు ఎడతెరిపిలేని దారుణమైన కరువులకూ, దుర్భిక్షానికీ గురవుతున్నాయి. సోమాలియా

దుర్భిక్షం వర్ణించతరం కానిది. ఆ దేశాల ప్రజల్ని బిచ్చగాళ్ళగా దిగజార్చారు. సహాయం పేరిట రాజకీయ యుద్ధాలు నెరపుతున్నారు. ఏటా లక్షలాది ప్రజలు నెమ్మనెమ్మదిగా శవప్రాయంగా మారి, ప్రాణాలు వదులుతున్నారు. రాయలసీమ మరో ఇథియోపియాగా మారనున్నదని, ఎడారిగా రూపు దిద్దుకుంటున్నదనీ ప్రకటిస్తున్నారు. అయినా అటువంటి పరిస్థితిని నిరోధించగల చర్యలు నామ మాత్రంగా కూడా చేపట్టడంలేదు.

నిజమే, దేశంలో ఏ ప్రాంతంలోనయినా ఆఫ్రికా కరువుతో పోల్చగల తీవ్రతలేదు. అయితే కరువూ, దుర్భిక్షం అనేక ప్రాంతాల ప్రజల జీవనంలో నిరంతరంగా పూసల్లో దారంగా కలగలసిపోయి వుంది. 'ఒక ఏడాది ఫరవాలేదు. జీవితాన్ని నెట్టుకొని రాగలము' అనుకొనే లోపే, కరువు రెండు మూడేళ్ళ మృత హస్తాన్ని విసురుతున్నది. తిరిగీ కొంత వెసులుబాటు, మళ్ళీ అదే నిర్వేదం. అది మెల్లమెల్లగా జీవితానందాన్ని తగలబెడుతున్నది. అందుకే శాశ్వత కరువు నివారణ పథకాలకు ఉధృత స్థాయిలో ఉద్యమ నిర్మాణం సఫలం కావడం లేదు.

కరువు అంటే వర్షాభావమే కాదు. పంటలు పండక పోవడమేకాదు. వలసలే కాదు. ఆకలి చావులే కాదు. ఒక జాతి ప్రజల బ్రతుకూ, భాష, సంస్కృతీ, మానవీయ గౌరవమూ సర్వనాశనం కావడం. ఇది విదేశీ దండయాత్రల కన్నా వినాశకారి కాగల కారకము. కళాకారులూ, రచయితలూ, కరువు ఫలితాల్ని అడపాదడపా చిత్రించారు. గ్రామీణ జీవనానికి అద్దం పట్టిన ప్రేంచంద్ సాహిత్యములోనూ, చిత్త ప్రసాద్ చిత్రాలలోనూ కరువు పరిస్థితి ఒక నిరంతర ధారగా గోచరిస్తుంది. కరువు నిప్పు భారతీయ రైతు జీవితాన్ని కాల్చుకు తింటూనే వుంది.

ప్రజా జీవనాన్నీ, సంస్కృతినీ విధ్వంసం చేస్తున్న కరువును సృష్టిస్తున్న స్వార్థశక్తులను ప్రతిఘటించడానికి నిరాశా నిస్పృహల పాలైన జనావళిని చైతన్య పరచవలసిన బాధ్యత ప్రతి దేశభక్తుని మీద వున్నది. ఈ దేశం అందరిదీ. ఈ భూమి అందరిదీ. ఈ జలాలు, గాలి, వృక్ష సంపద అందరివీ. క్షేమం అవిభాజ్యం. మానవత్వం కరువైన పాలకవర్గాల్ని నిలదీసి సకల శ్రమజీవుల సౌభాగ్యానికి కరువు కాటకాలులేని సమాజాన్ని కనీసం 21 వ శతాబ్దంలోనైనా సాధించుకోవడానికి మన కలాల్నీ, గళాల్నీ, ఉద్యమాల్నీ అంకితం చేద్దాం.

# జానపద గేయాల్లో రాయలసీమ కరువు

— మల్లెల నారాయణ

రాయలసీమ ప్రాంతానికి కరువు కాటకాలు రావడం కొత్తేమీకాదు. ప్రతి పదేండ్లకో, ఇరవై ఏండ్లకో ఓ మారు కరువు కరాళనృత్యం చేయడం సహజమే. జనులకు రాజకీయ చైతన్య స్థాయి తక్కువ కాబట్టి ప్రభుత్వాలు కరువు నివారణకు చర్యలు తీసికోకపోవడం ఉదాసీన వైఖరికి నిదర్శనం. కరువు తారసిల్లిందంటే వానదేవుని గూర్చి పల్లెపల్లెల్లో పిల్లలు పెద్దలూ కలిసి-

"మా పల్లె పాలించు వానదేముడా
మమ్మెల్ల కాపాడు వానదేముడా
మాకెల్ల వరమిచ్చి వానదేముడా
మాకెల్ల పంటలిచ్చి వానదేముడా
మాకెల్ల నీళ్ళిచ్చి వానదేముడా
మా దప్పిక తీర్చవయ్యా వానదేముడా
మ మ్మేలుకోవయ్యా వానదేముడా
ఏ దిక్కునున్నావో వానదేముడా
మా దిక్కురావోయి వానదేముడా
మా చెరువు నిండాలి వానదేముడా
మా గాదెలు నిండాలి వానదేముడా
మా మొరలు వినవయ్యా వానదేముడా"

అని పాడుతుంటారు. అంతేకాక ఎంతకూ వర్షం కురువకపోతే వాళ్ళు ఓ పెద్ద పొడుగాటి కర్రకు లేదా కాడి మానుకు మధ్య వేపాకు మండలుతో పాటు పెద్ద కప్పకు కాలికి తాడుకట్టి ఊరేగించుకుంటూ ఇల్లిల్లూ తిరుగుతూ నీళ్ళు పోయించు కొంటూ ఇట్లా పాటలు పాడుకుంటూ పోతుంటారు-

"కప్ప కప్ప నీళ్ళాడె కడవల కొద్ది నీళ్ళాచ్చె
॥మొఱ్రో వానదేముడా॥

ఉత్తరాది వానళ్ళు ఉరిమి మురిమి కురియంగ
దక్షిణాది వానళ్ళు దడి బట్టి కురియంగ
దాపటీ వానలూ దొరులెత్తి కురియంగ
వలపటీ వానలూ వాగులై కురియంగ
॥మొఱ్రో వానదేముడా॥

పడమరా కొరుదొడ్డి పందిట్లో పండంగ
తూర్పునా కొరుదొద్ది తుమ్మల్లో పండంగ
దక్షిణాన మబ్బేసి దుక్కుల్లు పండంగ
ఉత్తరాన ఉలకారి ఊర్లన్ని పండంగ

॥మొర్రో వానదేముడా॥

రాళ్ళ క్రిందీ కప్ప బెకబెకా లాడాలి
రాతి బసవన్నే మొ రంతె పేయాలి
వంకలూ వాగులూ వగిరించి రావాలి
కుక్కలకు నక్కలకు పెళ్ళిల్లు కావాలి
గుట్టల్లో పుట్టల్లో గూబలే కూయాలి
కొండల్లో కోనల్లో కన్నెల్లు పూయాలి"

॥మొర్రో వానదేముడా॥

అంటూ తిరుగుతుంటారు. 16వ శతాబ్దపు చివరిరోజుల్లో "ఉంపెనా" కరువు వచ్చింది. అప్పుడు కదిరి నడివీధుల్లో ఎన్నో మానవ కళేబారాలు దొర్లాడాయని అక్కడి నాటి శిలాశాసనం వల్ల తెలుస్తూంది. ఆ తర్వాత 1792వ సంవత్సరంతో దిబ్బ కరువు వచ్చింది. ఎక్కడ చూచినా దిబ్బలు దిబ్బలుగా రాశి పోసినట్లు శవాలు పడిపోయాయట. ఆ కరువు ఈ ప్రాంతాన్ని 5 సంవత్సరాలు పట్టి ఊపేసింది. దాన్నే "మినసాని" కరువని సి.పి. బ్రౌన్ పేర్కొన్నాడు. ఆ మీదట 1806 సంవత్సరంలో పెద్ద "కరువు వచ్చింది. దాన్నే పీతిరి గ్రద్దల" కరువన్నారు. ఇప్పటికీ "పెద్ద కరువురా పీతిగ్రద్దల కరువురా" అని ఈ ప్రాంతం వాళ్ళు అంటుంటారు. ఆ మీదట 1823-24 సంవత్సర కాలంలో "దొర్ల" కరువు వచ్చింది. అప్పుడు జనులు ఎక్కడ బడితే అక్కడే దొర్లి దొర్లి ఆహాకారాలతో మరణించారట. "దొర్ల కరువు, అర్లపాడు రాముని ఎరుక"- అని అనేవాళ్ళు. ఆపై 1832-33 సంవత్సరాల కాలాన లూటీలు, దొంగతనాలు, దోపిడీలు విపరీతంగా జరిగాయి. ధరలు ఆకాశాన్ని అంటాయి. పసి పిల్లలను తెగ నమ్ముకున్నారు. ఒక్క కడప జిల్లాలోనే 120 మంది చనిపోయినట్లు 1833 జనవరి 29వ తేదీన జిల్లా కలెక్టరుకు రిపోర్టు అందింది. ఆ సమయంలో గంజి కేంద్రాలు కంటి తుడుపుగా నడిపారు. కూలీలచే రోడ్లు అరగొరగా వేయించారు. అప్పుడు వేసినదే రాయచోటి నుండి చింతామణి వరకు కంకరరోడ్డు. ఈనాటికీ జనం "ధాతు కరువు కంకర రోడ్డు" అని అంటుంటారు. ఆ నాటికీ ఈ ప్రాంతంలోని భూస్వామ్య పెత్తందార్లు, రాజకీయ కాంట్రాక్టర్లు కరువు నిధుల్ని భుక్తం చేసేశారు. బహుశా ఈ ధాతు కరువప్పుడేనేమో ఈ ప్రాంతంలో గజ దొంగలుగా పేరు మోసిన దివిటీల మల్లు, చీకటి దొర, వస్తే రాడు పోతేపోడు,

పుల్లబొచ్చుగాడు, వరబీజం నారిగాడు, పుసిరి కండ్లోడు మున్నగువాళ్ళు దారి దోపిడీ గాళ్ళుగా చెలామణియై పల్లెటూర్లపై దండెత్తి దాడి చేసి, ఆస్తి పాస్తుల్ని కొల్లగొట్టు కొని పోతుండేవాళ్ళు. గజదొంగగా పేరొందిన దివిటీల మల్లు అప్పుడప్పుడూ రహస్యంగా పల్లెలకొచ్చి పేద జనానికి గంజినీళ్ళు కాయించి పోయించేవాడట. ఇప్పటికీ ఈ ప్రాంతంలోని హరిజనులు—

"దివిటీల మల్లుగాడు
దీటి బట్టి వచ్చినాడు
గుట్ట మెక్కి గూడె మొచ్చి
గంజి గతక కాచి కాచి
సాన్కెలలో పోసినాడు
సక్కగెళ్ళి పోయినాడు
ధాతు కరువు భూతమయ్యే
భూత కరువు ాతులయ్యే
దొర కొడుకుల దొరతనం
మల్లు ముందు దిగ దుడుపుర
సామిరంగ-సామిరంగ-నా సామిరంగో"

అని పాడుతుంటారు. ఈ కరువు సంభవించినప్పుడు బనగానిపల్లె, ద్రోణాచలం ప్రత్తికొండ, కొడుమూరు, వెలుదుర్తి ప్రాంతాల్లో శవాలు రోడ్డు కిరుపైపులా అమర్చితే పొడవు పర్లాంగు ఉండేదని అంచనా వేశారు. ఇక ఎద్దులు, గొర్రెలు, మేకలు, పొట్టేళ్ళు దాదాపు నాల్గు లక్షలకు పైగా గ్రాసంలేక మలమల మాడి "డొకోరు" మని చచ్చిపోయాయట. ఎక్కడ బడితే అక్కడ మరణించిన శవాలను సామూహికంగా ఖనన సంస్కారాలు చేసేందుకు పోలీసు సిబ్బందికి కూడ సాధ్య పడలేదట. ఈ విషయాన్ని డిసెంబర్ 1864లో "మైె ఇండియన్ జర్నల్"లో కల్నల్ వాల్టర్ పేర్కొన్నాడు. ఈ సమయంలోనే పలు రకాలైన కులం వాళ్ళు క్రిశ్చియన్ మతంలో చేరారు. ఈ కరువు నార్త్ ఆర్కాటు జిల్లాకు కూడ ప్రాకింది. 1832వ సంవత్సరంలో కడప బజారులో ఒక షావుకారు ఇంటిమీద సుమారు నూరు మంది గుంపు కూడి వచ్చి బీగాలు పగులగొట్టి ఇంచుమించు మూడు వేల రూపాయల నగదు- బంగారం ఆభరణాలు దోచుకొని పోయారు. ఆ తర్వాత కొద్ది కాలానికే అంటే 1833 మే 24వ తేది కడప కోర్టు ట్రజరీని దొంగ కొల్లగొట్టుకొని పారి యారు. దివిటీల దొంగలు ఊర్లమీద పడి పడి పొలాల్లో ధాన్యం కుప్పలు పాతర్లల్లో దాచుకొన్న జొన్న, కొర్రగింజలు దోచుకున్న సంఘటనలు లేవు. ఈ నేరస్థుల అరెస్టులతో కడప జైళ్ళు కిటకిటలాడిపోయాయి. బనగానిపల్లె కోట

జైలు నుండి అరెస్టు కాబడిన నూట పదిహేను మంది కానాల బోయలు తప్పించుకొని పారిపోయింది ఈ సమయంలోనే. ఇప్పటికీ యిక్కడ "కానాల బోయోళ్ళ-కయ్యానికి సై- వియ్యానికీసై" అని అంటుంటారు. ఈ కరువు విలయతాండవం చేస్తున్న కాలంలోనే 1824వ సంవత్సరం అంతకు ముందు 1812వ సంవత్సరం కాలంలో కూడ 300 వరహాలు జిల్లా కలెక్టరుతో మంజూరు చేయించుకొని పుష్పగిరి చెన్నకేశ్వర స్వామికి- వరుణ దేవునికి పూజలు చేయించడంతో పాటు పరశు యజ్ఞం- వరుణ యజ్ఞం- గజయజ్ఞం- సుదతి యజ్ఞం పక్షం రోజులు వేద పండితుల అధ్వర్యంలో కార్యాన్ని నిర్విఘ్నంగా నిర్వహించారట. అట్లే కడప జిల్లాలోని వెల్లాల సంజీవరాయని గుడిలో కూడ వరుణ పూజలు చేయించారట. అందుకే అక్కడి తలారీలు ఇప్పటికీ-

"వెల్లాల సంజీవా ఆకు మడుపు పూజలందరా
ఆకు మడుపు పూజలంది మేడిఆకలాడ జేయరా!
కరువు తోడ కందినాము
డొక్కలెండి మాడినాము-సంజీవా కావరావరా"

అని పాడుతుంటారు. ఈధాతు కరువు కాలంలోనే గుత్తి దగ్గరుండే జక్కలచెరువు-వన్నె దొడ్డి మధ్య కొండల దిగువ భాగానుండే "ఉండిగ" బావిలో (నూటొక్క మెటికలుండి మధ్యన చేదుడు బావి వుంటుంది. దాని నుండి గిలకల సహాయంతో నీళ్ళు తోడుతా చేదు కుంటుంటారు) దాదాపు ఇరవై మంది కూలి జనం దాహం వేసి వెళ్ళి నీరందక అందులో పడి మరణించారు. ఆ ప్రాంతంలో మరణించిన వాళ్ళు దయ్యాలై తిరుగుతున్నారనే భయం చేత కొంత కాలానికి ఆ బావిని ఆ గ్రామాల జనులు పూడ్చివేశారట. ఇప్పటికీ ఆ ప్రాంతం యాదవులు-

"జక్కల చెరువు కొండకాడ
వన్నె దొడ్డి కొండవార
"ఉండిగ" బావి మెట్లుదోగి
మట్టి దుత్త తాట గట్టి
గిలక మొద్దు పట్టుకోని
గింజులాడ నీళ్ళురాక
గిరవాటై చచ్చినారురో
ఈకరువు మండి మాసిపోనురో - ఓ! రాములూ
జొన్నచేలో మల్లె పీక
ఒంగిన కూలోళ్ళు అడ

దప్పి కారిపోతుంటే
దేవుడేమి చిన్న చూసెరో - ఓ ! రాములా
కర్మమెంతలావు దాయెరో ఓ ! రాములా ”

అని పాడుతుంటారు. ఈ కరువులో మశూచికం, కలరా, ధూము, సరక మున్నగు అంటు వ్యాధులు సోకి జనంతోపాటు పశు పక్ష్యాదులు సైతం మరణించడం వింతేమీ కాదు. తిరిగి 1926 వ సంవత్సరంలో పెద్ద గాలి కరువు వచ్చింది. కొండ గుట్టల్లోని పశుపక్ష్యాదులన్నీ మరణించాయి. అడవుల్లోని చెట్లన్నీ నేలమట్టమయ్యాయి. దాదాపు 30 వేల మంది గూడులేని అనాధలైపోయారు. ఎంతో మంది మారుమూల ప్రాంతాల్లో మరణించారు. ఈగాలిని గూర్చి అనేక కథలున్నాయి. ఈ ప్రాంతంలో ఇప్పటికీ—

పెద్ద గాలి లేచింది
పెద్ద వాన వచ్చింది
నడిమి దొడ్డి కాడ మంచం
నట్టేటా ముంచింది
పట్టెడన్నం కరువైంది
పలుకు తాడు బరువైంది
కర్రెద్దుల పగ్గాలా
కదిరి గుట్ట చేరిపాయె
ఎర్రావుల మందగాడు
ఎర్రగొండకెగిరిపాయె
సందకాన్నె వస్తానని
పుల్లగిరీలేపినోడు
పులపరించి తుమ్మల్లొ చేరె”

అని పాడుతుంటారు. ఈ కరువునే ‘డొక్కల కరు’వని అన్నారు. తిరిగి 1943 వ సంవత్సర కాలంలో “బుడత” కరువు వచ్చింది. ఆ కరువు దాదాపు 7 సంవత్సరాల వరకు ప్రళయ భీకరంగా తాండవించింది. దీన్నె బెంగాల్ కరువుతో పోల్చారు ప్రభుత్వంవాళ్ళు. ఈ కరువు వాత పడి కూడ జనం అశేషంగా మరణించారు. వలస పోయేవాళ్ళు పోనే పోయారు. అప్పుడే భారత ప్రధానిగా ఉండిన పండిట్ జవహర్ లాల్ నెహ్రూ కడప జిల్లా రాయచోటి-కదిరి ప్రాంతాన్నంతా తిరిగి పల్లెజనుల హృదయ విదారక సంఘటల్ని కళ్ళారా చూసి నిస్సహాయుడై వలసినంత సహాయం చేయలేకపోయాడు. ఆ కరువులోనే సంబేపల్లి గుట్టలవద్ద ఓబాలుని శవాన్ని యువకులు ముగ్గురు కలిసి పీక్కు తినటం జరిగింది. కాకులు, గ్రద్దలు పసిపిల్లల శవా

లెన్నింటినో ఎత్తుకపోయి చిందవందర చేసి న్నాయి. అనాటి పత్రికల్లో ఈవింత వింత సంఘటనలకు సంబంధించిన ఫోటోలెన్నో తీసి ప్రకటించారు.

అనాది కాలం నుండి నేటి వరకు ఈ కరువు కాటకాల వాతన పడి మ్రగ్గి స్రుగ్గయిపోతున్న ఈ రాయలసీమలోని పల్లె జనుల నోర్ల నుండి వెలువడే బాధామయ మూగవేదనలు ఆక్రందనల హోరులో తెలుగు భాషలో ఉండే ఎన్నో విలువైన పాటలు, పదాలు, సామెతలు, జాతీయాలు, నుడికారాలు తమ నాల్కల నుండి వింత సొబగులతో తాండవిస్తూ వెలువడుతుంటాయి. వానిలో కొన్ని -

1) కరువులో అధిక మాసం
2) కరువువచ్చి చస్తుంటే గూదెల్లొచ్చేటట్లు తిన్నట్లు
3) కరువులో కంచి కాటుక కావాలనటం
4) కరువులో అధిక మాసం
పెళ్ళిలో దిగుడు మాసం
5) కరువు ఇంట్లో హల్లీకి హల్లి-సున్నకు సున్న
6) కరువులో కసాయి వానికి కంచి మేక బలియైనట్లు
7) కరువుకు దాసోహం అన్నట్లు
8) కరువుకు మొగమాసినట్లు
9) కరువులో అప్పులు
పరువుకు తిప్పలు
10) కరువు బలీయమా విధి బలీయమా-
11) కరువుకు కప్ప పిల్ల ముద్దా ఏమిటి
12) కరువులో కోతికి కల్లు తాపితే
అరుగు మీదెక్కి హారతి పట్టమని అన్నదట
13) అప్పుకు వెరసంది కరువు
తిప్పకు ఎదిగింది ఎరువు
14) కడుపే కైలాసం అన్నోడికి
కరువే విలాసం అన్నోడికి దిగులే ముంది
15) కరువు కడుపు తీపి తీర్చుదూ
ఎరవు పరువు తీపి అర్థంగు లేదోయ్
16) కరువుకు ఆలి ఏడ్పు
కంట్లానికి ఒరి లేరా నాయనా
17) పులోరిగ కరువులో పూడి చస్తుంటే
పులి గేతానికి రమ్మని చక్కాలి గుంత పెట్టినట్లు

18) నందన కరువు మన నల్లాని త్రాగేస్తే
దొక్కల కరువు మన దొక్కల్ని పీకేసింది.
(డొక్కల కరువొచ్చి డోలు వాయించిందట)
19) కరువు కష్టాల్లోనే ఎవరి ఇష్టారాజ్యం వారిది
20) కరువు పనికి బరువెక్కువ / కంత్రి వానికి అలు పెక్కువ
(కంతిరోనికి అలుపెక్కువ)
21) కరువులో ఎద్దు అలపరించి చచ్చిందంటే
గాటికాడి గంగమ్మకు నోట్లోకి ముద్ద దిగజారి పోదాయేమి.
22) కరువుకి అమావాశ్య అయినా పున్నమైనా
అల్లునికి అప్పైనా సప్పైన పోయిందేమీ లేదు
23) కరువులో అప్పుజేసి పప్పుకూడు తింటే
కాటికాడైనా తిప్పలకు ముప్పు తప్పదు.
24) కరువు సీమక్కు కాటి సుంకం
అరువు సొమ్ముకు తిరుగుడు సుంకం ఇచ్చేదెవ రెవరోయ్
అనేటటువంటి సామెతలెన్నో కోకొల్లలుగా ప్రచారమందున్నాయి. ఇంతే గాక -
కొడిగట్టిన కరువు, తలపండు కరువు, ఏర్చిన కరువు, ఊడ్చిన కరువు, పెన వేసిన కరువు, బలుపేసిన కరువు, కరువు నాలుక, కరువు కోరలు, కరువు రక్కసి (రాకాసి), ఉద్దెక్కిక కరువు, ఓర్ల పంటిదె కరువు, బంకెన కరువు, బసివి కరువయ్యె పమిగానినే స్తమీ కరువు, పెన్నొంచిన కరువు, డొక్కలూర్చిన కరువు, దుమారం కరువు, పింజబోసిన కరువు-ఉడాయించి ఓరగిల్లె కరువు: దుబ్బుదబ్బారం చేసె కరువు అన్న జాతీయాలు, నుడికారాలెన్నో కరువుపై ప్రచారమందున్నాయి.
ఏదియేమైనప్పటికి అనాదినుండి నేటివరకు కరువు వాత బడుతున్న రాయలసీమ పల్లె ప్రాంతాల్లో మరుగుపడి జన జీవన స్రవంతిలో తాండవిస్తున్న ఎన్నోవిలువ కట్టలేని ఆణిముత్యాల్లాంటి సంఘటనలను, కథలను, పదాలను సేకరించి భద్ర పరచవలసిన బాధ్యత మనందరిపైన ఉన్నదనుటలో ఏమాత్రం సందేహించ నక్కర లేదని విజ్ఞప్తి చేసికొంటున్నా.

---

ఈ వ్యాసానికి ఆధార గ్రంథాలు:

1) బ్రౌన్ లేఖలు - బంగోరె
2) కర్నూలు జిల్లా గెజిట్
3) నేను సేకరించిన జానపదగేయాలు; పాడిన వారు
ఉలిదంకొండ నారమ్మ, శిరిగే పల్లి బియమ్మ, కానాలబోయల కన్నయ్య
(1956-1957 సంవత్సరాల కాలంలో)

# పవనమా ! పవనమా...!

వర్షిస్తా వర్షిస్తా నంటు
కమ్ముకొస్తున్న మేఘం
ఎండి ఎండి వారుగై
గల గల రాలుతున్న మా జనావాసాల వైపు వంగి
చూసీ చూడక ముందె ఇంకి పోతున్నది
ఆవిరై పోతున్న రక్తాన్ని దాచుకోలేక
తడారిన గొంతుకల్ని తడుపుకోలేక
చీకట్లు కమ్ముకుంటున్న కళ్ళతో
నీళ్ళు గార్చలేక మేం నీరసంగా నిల్చున్నాం
ఎక్కడ చూసినా ఒక్కటే ఆర్తనాదాలు
పెనమై కాలుతున్న తలంపై
ఏగుతున్న ఆకలి కడుపుల పేలాలు
కళ్ళ ఎదుటే భూమి ఎడారి అయి
కళేబరాలను బేరం చేస్తున్న దృశ్యం
కెలుకుతున్న కరువు కాటికాపరి చేతి కర్ర
హృదయాలను కాలుస్తున్న వాసనలు....!
కరువా కరువా ఎందుకు కక్ష కట్టావ్ ?
జాలి గుండెను ఏ చెట్టు తొర్రలో దాచి
రాతి గుండెతో ఇలా పరుగెత్తుకొచ్చావ్ ?
"నాకేం తెలుసు...?
ఆషాఢ మేఘాన్ని అడగండి."
ఆషాఢ మేఘమా ఆషాఢ మేఘమా ఎందుకు పగబట్టావ్?
కన్నీటి బతుకుల ముందు ఎందుకు
ఇలా వికట నాట్యం చేస్తున్నావు ?
"పీడితులారా ! పిపాసకులారా ! నాకేం తెలుసు
పవనాల నడగండి"
పవనమా! పవనమా! దూరమై పోతున్నావేమిటి ?
ఏనుగు మింగిన వెలగ పండువై
మా ఆశల్లో శూన్యం నింపుతున్నావేమిటి ?

"అన్నం తినిపించే తల్లి చేతిని నరికినట్టు
బిడ్డలారా !
విచ్చలవిడిగా చెట్లను నరికి పోస్తున్నారు
ఇనుప ముక్కల వలన డేగల స్వైర విహారంలో
అదుగో -
పంటభూములు ఫ్యాక్టరీ సౌధాలవుతున్నాయి
ఓజోన్ చిల్లుల జల్లెడ నుండి మృత్యురేఖలు గాక
జీవరేఖలు మొలుస్తాయా?
భూమి వేడెక్కి ఎడారి కాక
సస్యశ్యామలాన్ని ఆరబోసే పంటలవుతాయా?
వర్షిస్తానన్న తపనలో నీరుగారి
తటాలున బలహీన పడక నేనే మవుతాను?
మీరు పరాధీనపు కోరల్లో చిక్కుతున్నట్టే
నేనూ కాలుష్య సర్పానికి బలి అవుతున్నాను
ఆర్తులారా మీరు ఏకంకండి !
అడవి పచ్చని చెట్లను ఓర్వని కళ్ళల్లో
నిప్పు కణాలై రగలండి"

సంపత్



# విజ్ఞప్తి

ఏజెంట్లూ, చందాదారులూ మనీ ఆర్డర్లను కొత్తపల్లి రవిబాబు, ఇంగ్లీషు లెక్చరర్, నగరం-522268, రేపల్లె తాలూకాకూ డ్రాఫ్టులనూ, చెక్కులనూ మేనేజరు, ప్రజాసాహితి, విజయవాడ పేర డ్రా చేసి కొత్తపల్లి రవిబాబు చిరునామాకి పంపి సహకరించమని విజ్ఞప్తి చేస్తున్నాము.

— సంపాదకుడు

# తాలు గింజలు

— శాంతి నారాయణ



ఋతువు తప్పి అకాలంలో వర్షమొచ్చినా ఈ అయిదారేండ్ల కాలంలో బొమ్మక్కపల్లి చెరువు ఈసారి 'గుడ్డిలో మెల్ల మేలన్నట్లు', ముక్కాలు భాగం నిండింది. జాగ్రత్తగా నీళ్ళువాడుకుంటే పంటకేం ఫర్వాలేదని 'ఆయకట్టు' రైతులంతా మాట్లాడుకొనివంతులేసుకున్నారు. 'సాయి' పోతుందని ఆదరాబాదరా వరి నార్లుపోసుకొని పొలాలు అదును చేసుకోసాగినారు. బావులున్న రైతులు ముందుగానే బావినీళ్ళ కింద నారు పోసుకొని నెమ్మదిగా నాటుకున్నారు.

బదులు మడకలు చేసుకొని రెండెకరాల మడిలో పిట్టక దున్ని అదును చేసుకోడానికి నాలుగు దినాలు పట్టింది చెన్నప్పకు. కడగొట్టు తీర్లుగఎంతవంతులేసుకున్నా నీళ్ళ కిందికి సరిగా దిగడం లేదు. బురద మడిలో తగినన్ని నీళ్ళ లేకుంటే పిట్టక దున్నడం వీలుగాదు. మడి సరిగా అదునుగాదు. ఎత్తులు తగ్గాలంటే మడి కయ్యల్లో నాలుగు మూలలా నీళ్ళ కలుసుకోవు. వరినాట్లు సరిగా అతుక్కోవు. కలుపు మొక్కలు ఎక్కువగా పడతాయి. అసలే మొరుసు నేల. నీళ్ళ నిలపడానికి నానా తంటాల పడినాడు చెన్నప్ప.

సేద్యంలో చెన్నప్ప వొంటిగాడే. జీతగాన్ని పెట్టుకొని సేద్యం చేయించుకో గలిగినంత పొలం లేదు చెన్నప్పకు. చెరువు కింద రెండెకరాలు మడి, గుట్ట పక్కన ఐదెకరాల చేను మాత్రమే అతనికున్న ఆస్తి. కొడుకు లిద్దర్నీ మొదట సేద్యానికి వేసుకుందామనుకున్నాడు. కానీ రానురానూ వ్యవసాయం జూదంగా మారి పోవడం చూసి విసిగిపోయి గంపెడంత ఆశతో వాళ్ళిద్దర్నీ చదువుకోడానికి పంపుతున్నాడుచెన్నప్ప. రాయదుర్గంలో పెద్దోడు బి. ఏ, చిన్నోడు పదో తరగతి చదువుతున్నారు.

బొమ్మక్కపల్లికి రాయదుర్గం దగ్గరే, కొడుకు లిద్దరూ చిన్నప్పట్నుంచీగోముగా పెరిగి సేద్యం పనులకు 'తరము' గాక పోయినా, ఇంట్లో తిని టవును కెళ్ళి చదువుకొని సాయంకాలానికి ఇల్లుచేరుకుంటారు కాబట్టి వాళ్ళ చదువులు చెన్నప్పకు మొన్నటి దాకా బరువనిపించలేదు. కానీ కాలం తారు మారయింది. సకాలంలో వర్షాలు రాక, సరిగా పంటలు పండక బతకడం కష్టమయి పోయింది. ప్రతి

పనికి బదులు చేసుకోవడం సాధ్యం కావడం లేదు. కూలి పెట్టి చేయించు కుందామంటే సంసారం జరగడమే గగనమై పోయింది. చేతికొచ్చిన కొడుకు లిద్దరూ చదువులో పడిపోయినారు. రామప్ప నాయుడు కొడుకులూ, కొండా రెడ్డి పిల్లలూ పెద్ద చదువులు చదువుతూ వుంటే, పులిని చూసి నక్క వాత పెట్టు కున్నట్లు చెన్నప్ప కూడా పుట్టినకొడుకు లిద్దర్నీ చదువుకు వేసినాడు.

తన తర్వాత డుకుల బతుకు ఏవిధంగా సాగుతుందో అని అప్పు డప్పుడు చెన్నప్ప తర్కించుకుంటూ ఉంటాడు. ఏమయినా వాళ్ళ బతుకు రెండింటికీ చెడిన రేవడవుతుందేమోనని దిగులు పడుతూ ఉంటాడు. చెట్లూ చేమలతో పచ్చగా కలకలలాడే పొలా లతో, సంక్రాంతి దాకా ఎక్కడ చూసినా జోము లెత్తిన భూములతో ముక్కారు పంటలతో గడిచిపోయిన కాలాన్ని చూసి నాడు తాను. అటువంటిది తన కళ్ళ ముందే వూహించనంతగా తారుమారయి పోయింది. జరుగుతూ వచ్చిన మార్పు లన్నీ తలచుకొని ఒక్కొక్కసారి ఆశ్చర్యపోతాడు చెన్నప్ప. మనుషుల్లో తన చిన్నతనంనాటి మంచితనం, మను షులమీద నమ్మకం, పనులపట్ల శ్రద్ధ, పట్టుదల, మమతలూ మమకారాలూ, పెద్దా చిన్నా అనేవన్నీ ఏమైపోయాయా అనుకుంటాడు. అంతా కాలమహిమ అని తనకు తాను సమాధానం చెప్పుకొని నిటూరుసాడు.

చెన్నప్ప మడిని అదును చేస్తుంటే భార్య సుబ్బమ్మ ఇంటి పనులు చూసుకో సాగింది. కూతురు లీలావతి ఇరుగింట వాళ్ళకూ పొరుగింట వాళ్ళకూ పనికి పోయి కష్టపడి పదిమంది బదులు మను షుల్ని చేసింది. నిన్నా ఈ రోజూ తల్లీ కూతుళ్ళిద్దరే. వరి నారంతా పీకి నాట డానికి సిద్ధంచేసినారు. రేపు మడినాటించ డానికి బదులు మనుషులకు తోడు మరో ఇరవైమంది కూలివాళ్ళను పిలవాలని పొద్దుండగానే తల్లీ కూతుళ్ళిద్దరూ ఊరు చేరుకున్నా న్నప్ప మడిలో గెనుము గెనుమూ తిరుగుతూ, గుమ్మ ళ్ళన్నీ వేసి, తీరుబండలన్నీ అనేసి చీకటి పడుతుంటగా ఇంటి ముఖం పట్టినాడు -

'చిత్తకార్తె యెల్లిపాయ, కాలంతప్పిన పైరు పెడతాండాం. ఏమయితుందో ఏమో! బాయిలుండే వాళ్లేమో సకాలంలో నారు పోసుకొని, ఆయిగా నాటుకుండ్రి. రొంత బాయిగుంత తొవ్వే కుండేదీ మేలు బాయికే మోటారుకి ఎట్లలేదన్నా ముప్పైవేలు కావల్ల అంత లెక్కంటే మాట్లా? యాడన్నా బాకీ తెచ్చి ఖర్చు పెడితే గాంగ నీళ్ళుపడితాయని నమ్మక మేముంది? సమ్మత్సరం సమ్మత్సరమూ వాన్లు జూస్తే పూర్తీ ఎడపెడతాండాయి. నిరుడు సేనిపంట ముంత మోసిపాయ. మడిలో రాగి నాటితే తీరా నోటికొచ్చి నంక నీళ్ళు సాలక పంటంతా పూసి పాయ. పది మూట్లు రాగులు కూడా కాక పాయ. ఈ ఏడేమో తొలి ముంగార్ల రెండు వానలు దాగనే నదెగానీ మంచి

పైరులో చినుక నేల బడకపోయ. శెనిక్కాయి పిందెలన్నీ గర్భంలోనే కరిగి పోతాండాయి. తీరా అదును తప్పిచ్చి చెరువేమో తప్పాదార్ల నిండుకుండె. అవేందో అరున్నర వొడ్లంట, అందరూ అవే నాటతాండారు. యెట్లయితాయో యేమో మల్ల! కూలోల్లకేమో శానా గిరాకీగా వుంది. బదులు మనుసులు గాక మడి నాటేకి యెట్ల లేదన్నా ఇరవైమంది కావల్ల. కూలి జూస్తే తారకమంటుతాంది. నిరుడు పద్దైదు రూపాయిలుంటే ఇసారి ఇరవై చేసినారు. అంతింత కూలి ఇచ్చేదిగాక, మల్లా పయిటాలప్పుడు బువ్వ కూడా పెట్టల్ల. ఇంట్లో బియ్యపు గింజలు బొత్తిగా లేవు. రాగి ముద్దంటే కూలోల్లు గొనుగుతారు. ఇంట్లో గూడా పిల్ల నాయాల్లకు ముద్ద తినీ తినీ బేజారయింది. యేం జేస్తాంమల్ల? రైతు బియ్యం కొని తినేకి అయితుందా? నెలకొక పది సేర్లు బియ్యం యెయిమని స్టోరు రంగారెడ్డిని అడిగితే ఆయప్ప బుద్ధి బాగున్నెప్పుడు యేస్తాడు. లేకుంటే లేదు. గట్టిగా అడిగితే 'మీది బియ్యం కార్డు కాదప్పా' అని గద్దిస్తాడు. నేను పెద్దకారు రైతునంట. ఎంత బాగుందో కాలం!' బతుకంతా లోలోపలే వెల్లబోసుకుంటూ ఇల్లు చేరుకున్నాడు చెన్నప్ప.

రేపు మడి నాటడానికి సుబ్బమ్మ బదులు మనుషులకు తోడుగా కూలోల్లను పిలిచింది. అయితే ఎవరూ 'ముగబడడం' లేదు. తమతోపాటు భూమి 'ఆసాముల' కూడా పొలంలో వొంగిపని చెయ్యడం కూలోల్లకు ఇష్టముండదు. వాళ్ళు నడుం పైకెత్తనీయరు. మాట్లాడుకో నియ్యరు. రామప్ప నాయుడు తోటలోనో, సుంకయ్యసెట్టి మడిలోనో, పూజారి వెంకప్ప శాస్త్రి పొలంలోనో పని చెయ్యడమంటే కూలోల్లకు చాలా ఇష్టం. వాళ్ళెవరూ పొలంలో కూలోల్లు వెనక నిల్చుకోరు. అంతా జీతగాళ్ళు చూడాల్సిందే. ఇంకేముంది? కూలోల్లు ఆడింది ఆట. పాడింది పాట. పనిచేసినట్లే అగుపించదు. రెండ్రుపాయలు కూలి తక్కువయినా వాళ్ళ పనులకే పోతారు. అందుకే సుబ్బమ్మ ఇరవై మందిని పిలిస్తే అయిదు మంది కూడా 'పూకొట్ట' లేదు. ఏమి చేయాలో సుబ్బమ్మకు దిక్కుతోచలేదు. ఆందోళన చెందుతూ దిగులు పడుతూ కూలోల్ల కోసం వెతకసాగింది-

'ముందుగా నారపీకి పెట్టుకోవడం వల్ల అంతా'యెడామడి'పని అయిపాయ. కూలోల్లు ఇట్ల చేస్తారనిఎవురికి తెలుసు? అదును జూసి అందల మెక్కడం కూలోల్ల కూడా నేరుసుకుండారు. ఇంగ రైతులు సేద్దెంచేసుకుండేకి అయితుందా? అందరూ గాలి పొయ్యే తప్పుడుతూరుపు పోసుకుండే వాల్లే. బిర్రుగావొంగి సక్కరమంగా పనిజేస్తే పది పండెండు మంది సాలు యెకరా మడి నాటెయిడానికి. అట్లాది ఎకరాకు నన్నూరు రూపాయిలు వొప్పంద మడిగితే యావల్లన ఇచ్చేది? బూములన్నీ అమ్ముకొని పూరికే కూలి పనికి తిరుక్కుండేది మేలు, ఈ దిగులన్నా తప్పుతాది. ఈ బూములు కట్టుకొని ఏం పాముకుంటాండా గనక? రైతులమని, మాకూ ఇంత బూముంద

సంకలెగిరేసు కోవల్సిందేగానీ రాత్రిం బగలూ పనేమో తప్పడంలేదు 'దమ్మిడీ ఆదాయంలేదు, దొట్టు పురుసత్తులేదు' అన్నెట్లుంది, 'ఈ సేద్దం చూస్తాంపే' అనుకుంటూ గేరిగేరి తిరిగింది సుబ్బమ్మ. పీకిన నారు చెడుబాటవుతుందని కడాకు ఎకరాకు మున్నూరు రూపాయలప్రకారం రామక్క గుంపుకువొప్పించింది. వొప్పిం చిందేగానీ వొప్పందాల వాళ్ళ మడిలో వరినాట్లు వేసేది తలచుకునే సరికి సుబ్బమ్మకు వేపకాయ నమిలినట్లయింది. చిరాకు పడుతూ ఇల్లు చేరుకుంది.

చెన్నప్ప బలవంతంగా చిన్న కొడు కును బడికి పోకుండానిలుపుకొని మడిలో 'మునాలకు' నారకట్టలు వెయ్యడం చూపించినాడు. కూలోల్లు వచ్చేసరికి ఇద్దరూ నార కట్టలన్నీ మడిలో 'నెరేసి నారు'.

రామక్క తన గుంపునంత 'పురమా యించి' కొని మద్దాన్నం నుంచి ఇంకొ కరి పొలంలో ఎకరా మడి నాటెయ్యా లని 'పొద్దుగలగ' వచ్చి సుబ్బమ్మ వాళ్ళ మడిలో వొంగింది. బదులు మనుషులు కూడా వచ్చి వొంగినారు. మొత్తంఇరపై మంది తూరుపు మొగంచేసి మునాల్లో వొంగినారు. రామక్క అందర్ని 'కూడ బలుక్కొని' చెప్పేది చెప్పి మొదట మునంలో వొంగింది. ఎడమ చేతిలోని నార 'గుదులు గుదులుగా' కుడిచేతి లోనిక్కీ, కుడిచేతిలోనిది భూమిలోనిక్కీ జారిపోతూవుంటే అందరి చేతులూ యంత్రాలమాదిరి ఆడసాగినాయి. వాళ్ళకు నార కట్టలు అందించ లేక చిన్నకొడుకు అవస్థ పడుతూ వుంటే చెన్నప్ప వాన్ని కసురుకోసాగినాడు.

సుబ్బమ్మ, లీలావతి 'ముద్దల పుట కలు' నెత్తిన మోసుకొని వొచ్చేసరికి కూలోలు మునమెలినారు. సుబ్బమ్మ ఆశ్చర్యపోతూ పుటకదించింది. ఆవరా వాపలా మునం దగ్గరికి బొయ్యింది కూలికయితే వొక రకంగా, వొప్పందమయితే మరొక రకంగా పని చెయ్యడం నేర్చుకున్నారని గొనిగింది. నాట్లు సరిగా వెయ్యలేదని, బయళ్ళు బయళ్ళు ఖాలీ పెట్టినారని, కుచ్చులు కుచ్చులు నార నాటినారని నోరు చేసింది. 'మీరూ సేద్యాలు చేసుకుంటాండారు గదా మల్లా ఇంతద్దుమానమా?' అంటూ బదులు మనుషుల్ని చూసి గట్టిగా అరిచింది.

సుబ్బమ్మకీ రామక్కదీ పుట్టినిల్లు ఒకే వూరే. ఇద్దరూ పేద సంసారాల్లో పుట్టిన వాళ్ళే. పిల్లప్పటి నుంచీ తెలిసిన సుబ్బమ్మ అంతగా నోరు చేసేటప్పటికి రామక్క వోర్చుకోలేకపోయింది. పైకి లేచి 'యేందమ్మా దొరే గొనుగుతుం దావు? ఇంత కన్నా నాట్లు యెప్పుడన్నా యేసుచ్చుకోనుంటనా?' అని సుబ్బమ్మ పైపురుస రుస చూస్తూ చీదరించుకొని విసురుగా వొంగింది. 'సింతకాయలమ్మే దానికి సిరిమానమొస్తే వంకర టింకర కాయలు ఇనేమి రాయలన్నెంట' అని చెప్పి పొడిచింది. సుబ్బమ్మ ఇంకేమీ మాట్లాడలేక పోయింది. తనలో తాను గొనుక్కోసాగింది. 'చూల అంగలా స్తావు రేయే. తీసుకుందే కూలి, వాళ్ళ కయినా కడుపు నంటల్ల గదా' అని

చెన్నప్ప సుబ్బమ్మను వోదార్చినాడు. 'అంగలాయకుండా నీ మాదిరుండే నెత్తిన గుడ్డ యేసుకొని పోవల్సిందే. నోరు లేనోని మాదిరి నీయంతకు నువ్వు పని చేసుకుంటుంటే పనికి వొచ్చినోళ్ళు నీయాకట్ల పని చేస్తారనుకుంటినా? ఇట్ల చూస్తువుగా. మూరెడు కొకటీ బారెడు కొకటీ యెట్ల నాటినారో? కన్న తిప్పలు పడి వేలు వేలు అప్పు తెచ్చి కట్పెట్టి ఇంతద్దు మానంగా మడి నాటిప్పిస్తే 'ఇత్తగిలుసు' కుంటే యేం పంట పండు తుందనుకుంటావు? గోవట్టా మనిసివి, రోంతన్నా చూసుకుండేది లేదా!' మొగుని మీద విరుచుకు పడింది సుబ్బమ్మ.

ముందే ఆకాలం పైర్లు. వొత్తుగా నాటుకుంటే తప్ప మడి బాగుండదు. కలుపు ఎక్కువగా పడుతుంది. సంసారా నికి వచ్చినప్పటి నుంచీ వరి మడిలో నాట్లు ఏ విధంగా వుంటే బాగుంటుందో సుబ్బమ్మకు బాగా తెలుసు. అందుకే ఎంత నిదానమన్నా కానీ మడి నాటెయ్య డానికి తగిన బదులు మనుషులను చేసు కొని మడి నాటించుకుంటుంది సుబ్బమ్మ. వొప్పందానికి ఇవ్వడం ఆమెకు బొత్తిగా నచ్చదు. ఈసారి తప్పలేదు. అయినా సరాయి వాళ్ళ పనులంటే అవేదో పొద్దు బుచ్చుకోడానికి అయినట్లు భావించడం, తమ పనులయితే జాగ్రత్తగా చేసుకో వడం ఈ మధ్య కాలంలో బాగా కని పిస్తున్నది. తమను కూలికి పిలిచే రైతుల్ని పెద్ద షావుకార్లుగా అనుకొని, తమ కష్టా న్నంతా [illegible] దోచుకుంటున్నట్లు కూలోళ్లు ప్రవర్తించడం సుబ్బమ్మ వంటి వాళ్ళకు బాధ కలిగిస్తూ వుంటుంది. పనికి వచ్చి కూలి డబ్బులు తీసుకొని పోయే వాళ్ళకూ, కూలి లేకుండా తమ పొలాల్లో పొద్దస్తమానమూ పని చేసుకునే రైతు కుటుంబాల వాళ్ళకూ మధ్య తేడా అనేది సుబ్బమ్మకు కనిపించదు. వున్న తేడా అంతా వొకటే, పైకి గుంభంగా కనిపిస్తూ లోపల అప్పుల బాధలతో సతమతమ వుతూ సేద్యాలు చెయ్యడం తమ వంటి రైతుల పనయితే ఏ 'బాదర బందీలూ' లేకుండా చేతనయినంత పనిచేసి నాలుగు డబ్బులు చేతికిప్పించుకొని సాయంకాలాని కల్లా గూడు చేరుకొని చేతులు దులుపు కోవడం కూలోళ్ల పనయిందని ఆమె అనుకుంటూ వుంటుంది. ఈరోజు ఆమె మరింత బాధ పడింది.

మధ్యాహ్నమయింది. రెండెకరాల మడి నాటడం అయిపోయింది. నాట్లు చూసిన సుబ్బమ్మకు మళ్ళకింద పారాడి నట్లయింది.

కాళ్ళూ చేతులూ కడుక్కొని అందరూ కాలువ గట్టమీద కూర్చున్నారు. లీలావతి తలా కొక ముద్ద చేతి కందించింది. అందరూ ముద్దల మధ్య గుంతలు చేసు కున్నారు. సుబ్బమ్మ ముద్ద గుంతల్లో 'అలసందుల పులుసు' పోసింది. ముద్ద తింటూ ఒకరిద్దరూ, 'ముద్దలో కాసిన్ని బియ్యపు నూకలు అడుగులన్నా పొయ్యొద్దా? ఇండ్లో ఇట్లనే చేసుకొని తింటామా యేమి?' అని మెల్లగా గొణిగి నారు.

'నాలుగు సేర్ల బియ్యపు గింజలే

గతిలేకపాయెనా? పుత్తపిండి పోసి ముద్ద గెలుక్కొని నాకుంపే యేమి? కాడ బెట్టిందంతా మెంటదీసుకొని పోతా రో!' అంటా చేతిలో వున్న బాదమాన్సు కాలువలో పడేసి చేతులు కడుక్కుంది రామక్క. సుబ్బమ్మకు ప్రాణం పోయి నట్లయింది.

ఆకలి రుచి యెరగదంటారు. రుచి ఆకలని ఎగతాలి చేస్తుండంటారు. ఏది ఏమి చేస్తుందో అర్థం కాని కాలనది- చెన్నప్ప, గొంతులో 'పర్రు'పోయి పెక్కు తాగాడు.

* * *

'దసిమి పండగొచ్చె. వెనిక్కాయి చెట్లు సావరా బరిక్కా పానం పట్టుకొని వుండాయి. వారం పదినాల్లో వాగ వానన్నా పడితే చెట్లోగట్ల నాలుగు వెనిగ బుడ్డలన్నా అయితాయి. అంతో ఇంతో అప్పుదెచ్చి వయినాక మాసంలో ఆ పిల్ల పెండ్లన్నా చెయ్యొచ్చు. బగవంతుడు యేం జేస్తాడో మల్లి? కడాకు ఇత్తనాలన్నా తిరుగుతాయో లేవో, ఇంగ మడి చూస్తే కామిలా పడిన మనిసి మాదిరి ఇగిలిచ్చుకొని వుంది. ఎన్ని మందులు కొట్టినా యేట్లో పిసకిన సింతపండుమాదిరి అయిపోతోంది. నల్లా వొగసారి కలుపు తీయిచ్చి ఇంగొగ మూట యూరియానన్నా యేస్తే బాగుండేని. ఈటికే మడి మింద రెండు వేలు కర్చొచ్చింది. కడాకు బూమమ్మ తల్లి యేం జేస్తుందో యేమో!' బండి బాడ వెంట గిత్తల వెనక పచ్చిగడ్డి నూపెత్తుకొని నడుస్తూ ఆలోచిస్తున్నాడు చెన్నప్ప.

ఆకాశంలో మేఘాలన్నీ పగిలిపోయిన పాల మాదిరి, గాలికి ఎగిరిపోయే దూది పింజల మాదిరి తిరుగుతున్నాయి. ఆకలి గొన్న ఏనుగులాగా గాలి అరుస్తూ వీస్తూ వుంది. పచ్చదనమూ లేక ఎండిపోనూ లేక గాలికి వూగులాడే 'కొన్న వాగుడు' మాదిరి చెన్నప్ప ఆలోచనలు సాగిపోతున్నాయి. క్రమంగా చీకటి కమ్ముకుంటూ వుంది.

చెరువు కింద వరి మళ్ళల్లో ముమ్మరంగా కలుపులు తీస్తున్నారు. అక్కడక్కడ మగవాళ్ళు గెనుముల మీద తిరుగుతున్నారు. చిన్నపిల్ల నాయాళ్ళు గెనుముల కిందున్న రంధ్రాల్లో చేతులు పెట్టి ఎండ్రకాయల్ని, మట్టి కుడదల్ని పట్టుకుంటున్నారు. వాటిని కాల్చుకొని కారంలో నలుసుకొని 'పయిటాల' ముద్దలో తినాలని సంబరపడుతున్నారు. పదేండ్ల పిల్లలు మొదులుకొని ముసలి ముతకా ఆడవాళ్ళంతా గుంపులు గుంపులుగా పొలాల్లో వొంగి కలుపులు తీస్తున్నారు. అక్కడక్కడ జానపదాలు వినిపిస్తున్నాయి. ముందుగా ఒకామె పాడితే ఆ చరణాన్ని అందరూ అందుకొని పాడుతున్నారు. కొన్ని గుంపుల్లో కీచులాటలు వినిపిస్తున్నాయి. మరొకచోట వరుస కలిసిన వాళ్ళు సరసాలాడు కుంటున్నారు. కొంత మంది వూరి సుద్దులు చెప్పుకుంటున్నారు. ఎండకు వుక్కబోసి చెమట పట్టిన వాళ్ళ శరీరాల మీద అప్పుడప్పుడు మేఘాలు నీడలు పడుతున్నాయి. చెలికాని వోర చూపుల తాకిడితో వొయ్యారాలు పోయే పల్లెటూరి కన్నెపిల్ల వలపు

హొంగులాగా పిల్లగాలి స్పర్శతో పుల కించిన పైరు కన్నెలు తెరలు తెరలుగా గిలిగింతలతో నేలతల్లి హృదయ వేదిక మీద నాట్యమాడుతున్నాయి ఆనాట్యంలో పరువు నిండిన కళ కనిపించడం లేదు.

సుబ్బమ్మ పది మందితో పాటువొంగి తమ మడిలో కలుపు తీస్తూవుంది. వచ్చిన పది మందిలో ముగ్గురు సన్న పిల్లల తల్లులు. నలుగురు లంగా కూడా సరిగా కట్టుకోవడం రాని చిన్న పిల్లలు బతుకు మార్గంలో అప్పు డప్పుడే అడుగు పెట్టిన వాళ్ళు. ఎక్కడి కలుపు అక్కడే పెట్టి మాటమాటికీ పైకి లేస్తూ వొళ్ళు విరుచుకుంటున్నారు. వాళ్ళ వెనక మునాల్లో కనిపిస్తున్న కలుపు మొక్కలను చూపిస్తూ సుబ్బమ్మ వాళ్ళను దండించింది.

'యాలకసురుకుంటావొదినా?అందరూ ఉతకల్లగదా! మనమంతా పుడతానే పని నేర్చుకోనుంటిమా? 'దడెమెచ్చో తగ్గో' చేసుకుంటూ పోతా వుంటే వాళ్ళే నేర్చు కుంటారు' అంటూ ఆ చివరున్న మల్లక్క సర్ది చెప్పింది.

'నువ్వు చెప్పేది బాగనే వుందమ్మా, కూలేమో పెద్దోళ్లతో పాటు కావాల్సిందే. పనేమో చాతగాదు. నేర్చుకోడానికి మా పొలమే దొరికిందా? పని చేసేకి చాతగా నప్పుడు యాల రావల్లమ్మా? మాకే మన్నా ఇక్కడ దుడ్లు చెట్లకు కాసినా యను కుండారా? కోపగించుకుంది సుబ్బమ్మ.

'మీకు దుడ్లు చెట్లకు కాసినా ఇక్క డెవురూ తేరగ్గా రాలేదులేమ్మా పీక్క పోడానికి' సాగ దీసింది మల్లక్క.

'నువ్వేమో శానా ఇదిగా మాట్లాడు తాండావుగానీ ఇట్ల జూస్తువురా మల్లక్కా. మేమూ పరాయి వాళ్ళకు పనులకు పోతాండాముగానీ యానాడన్నా ఇట్ల చేసింటమా? 'పూదర గంటలన్నీ' ఈపిల్ల యెట్ల వొదిలేసిందో రొంత చూస్తు రాండమ్మా' అని సుబ్బమ్మ గట్టిగా నోరు చేస్తూ చూపించింది. మల్లక్క కోపంగా వచ్చి, 'సిగ్గూ సెరమూ వుండే నాసవు తులు అనిపిచ్చుకో గూడదు' అంటూ ఆ పిల్లను 'కసురుకొని' పూదర గంట లన్నీ పెరికేసింది. కొంత మందిఅక్కడ మాట్లాడితే, కొంత మంది ఇక్కడ మాట్లాడినారు. అందరికీ సర్ది చెప్పినాడు చెన్నప్ప.

సన్నపిల్లల తల్లులు పిల్లలకు పాలిచ్చి రావడానికివూర్లోకిపెళ్ళినిక్కుతూనీల్గుతూ వచ్చినారు. వాళ్ళ పెండ్లి నడకలు చూసి సుబ్బమ్మకు అరికాలు మండింది. కానీ బయటికి మాత్రం ఏమీ అనలేక పోయింది. పదిమందితో పొద్దుండగానే కలుపు తీసేది అయిపోతుందనుకుంటే ఇంకా పది మంది పట్టేటట్లుంది. పొద్దు వాలే కొద్దీ సుబ్బమ్మ మనసు బరువయి పోయింది. ఎట్లన్నాగానీ కూలోల్ల పైకి లేచే పొద్దుకు ఆ మునమున్నా సాగితే బాగుండుననుకుంది.

'బాలాజీ బస్సు పాయనర్రా, ఇంగ లెయ్యండి' అంటూ మల్లక్క పైకి లేచింది. ఆమెను చూసి అందరూ నడు మెత్తారు.

'అప్పుడే లేస్తిరేమ్రా? ఇంగా ఎంత పొద్దుందో సూడండి' అంటూ సుబ్బమ్మ ముఖమంతా గంటువేసింది. ఒక గుంపును చూసి మరో గుంపు పైకి లేయసాగింది. అందరూ కీసరబాసర మంటూ గెనుముల మీద పరుగెత్త సాగి నారు. ఎవరి బతుకు వాళ్ళది. చిన్న పిల్లలు ఏడుస్తూ వుంటారని వొకరూ, వూరి నుంచీ బంధువులు వచ్చి వుంటా రని మరొకరూ, బొయిలోకి కట్టెలు చూసుకోవాలని వొకరూ, నీళ్ళు తెచ్చు కోవాలని ఇంకొరూ, సినిమాకు పోవల్లని మరొకరూ-ఎవరి తాపత్రయం వాళ్ళది. ఆ హడావిడిలో సుబ్బమ్మ వంటి వాళ్ళ గొనుగుడు కానీ చెన్నప్ప వంటి రైతుల మూగవేదన కానీ వినేదెవరు?

మార్గశిర మాసమొచ్చింది. తుపా నుతో నాలుగు రోజుల జడివాన పట్టు కుంది. చేన్లో పీకి వోదికి వేసిన వేరు శనగ కట్ట అంతా వాన జల్లుకు తడిసి నల్లగయి కుళ్ళిపోయింది. పశువుల మేత అన్యాయమయింది. వాన తెరపి ఇచ్చిన మరుసటిరోజే రైతులంతా 'అదరబాదరా' గదా శెనక్కాయలు పెరికించసాగినారు. లేకుంటే కాయలన్నీ తేమకు బూజుపట్టి గబ్బుయిపోతాయి.

శెనక్కాయలన్నీ సగం లొత్తలు. మధ్యలో బొత్తిగా వర్షం లేక ఒక్క కాయ కూడా సరిగా వూరలేదు. వచ్చే పంటకు విత్తనానికి పనికొచ్చే రకంగా లేవు. చూస్తూ చూస్తూ పంటను వదలు కోలేక, డబ్బా కాయలకు నాలుగు రూపా యలిచ్చి పెరికించ లేక చెన్నప్ప కుళ్ళి పోయినాడు. చిన్నచిన్న పిల్ల నాయాళ్ళ చేతుల్లో సాయంకాలానికల్లా ఇరవై ముప్పై రుపాయలు మెదిలాడుతూవుంటే చూస్తూ నీళ్ళు నములు కున్నాడు. తన సంసారాన్నీ కొడుకుల్నీ విషవలయంగా చుట్టుకున్న వ్యవసాయాన్నీ మనసులో అనుకొని బరువుగా నిట్టూర్చినాడు చెన్నప్ప.

చెరువు కింద వరి మళ్ళు కోతకు వచ్చినాయి. సగానికి సగం 'బొందు పోయినాయి.' వాన లేక, నీళ్ళు సరిగా అందక కొన్ని ఎండి పోయినాయి. రుతువు తప్పి పైరు పెట్టడంతో దోమ పోటు తెగులొచ్చి మరికొన్ని నల్లగా మాడిపోయాయి.

చెన్నప్ప ఆశలన్నీ చెదిరి పోయాయి. చేని పంటను నమ్ముకుంటే అది అన్యా యం చేసింది. అయిదెకరాల్లో శెనక్కా యలు ఇరవై మూటలన్నా రాలేదు. అవి చూస్తే సగం లొత్తలు. విత్తనాలన్నీ నాసులు. అమ్ముదామను అనుకుంటే అడిగే నాథుడే లేడు పంటంతా చూస్తే ఖర్చులు కూడా ఎల్లలేదు. ఇంక వరి పంట అను కుంటే అది మరీ 'అధ్వాన్నం.' దోమ పోటు తెగులొచ్చి పైరంతా నల్లగా మాడి పోయి నేల బట్టింది. గింజనే కనిపించడం లేదు. కోయిస్తే గానీ ఎంత పంటవు తుందో తెలీదు.

చెన్నప్ప మడి కోయించడానికి కూలోల్ల కోసం వూరంతా తిరిగి దిగువ గేర్లో వుండే కురాకుల తిమ్మప్ప దగ్గరికి పోయినాడు.

'మడి కోతంటే మాకు ఏాలి గిట్ట దన్నా. పిల్లకాయలంతా టవున్లో పనికి మరిగినారు. ట్రాక్టరుకో, ఇటిక పెల్లల బట్టీకో, సేట్లారి పనికో, అమాలీ పనికో పోతే సందకాటికల్లా సులకాగ యాబై కి తక్కువ గాకుండా తెచ్చుకుంటారన్నా. నీడపాట్న ఆయిగా ఆడతా పాడతా మూన్నాలుగు సార్లు కాపీ టీలు తాగుతా పని చేసుకుండేవాళ్ళు ఆ మళ్ళల్లో పొద్దస్తమానమూ బురదలో పడి యాడ పని చేస్తారన్న,' అంటూ తిమ్మప్ప చేతులు వెల్లకిల వేశాడు.

చెన్నప్ప ప్రతిమాలినాడు. ఇంకా రెండు దినాలుంటే 'పసుల కాటు, ఎక్కువవుతుందని పైరంతా చేతికి దొరక్కుండా పోతుందని ప్రాధేయపడి పిలిచినాడు.

దోమపోటు తగిలితే వడ్ల గింజలు బాగుండవనీ, నేలబట్టిన పైరును కోయడం చాలా కష్టమనీ, టవున్లో పనికి వొప్పుకున్నామని అదనీ ఇదనీ గొణిగినాడు తిమ్మప్ప. కడాకు కూలికయితే రామనీ, వొప్పందమయితే వస్తామనీ చెప్పినాడు. ఎకరా మడికోసి, పడుకేసి, పడుగు పీకడానికి ఆరు మూటల వడ్లు ఇస్తే చూస్తామని, పడుగు తిప్పడం తమ పని కాదని కరారు చేసినాడు. చెన్నప్ప కాసేపు తటపటాయించి మెల్లగా వూ కొట్టినాడు. తిమ్మప్ప మర్నాడు మడి కోస్తామని వొప్పుకున్నాడు. చెన్నప్ప ఇంటికి బయలుదేరినాడు. ఆలోచనలు అతని వెంట నడుస్తున్నాయి-

'యట్లా కాలమొచ్చెనప్పా! పతి వొక్కడూ సులకాగ సంపాయిచ్చల్లని అనుకుంటాండాడు. అయినా యెవుర్నని యేం లాబం? దేశమంతా అట్లనే వుంది. కష్టపడి పని చెయ్యకపోయినా సంపాయిచ్చే నా కొడుకులు కోట్లు కోట్లు సంపాయిస్తాండారు. పైనుండేవాడు బాగుంటే గదా కిందుండే వాడు సరిగ్గా వుండేది!... యెవుని యుగితి కొద్దీ వాడు చేసుకుంటాండాడు. కడాకు రైతు బతుకేమో అధ్వాన్నమయి పోతానే వుంది. కూలోల్లను బతికిచ్చే తట్ల అయితాంది. పైన్నుండీ కిందిదాకా పతి వొక్కడూ కష్టాన్ని మించే లాబం పొందుతాండాడు. రైతు కష్టం మాత్తరం బూమిలోనే యింకి పోతాంది. పలితమేమో యెండమావిలోని నీళ్ళమాదిరి అయిపోతాంది. యెవురొచ్చి పాలించినా ఈ దేశంలో రైతు బతుకు ఇంతేనేమో' అనుకుంటూ ఇల్లు చేరుకున్నాడు చెన్నప్ప.

వడ్లన్నీ తూరుపు పోసి, తాలూతవకా దండికట్టులోకి నూకి గట్టి గింజలన్నీ రాసికేసినారు కూలోల్లు. చెన్నప్ప వడ్లరాసి చుట్టూ తిరిగి, గెరిగీసి మొక్కుని, తవ్వదీసుకొని కూలోల్లకు వడ్లు కొలిచి వేయసాగినాడు. మొత్తం పది మూటలే అయినాయి. ఇంకా రెండు మూటలు కూలోల్లకు తక్కువ బడినాయి. మొత్తం కల్లమంతా వూడ్చేసినట్లు కావడం చూసి సుబ్బమ్మ కళ్ళనిండా నీళ్ళు నింపుకుంది. చివరికి ఆయగాళ్ళకు కూడా మిగల్లేదు. దండి కట్టులోని తాలుగింజలు వాళ్ళ కష్టాన్ని చూసి ఎగతాలి చేస్తున్నట్లు కనిపిస్తున్నాయి. చెన్నప్ప ముఖమంతా చప్ప

(తరువాయి 40వ పేజీలో)




# నీళ్ళులేని బీద నాగరికతను ఆర్తితో చిత్రించిన కథలు

— డా॥ సూర్యసాగర్

కరువు కాటకాలు జీవితంలో నిత్య అంతర్భాగమైపోయిన రాయలసీమ ప్రజల జీవిత బీభత్సాన్ని ఆర్తితో చిత్రించిన పద్దెనిమిది కథల సంకలన మిది. ఇవి నీళ్ళు లేని ప్రజల బీద నాగరికతపై కథలు. ఈ కథలనిండా తాగునీటి కోసం, సాగునీటి కోసం వెతుకులాట. అరుగాలం శరీర కష్టం, పంట చేతికి దక్కని మనో వేదన ఆ ప్రజల గతి. ఎండిపోయిన బావులు, పాతాళం తవ్వినా నీరుపడని బండ బావులు, పశువులకి మేతలేక కసాయికి అమ్మివేయడము, పస్తులూ, వలసలూ వారి జీవిత వాతావరణం. శతాబ్దాలుగా ఎదుగూ బొదుగూలేని ఆ ప్రజల జీవనాన్ని గుది బండలాంటి మూఢ విశ్వాసాలు, సాంప్రదాయాలు, అవిద్య, కక్షలూ, కార్పణ్యాలు మరింత క్రుంగదీస్తున్నాయి. ప్రత్యక్షంగా చూస్తేగాని నమ్మశక్యంగాని దుర్భర పరిస్థితులు.

ఈ పరిస్థితిని మార్చడానికి మొసలి కన్నీళ్ళు కార్చడం తప్ప, శుష్క వాగ్దానాలు చేయడం తప్ప ప్రభుత్వాలు చేసిందేమీ లేదు. భారత ప్రభుత్వాల వైఖరి బ్రిటిష్ వలస పాలకులకన్నా ఏ మాత్రం భిన్నంగా లేదు. నాలుగున్నర దశాబ్దాల స్వతంత్ర పాలన తరవాత కూడా రాయలసీమ ప్రజల జీవనం వాన రాకడ మీద ఆధారపడిన జూదంగానే వున్నది. ప్రకృతి వైపరీత్యాలను అధిగమించి నీటి సమస్యను పరిష్కరించే ప్రయత్నాలు చేయకపోవడమేకాక, నీటి సమస్యను అవకాశవాద రాజకీయాలకు బలిచేసి తమ పబ్బం గడుపుకోవడమే పాలకవర్గ పార్టీలు, ప్రభుత్వాలు ఎంచుకొన్న లక్ష్యంగా ఉన్నది. అనివార్యం కానవసరము లేని క్షామ పరిస్థితులను నాటి రాచరికము, నిన్నటి వలస పాలన, నేటి బూటకపు ప్రజాస్వామ్య ప్రభుత్వాలు నిత్యానుభవం చేశాయి. పాలక వర్గాల సంకుచిత దోపిడీ ప్రయోజనాల మూలంగా దేశంలో వివిధ ప్రాంతాలు ఆర్థిక, సామాజిక అభివృద్ధిలో తీవ్ర అసమానతలకు గురి అయినాయి. రాయలసీమ వెనుకబాటు అందులో భాగమే.

క్షామ పరిస్థితులకు అలవాటుపడి నిరాశానిస్పృహలతో అణగారిపోయిన దిక్కుతోచని పరిస్థితి రాయలసీమ పల్లె ప్రజలది. ఈ స్థితి నుంచి విముక్తం కావడానికి వాస్తవికతను శాస్త్రీయంగా అర్థం చేసుకొని తమ అణచివేతకు కారణభూత

మైన సామాజిక శక్తుల్ని గుర్తించడానికి సాహిత్యం చేయూత నివ్వాలి. పోరాట క్రమము, మార్గము వారే ఎంచుకొంటారు. ఆ దిశగా రాయలసీమ రచయితలు ఆలస్యంగానైనా సరే అడుగు యేస్తున్నారనడానికి ఈ కథా సంకలనం ఒక నిదర్శనం. ఇందులోని ప్రతి కథా ఇతివృత్తము దాని సొంత వాతావరణంలో నడుస్తుంది. పాత్రలు, సంఘటనలు జీవన గతి తర్కాన్ని వెల్లడిస్తాయి. విశ్వసనీయత సంపూర్ణంగా చేకూరింది. వీటిని చదివిన రాయలసీమ పల్లెవాసులు మా కథలే ఇవి అనుకుంటారు.

ఒక్క "నీళ్ళు" (స్వామి) కథ మినహా అన్ని కథలూ గ్రామీణ జీవితానివే, సంకలనకర్త కోరి అలా ఎంచుకున్నారో లేదా రాయలసీమ రచయితలు అధికంగా అలాంటి రచనలు చేస్తున్నారో తెలుసుకొన వలసిన విషయమే. గ్రామీణ ప్రజా సమస్యల పరిష్కారంలోనే ఈ దేశంలోని ప్రజలందరి సమస్యల పరిష్కారము ఉందన్న గ్రహింపు కీలక ప్రాధాన్యత కల్గినది. "నీళ్ళు" కథలోని రాయదుర్గం పట్టణం కూడా ఒక పెద్ద సైజు పల్లెటూరే. రాయలసీమ వెనుకబాటుతనాన్ని సూచించే మరొక లక్షణమిది.

సంకలనంలో మొదటి కథగా ఉన్న "నీళ్ళు" రాయదుర్గం పట్టణంలో తాగు నీటి కరువుని చిత్రిస్తుంది. కొళాయిల వద్ద క్యూలు, కొట్లాటలు, రాత్రీపగలూ ఇంటిల్లిపాదీ కొళాయి నీళ్ళకోసం పడే ఆరాటం, ఇంటికొచ్చిన వారికి నీళ్ళ కరువై ఆతిధ్యం ఇవ్వలేని దీనస్థితి, వీధి కొళాయిల ఏర్పాటులో స్థానిక రాజకీయాల అవకాశవాదము—ఇదీ వాతావరణం. ఆలోచనల నిండా నీళ్ళ సమస్యే. 'నీళ్ళులేని వారికి ఏమి నాగరికత ఉంటుంది' అన్న రచయిత వాక్యం మొత్తం రాయలసీమ ప్రజల దీనదృశ్యాన్ని మన మదిలో మెదిలేటట్టుగా చేస్తుంది.

"హైనా" (కె.యం. రాయుడు) నిస్సహంగా కరువులో, పేదరికంలో లయిస్తున్న రైతుల కథ. కరువు బతుకులోని నిరాశనిస్పృహలు వారిలో అర్థరహితమయిన కసి, కోపాలుగా వ్యక్తమవుతాయి. భూమినమ్ముకొని పట్నం బోదామని పట్టుబట్టిన భార్య వసుంధరమ్మ చెంపను చెళ్ళుమనిపిస్తాడు నారాయణప్ప. అతని మనస్సులో గుర్తు తెలియని శత్రువు మీద కసి. పిల్లలను ఎత్తుకపోతున్న హైనాను పొడిచిపొడిచిచంపడంలోవ్యక్తమైనకసిదానికిప్రతీక. ఇంటా బయటా అనవసరపు హింస, తగాదాలకు హేతువవుతున్న కసి అదే. ఈ కథలో సూరన్న టీచర్ కరువుకీ అవినీతికర ప్రభాత్వాలకీ గల లంకెను వివరిస్తాడు. చిల్లర సహాయాల పంపిణీ ద్వారా ప్రజా చైతన్యాన్ని మభ్య పరుస్తున్న తీరును, హైనా బెడదను ఉమ్మడిగా ఎదుర్కొన్న గ్రామ రైతాంగం కరువును ఎదుర్కొనలేని పరిస్థితి మూలాల్ని వెతకాల్సిన అవసరాన్ని నారాయణప్పకు వివరిస్తాడు.

"మన్నుతిన్న మనిషి" (చిలకలూరి దేవపుత్ర) అనంతపురం తాలూకాలోని పల్లె ప్రజల మాండలికాన్ని చక్కగా పట్టుకొన్న కథ. వానలు లేక, పొలం మీద బతకలేక పట్నం చేరి చిన్నా చితక కూలీపనులు చేసుకుంటూ బతుకీడుస్తున్న కుటుంబ గాథ ఇది. పల్లెలోనే ఉండిపోయిన ముసలాయన తన కొద్దిపాటి భూమిని అమ్మడానికి ఇష్టపడడు. తండ్రిని ఒప్పించలేని భర్త రామచంద్రుడి అశక్తతనీ, మామ మొండితనాన్ని దుయ్యబడుతుంది ఓగులమ్మ. తన తండ్రి పెద్దరికాన్ని ఈసడించి మాటలాడడం సహించలేని రామచంద్రుడు భార్య ఓగులమ్మ వీపు మీద పిడిగుద్దులు గుద్దుతాడు. పల్లెకిపోయి ముసలాయన వద్దంటున్నా భూమి అమ్మకాన్ని ఖరారు చేయగా, భూమితో బంధం తెగిపోవడాన్ని భరించలేని ముసలాయన ఆ రాత్రే వాడిపోతున్న వేరుశనగ చేను మీద వాలిపోయి ప్రాణాలు విడుస్తాడు. ఆత్మీయ మానవ సంబంధాల్ని అద్భుతంగా చిత్రించిన కథ ఇది.

శాంతి నారాయణ "కల్లముంగాపాయ" అనంతపురం జిల్లా రైతుల జీవితాన్ని మాండలికాన్ని సజీవంగా నిలిపిన కథ. వాన కోసం ఎదురు చూపులు, వానరాక కోసం విరాటపర్వాలు చదవడమూ, గాడిదల్ని ఊరేగించడమూ మొ॥ ఆచారాలు చూస్తాం. వానరాక పంటలు ఎండిపోవడం, అకాలంగా తుఫాను వచ్చి పీకిన శెనక్కాయి పేడపేడ అయిపోవడమూ, శెనక్కాయలు వానలు లేక వత్తులు పడిపోవడమూ, కల్లం చేయడమూ ఇలా వారి జీవితాన్నే దృశ్యమానం చేస్తుంది ఈ కథ. వ్యాపారస్తులు ఎరువుల అప్పుల ఆసరాగా అవసరమయిన పురుగుమందులను తగలగట్టడము, వడ్డీ, లాగు సుంకడీల పేర్లతో రైతుల సొమ్ము విరచడమూ చూస్తాము "....దేవుని దగ్గర నుంచి అందరూ రైతును పీక్కుతినేవాళ్ళే. ఏమిటిదో...." అని బాధపడతాడు యల్లప్ప. "భూమమ్మను నమ్ముకొని ఏమి బాగు పడ్నాము? ఊరకనే ఈడుండి యాల కుళ్ళిపోవాల." అంటుంది నారమ్మ. కల్లంలో గింజలు ఇంటికి చేరక ముందే వ్యాపారస్తుల బాకీలకు హారతి కావడం, మొత్తం కుటుంబం ఊరొదలి పట్నవాసపు ఎండమావుల వైపు ప్రయాణం కట్టడం ఈ కథలో కళ్ళకు కడుతుంది.

"నమ్ముకొన్న నేల" (కేతు విశ్వనాథరెడ్డి) కథలో బీడు భూములు, ఎండిపోతున్న పంటపొలాలు, చేతులు మారుతున్న భూములు, అక్కడక్కడ పుట్టుకొచ్చిన ఫ్యాక్టరీలకు రైతులు కూలీలుగా పోవడం, దూర దూర పట్టణాలకు, నగరాలకు వలసలు పోవడము, పట్నంతో బతుకు నేర్పరచుకొన్న వారు భూముల్ని తెగనమ్మడము, భూములు అమ్ముదామన్నా కొనే దిక్కులేని పరిస్థితి, పల్లెలలో సంఘజీవనము అదృశ్యం కావడము ("....యూథ సమ్మేళాల ద్వారా కనపడే సంఘ జీవితము కూడా కనపడడం లేదు" అంటాడు రచయిత) ఈ దుఃఖజీవన దృశ్యం మన గుండెలపై బండరాయిలా పరచుకుంటుంది.

"అడుసు" (సింగమనేని నారాయణ) కథలో నానా కష్టాల కోర్చి పండించిన చీనీకాయలు అమ్ముకోవడంలో దళారీ వ్యాపారుల దోపిడికి గురయి చితికిపోయిన నారాయణప్ప చీనీ తోటని కసిగా నరికేస్తాడు. జీవితాన్ని ధారపోసి పండించిన పంట మార్కెట్ మాయాజాలంతో వంచింపబడే దారుణ వాస్తవాలు చూస్తాము. "ఒరే రంగయ్యా! దేశంలో సరుకులు తయారు చేసే వారంతా వాళ్ళ సరుకుకు వాళ్ళే రేటు నిర్ణయం చేసుకుంటారు....మనం పండించే పంట రేటుని మనం చెప్పుకొనేకి లేదు....ఏ వ్యాపారస్తుడో చెప్పాల్ల, ఏ గవర్నమెంటో చెప్పాల్ల....ఇది మన కర్మ అందామా! వాళ్ళ అదృష్టం అందామా" అని నారాయణప్ప వాపోతాడు.

రాయలసీమలో సర్వత్రా ప్రత్యక్షమే ఒక విషాద వాస్తవ దృశ్యాన్ని "కసాయి కరువు" (చక్రవేణు) చిత్రిస్తుంది. మేత, నీళ్ళ కల్పించలేక రైతులు తమ ప్రాణంలో ప్రాణం అయిన పశువుల్ని కబేళాలకు తెగనమ్మడం గురించి ఈ కథ చెబుతుంది. పల్లె ప్రజల్లో ఆత్మీయ సంబంధాలు, పశువుల పట్ల రైతుల మమకారము, బతుకలేక వలసలు పోవడాలు, కలబంద గడ్డలు తిని ప్రాణాలు నిలుపుకొంటున్న దీనపరిస్థితి, తీవ్ర అనావృష్టి ఇవన్నీ ఇతివృత్తానికి తగ్గ వాతావరణాన్ని చక్కగా కల్పించాయి. "తెల్లోడొచ్చింది చూసినా, ఎవుడు పోయినా వచ్చినా ఈ రాజ్జెంలో కరువు మాత్రం పోలేదు. పట్టించుకొనే నాధుడూ లేడు...." అని నిట్టూరుస్తాడు తిమ్మయ్య తాత. "....రాజ్జమేలే మనుషుల కన్నా గొడ్లే మేలురా" అని రోదిస్తుంది కర్రావుని కసాయికి అమ్మిన నాగమ్మ.

బాలల బాల్యం మీద నీటి కరవు పరచిన విషాదం చిత్రణ "గుక్కెడునీళ్ళు" (దాదా హయత్) కథ. మైళ్ళ దూరం నుంచీ నీళ్ళు మోయడానికి ఖర్చవుతున్న బాల్యాన్ని ఈ కథలో చూస్తాం. గుక్కెడంటే గుక్కెడు తాగునీళ్ళు లేక ప్రాణాలు కోల్పోయే దుస్థితి వాస్తవమౌతుంది. కడుపులో చుక్క గంజి కూడా లేక మైళ్ళ దూరంలో వున్న కోనేరు నుండి నీళ్ళు మోసుకొచ్చే చిన్నారి పోలి బాల్యం కదిలే విషాద కావ్యం. హృదయాన్ని పిండివేసే కథ.

ఈ సంకలనంలోని కథల్లో వానలేక ఎండిపోతున్న పంట పొలాల మాదిరే శుష్కించిపోయిన బాల్యం కనిపిస్తుంది. బాల్యం ఎరుగని బాలలు వాళ్ళు. "కర్రోడి చావు" కర్రోడు, బోడి; "గుక్కెడు నీళ్ళు"లో పోలి; "ప్రతిజ్ఞ"లో వెంకటేసు ఒకే దండలోని పూసలు.

"కొత్త దుప్పటి" (సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి) ఒక విలక్షణమైన కథ. మానవ అంతరాత్మల్ని కళాత్మకంగా ఆవిష్కరించిన కథ. కల్లంలో రాత్రిపూట కావలి ఉంటూ చలికి వణికిపోతున్న ముసలాయన మిలటరీలో చేరిన మనవడు బొచ్చు దుప్పటి పంపుతాడని ఆశగా ఎదురు చూస్తుంటాడు. మనవడు పంపిన

బొమ్మ దుప్పటి సంగతి ముసలాయనకు తెలియనీయకుండా కొడుకు ఓబన్న తనే వాడుతుంటాడు. ఈ నిజాన్ని తాతకి చెప్పాలని ప్రయత్నించే చిన్నారి సుబ్బలక్ష్మికి అవకాశమివ్వకుండా అడ్డు పడుతుంటాడు ఓబన్న. తనకు చలి మంట వేసుకోవడానికని తెచ్చిపెట్టిన పుల్లల్ని పొదుపుగా వాడుకొని కొడుకైన ఓబన్న కోసం కొన్ని మిగిలిస్తాడు. ముసలాయన ప్రేమాస్పద హృదయం తన సంకుచితత్వాన్ని ఎత్తి చూపడంతో ఓబన్నకు "క్షణకాలం శరీరమంతా జలదరిస్తుంది." ఈ సంకుచితత్వం ప్రమాదకరమైనది ఏమీకాదు. అది బ్రతుకు లేమిలోంచి పుట్టుకొచ్చినదే. గ్రామీణ పేదకుటుంబాల్లో అనేక రీతుల్లో కనిపించే ఒక సర్వసాధారణ జీవిత పార్శ్వం ఇది.

"పాతాళగంగ" (కె.సభా)లో పేటప్ప; "ప్రతిజ్ఞ"లో రామినాయుడు పాతాళానికి బావులు త్రవ్వి సర్వస్వం కోల్పోయిన గిరిజనులు. "జీవనం" (డా॥ లంకిపల్లి) లో జీవయ్య. "పాతాళగంగ"లో పేటప్ప రాయలసీమ రైతాంగానికి ప్రతినిధిపాత్రలు రాయలసీమ మాండలికంలో రాసి వుంటే "జీవనం" కథ ఇంకా గొప్పగా భాసించి వుండేది.

జీవన బీభత్సాన్ని ఆవిష్కరించిన కథ "అత్యాచారం" (మధురాంతకం నరేంద్ర). నిశ్శబ్దంగా చాపకింద నీరులా సాగుతున్న మానవ శ్రమ దోపిడిని కళా సౌందర్యంతో అక్షరబద్ధం చేసిన కథ. నాలుగురాళ్ళ జీతానికి మామిడి తోటలకావలి ఉండే మునెయ్య భార్య అత్యాచారానికి గురికావడంపై "తన పైన అత్యాచారం జరిగిందో లేదో పట్టించుకొనే పరిస్థితిలో ఆమె ఉన్నట్లు లేదు. ఇక ఇతరులు ఆ విషయాన్ని ఎందుకు పట్టించుకుంటారు." అని అనుకుంటాడు మామిడి తోటల కాంట్రాక్టర్ సిద్ధముని వద్ద పనిచేసే యువ గుమస్తా నటరాజు. కష్టపడి పని చెయ్యమని సిద్ధముని ఇచ్చే సలహా నటరాజును ఉలిక్కిపడేటట్టు చేస్తుంది. పైకి మామూలుగా కన్పించే మానవ సంబంధాలలోనికి దోపిడీ స్వభావం జీవన గతి తర్కంతో వెల్లడి చేయబడింది. కొడవటిగంటిగారి కథలు ఇటువంటి శిల్ప సౌందర్యం ద్వారానే జీవితం అర్థం చేసుకోవటాన్ని మనకు నేర్పాయి.

అయ్యిందానికీ కానిదానికీ ముఠా తగాదాలు, ఖూనీలు రాయలసీమలో ఒక సాధారణ లక్షణం. దుర్భర జీవన పరిస్థితుల నుండి ఉత్పన్నమయ్యే లక్షణమిది. నిత్యక్షామ పరిస్థితులు కల్పించే నిరాశా నిస్పృహలు, అశాంతి ఆ ప్రజల అంతరంగాల్ని అగ్ని పర్వతాలుగా మార్చాయి. మిలిటెన్సీ వారి సహజ లక్షణం. ఆ మిలిటెన్సీని సమస్యా పరిష్కార దిశగా నడపగల సరయిన రాజకీయ పోరాట మార్గాలు వారికి అందుబాటులో లేకపోవడం శోచనీయం. "ఐదురూపాయలు" (వై.సి.వి. రెడ్డి) కథ ఈ నిస్సార నేపథ్యాన్ని చిత్రించింది.

సాంఘిక అసమానతలు నిమ్నవర్గ ప్రజల జీవితాల్ని మరింత బాధా మయం చేస్తున్నాయి. మూఢ సాంప్రదాయాల రూపం తీసుకొన్న సాంఘిక పీడనను, కర్రు దూయడమనే మూఢ సాంప్రదాయాన్ని చిత్రించడం ద్వారా "రాముల వారి గుడి ముందు" (మోహన్) కథలో రచయిత శక్తివంతంగా వెల్లడించాడు. పేదలు ఎప్పుడూ నేరస్తులే అన్న దోపిడీ భావనని, ఫ్యూడల్ అణచివేతని ఈ కథ తేట తెల్లం చేస్తుంది. అయితే ఇంత దారుణ రూపం తీసుకోవడం నేడు అరుదు. వివిధ రీతుల్లో, వివిధ తీవ్రతలతో ప్రచలితంగా ఉన్న సాంఘిక పీడనని అసమానతల్ని ఎత్తి చూపడం ఒక సాహిత్య లక్ష్యమే. అసమానతల్ని సుస్థిరం చేయడానికి పాలక వర్గాలు అవలంభిస్తున్న సున్నిత మాయదారి పద్ధతుల పట్ల ప్రజల్ని జాగరూకుల్ని చేయవలసి వుంది.

రాయలసీమకు ఒక ప్రత్యేకమైన ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవనం ఉన్నదనీ, ఆ జీవిత సంచలనాల్ని ప్రతిభావంతంగానూ, నిజాయితీగానూ, ఆత్మీయత తోనూ ఈ కథలు చిత్రించాయనీ సంకలనకర్త సింగమనేని నారాయణ చెప్పడం పూర్తిగా సమంజసం. రాయలసీమ ప్రజల జీవన సంఘర్షణను ప్రతిఫలించడంలో వాస్తవికతకు చిత్రిక పట్టిన కథలివి.

కథల శైలి మబ్బులు లేని రాయలసీమ ఆకాశంలా, ఆ ప్రజల జీవనమంతా సరళంగా, సూటిగా వుంది. అభూత కల్పనలు, పలాయనవాద, అరాచకవాద ధోరణులు ఈ కథలకు పరాయి. మానవత్వం ఈ కథల కేతనం.

రాయలసీమ అభివృద్ధిని నిర్లక్ష్యం చేసిన ప్రభుత్వాలు, పాలకవర్గాల పట్ల అణచివేతకు కారణమవుతున్న సామాజిక శక్తుల పట్ల నిరసన ధ్వనులు ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఈ సంకలనంలో వినిపిస్తాయి. ఈ కథలు ఏ ఇతర ప్రాంతం నుంచైనా వచ్చిన మంచి సాహిత్యానికి తీసిపోవు. ప్రజాసాహిత్యంలో ఈ కథల స్థానం సుస్థిరము. జీవన చిత్రము వేగంగా మారిపోతున్న విభిన్న జీవన కోణాల్ని, సమస్యల్ని చిత్రిస్తూ, కరువు కాటకాలు, పీడనలు తగాదాలు లేని జీవితాన్ని నిర్మించుకోవడానికి అవసరమయిన భావ విప్లవాన్ని రగిలించటంలో రాయలసీమ ప్రజా రచయితలు తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించగలరన్న భరోసాను ఈ కథాసంకలనం ఇస్తున్నది.

జనజీవనాన్ని ఎంతో సున్నితంగా, ఎంతో తాపత్రయంతో మన అరచేతుల్లో ఉంచిన అనుభూతిని "సీమకథలు" కల్గిస్తాయి.



సీమ కథలు : సంకలన కర్త - సింగమనేని నారాయణ
ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వెల : 30 రూ

# మావూరి దృశ్యం

అంతా స్మశాన నిశ్శబ్దం
నేలతల్లి పచ్చదనం బాంబుల [illegible]
ఎర్రబారిన దృశ్యం
పగుళ్ళిచ్చిన పంట పొలాల్ని చూసి
మోడై పోయింది నా హృదయం
గుప్పెడు మబ్బు తునక కోసం
ఎదురు చూసిన నా కళ్ళ నుంచి అశ్రువర్షాలు రాలాయి
నీటి పథకాల నీటిమూటల్ని నెత్తి నేసుకొని
దాహార్తినై ఎండమావుల వెంట పరుగు తీస్తున్నాను
దీనంగా చూస్తున్న ఎడ్లకు పలుపుతాడు తెంపేసి
కసాయి [illegible] కడుపు నింపుకుంటున్నాను
ఇక్కడ మేం ఎవరం ఎవరికి కాము
ఎవరి బ్రతుకు వారిదే
ఊళ్ళకు ఊళ్ళే ఖాళీ అవుతున్నా మమ్మల్ని
ఆవహించేది నిస్సహాయతే
బిడ్డల నోటికింత అందించాల్సిన చేతులు
పక్షవాతంతో పడిపోయాయి
ఊరికి ఉత్తరాన ఉండాల్సిన స్మశానం
నడిబొడ్డుకు తరలి వచ్చింది
ఊళ్ళేలాల్సిన వాడు
స్మశానాల్లో [illegible] చేసి
రాబందులతో కలిసి శవాల్ని పీక్కు తింటున్నాడు
నక్కలతో మంత్రాంగం జరిపి
శవ పంచాయితీలు జరిపిస్తున్నాడు
ఓ వాన చినుకు కోసం
ఓ మట్టి వాసన కోసం
ఓ పచ్చని దృశ్యం కోసం
మావూరి దృశ్యం కోసమే
నాయీ ఎదురు చూపంతా....

— బండ్ల మాధవరావు

## తాగబోతే    లేక తడిగొంతు లారి పోయె

—వి. కోటేశ్వరరావు

జీవి క్షణ కాలం జీవించడానికి కావాల్సింది గాలి, నీరు. కాని మన దేశంలో నేడు ఆ రెండూ కూడ దొరకని స్థితి అంటే ఆరోగ్యంగా ఉండటానికి ఉపయోగపడని గాలి నీరుతో కుస్తీ పడుతూ కలుషితమైన గాలిని పీల్చటం, కలుషిత నీరు త్రాగుటం మూలంగా తన ఆయుస్సులో 50% మనిషికోల్పోతున్నాడు. మనదేశంలో కరువులేనిది—దారిద్ర్యానికి, నిరుద్యోగానికి, చావులకు, దోపిడీకి, రక్షణ రంగ పెంపుదల మొదలగు వాటికి మాత్రమే. శరీరంలో నీరు, ప్లాస్మా రూపంలో 80% ఉండి రక్తంతో కలిసి ఉంటుందంటే నీటియొక్క ప్రాముఖ్యత అర్ధమవుతుంది. ప్రపంచంలో ఎక్కడలేని నీటి వసతి మన దేశంలో ఉంది. అలాగే ఎక్కడలేని కరువు ఇక్కడనే ఉంది. భూమిపై, భూమిలోపల నీరు ఉండి కూడ కావాల్సిన వారికి నీరు అందించలేని అసమర్ధత పాలకులు మనలని ఏలుతున్నారు.

సహజంగా కూడు, గుడ్డ, గూడు కోసం డిమాండ్ చేస్తూ ఉధ్యమిస్తాం కాని మనదేశంలో గాలి కావాలి, నీరు కావాలని కూడ ప్రధావమైన డిమాండ్స్‌లో చేరిపోయాయి. మనిషి త్రాగటానికి రోజుకు 2 లీటర్లు నీరు అందించలేని పాలకులు భూసంస్కరణలు, సోషలిజం చేస్తామని ప్రకటనలు గుప్పిస్తూ ప్రజలను భ్రమలకు గురిచేస్తున్నారు. ఈనాటికీ రాష్ట్రంలో దాదాపుగా 10 వేల గ్రామాలలో మంచి నీరు దొరకడంలేదు. ఉదా॥ నల్లగొండ జిల్లాలో 437, కరీంనగర్ జిల్లాలో 634, శ్రీకాకుళంలో 876,గుంటూరులో 343 గ్రామాలలో, త్రాగటానికి నీరులేదు. దేశంలో నిరుద్యోగం 10 కోట్లనుండి 15 కోట్లకుపెరిగినట్లే, త్రాగటానికి నీరు లేని గ్రామాల సంఖ్య లక్షకు పైగా పెరుగుతూ పోతూంది. 10 కోట్లకుపైగా ప్రజలకు మంచినీళ్ళు దొరకటంలేదు. ప్రపంచ వ్యాప్తంగా 2 కోట్లకు పైగా ప్రజలకు స్వచ్ఛమైన నీరు దొరకటంలేదు. యింకా అట్టడుగు పేదలయిన 35% BC, 25% ST వారికి చుక్క నీరు లేక గ్రామాలు వదిలి వలస వెళ్ళటమో చావటమో జరుగుతుంది. ఒక వేళ ఏదో ఒక నీరు దొరుకుతుందని సంతోషపడినాఅది కాస్తా విషపూరితమో, కలుషితమో అయి వుంటుంది. 7 రాష్ట్రాలలో 9,872 గ్రామాలలో కలుషిత నీరు త్రాగుట వలన చాలా మంది నారి కరువువ్యాధికి గురౌతున్నారు. 14 రాష్ట్రాలలో అధిక ఫ్లోరోసిన్‌గల నీరు త్రాగితే ఫ్లోరోసిస్ వ్యాధికి గురై ఎముకలు వంగి నడవటానికి వీలు లేక 35 సం॥ లకే జీవితంలో ఎందుకూ పనికి రాకుండా పోతున్నారు. సాధారణంగా మనిషి (IPPM పార్ట్స్ ఫర్ మిలియన్) ఫ్లోరైడ్ ఉంటే తట్టుకోగలడు.

14 రాష్ట్రాలు, 2 కేంద్ర పాలిత ప్రాంతాలలో అధిక శాతం యినుము ఉన్న నీటిని త్రాగుతున్నారు. 12 తీర ప్రాంత రాష్ట్రాలలో ఉప్పు శాతం అధికంగా ఉన్న నీటిని త్రాగుతున్నారు. యింకా శాస్త్రీయంగా పరిశీలించి నట్లయితే మన దేశంలో 50% పైగా ప్రజలకు పరిశుభ్రమైన నీరు దొరకలేదని అర్థం చేసుకోవచ్చు.

చిన్నప్పుడు విజ్ఞాన శాస్త్రంలో రంగు, రుచి, వాసనలేని నీరు త్రాగాలని చదువుకున్నాముకాని దేశంలో నివసిస్తున్న పేదలకు పై మూడువున్న నీరు తప్పమరొకటి లభ్యంకాదు. ధనవంతులయితే ఫిల్టరుచేసి త్రాగుతారు. ఈ నాటికీ నికరంగా 21% ప్రజలకు చుక్క నీరు దొరకటం లేదని ప్రభుత్వం లెక్కలే చెప్తున్నాయి. ప్రపంచంలో త్రాగే నీరు లభించు పరిసరాలు పరిశుభ్రంగా లేకపోవుటచే రోజూ 30 వేలమందికిపైగా చనిపోతున్నారు. నీటి పరిశుభ్రత పారిశుద్ధ్యం లోపం వలన 80% ప్రజలకువ్యాధులు వస్తున్నాయి. 40%పైగా ప్రజలకుప్రపంచవ్యాప్తంగాసురక్షితమైన త్రాగు నీరు, అందుబాటులో లేనట్లుగా అనేక మంది పరిశీలకులు ప్రకటించారు. మా గొంతులో ఒక్క నీటిబొట్టు పోయండని ఉద్యమిస్తున్న ప్రజలని అణచటానికి ఆయుధాలపై కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తున్నారు. యునిసెఫ్ లెక్కల ప్రకారం ఆయుధాలమీద ఖర్చుపెడుతున్న దానిలో కేవలం 3% మంచినీటి కోసంపారిశుధ్యానికి కేటాయించి నట్లయితే వ్యాధులనుంచి, మంచినీటి కరువులనుంచి మానవాళిని రక్షించ వచ్చునని ఒక పరిశీలనలో తేలింది. సామ్రాజ్యవాదులు, వారి తాబేదారులు వెనుకబడిన దేశాలను దోపిడీ చేయటానికి, అణచివేయటానికిచ్చే ప్రాముఖ్యత, ప్రజల ఆరోగ్యాల, సౌకర్యాల గురించి ఆలోచించరు.

గల్ఫ్ దేశాలలో నూనె ఎంతగా వుందో నీటి కొరత అంతగా ఉందని అంటారు కాని, మనదేశంలో సర్వ సంపదలు పుష్కలంగా ఉన్నాయి. బావులు, వాగులు, చెరువులు, నదులు, ఊటలు అనేక విధాలుగా ప్రపంచంలో ఏ దేశంలోనూ లభించనంత నీరు మనదేశంలో దొరుకుతుంది. దేశంలో ప్రతి సంవత్సరం దాదాపుగా 370 మిలియన్ హెక్టా మీటర్ల నీరు లభిస్తుందంటే ఆ నీటిని నిలవ చేసినచో భూమిపై 1 మీటరు ఎత్తున నీరు వుంటుందని పరిశీలకులు చెప్పుతున్నారు. దీనిలో ప్రభుత్వ అసమర్ధత వలన ఉపరితల జలంలో 8% నుండి 10% వరకు వినియోగంలోకి తేగలిగితే మనకు మంచినీటి కొరత వుండదు. నదుల ప్రక్కనగల గ్రామాలకు, పట్టణాలకు కూడ మంచినీరు అందించలేని వారు, తెలుగుగంగ ద్వారా, మద్రాసుకు, కృష్ణానుండి హైద్రాబాదుకు మంచినీరు అందిస్తామని. ప్రాజెక్టులు శంకుస్థాపనలుచేసి ఓట్లు సంపాదించటానికే పరిమితమయ్యారు తప్ప దశాబ్దాలు గడచినా ఇవి పూర్తి కావడంలేదు.

గోదావరి నదికి వస్తున్న వరదలను మరలించినట్లో భూములకు, మనుష్యులకు కావాల్సినంత నీరు అందించవచ్చు. ఈ మధ్య కాలంలో వరల్డు వాచ్ ఇన్‌స్టిట్యూషన్‌వారి పరిశీలన ప్రకారం గోదావరి నది వరదల సమయంలో ఒక్క నిమిషంలో వృధా అవుతున్న వరదనీటి ద్వారా మద్రాసు నగరానికి 1 సంవత్సరం సరిపోను త్రాగు నీరు అందించవచ్చునని తేల్చిచెప్పారు

దాదాపుగా 40 మిలియన్ హెక్టా మీటర్ల నీరు భూగర్భ జలాశయానికిచేరి నిలువఉంటుంది. వరద రూపంలో వృధా అవుతున్న నీటిని త్రాగేందుకువినియోగంలోకి తేలేని అసమర్థత పాలకుల్లో ఉన్నంత కాలం యిదే జరుగుతుంది. ప్రజలు మాత్రం నీళ్ళను తెల్ల బంగారుక్రింద లెక్కకట్టి వినియోగిస్తున్నా నీటి సరఫరా సంస్థవారి సరఫరాలో ప్రతి 20 గ్యాలన్ల మంచి నీటిలో 16 గ్యాలన్ల నీరు వృధా అవుతుంది. ఈ విధంగా ఎక్కువ నీరు లీకేజీ అవుతున్న నగరాలలో మన రాజధాని మొదట స్థానంలో ఉంది.

నీటి అవసరం వినియోగంపై ప్రభుత్వం 1960 లో జకారియా కమీషనొక దానిని వేసింది. ఆయన సూచన ప్రకారం నగరాలలో తలసరి 2 వందలలీటర్ల నీరు అందించాలని సిఫార్సు చేయగా, మొదటి తరగతి పట్టణాలలో సగటున 140 లీటర్లు, 105 ఇతర పట్టణాలలో 100 లీటర్లు అందించాలని ప్లానువేసి దానిలో కూడా విఫలం అయ్యారు. 1981-1990 ని 'మంచినీటి దశాబ్దంలా'గా ప్రకటించినా దప్పిక గ్రామాల సంఖ్య పెరగటం చూస్తున్నాం. మంచి నీటిని అందించే దానిలో కూడా మన పాలకులు విదేశీయులపై ఆధారపడటం ఎక్కువ అవుతూంది. ఇప్పటికే విదేశీ ఋణ భారం పెరిగి పెరిగి మోయిలేని భారం అయి కూర్చుంది. నెదర్లాండ్స్ సహాయంతో ఫ్లోరోసిస్‌వున్న ప్రాంతాలలో AP-'1 AP-2 స్కీముల క్రింద 52 కోట్ల 50 లక్షల రూపాయలను అప్పు తెచ్చారు.యునిసెఫ్‌ఇచ్చిన 12.53 కోట్ల రూపాయల అప్పుతో కొన్ని మంచినీటి స్కీములు ప్రవేశపెడ్తున్నారు. కోట్ల రూ॥ ల రుణాలు తెచ్చినా బాగుపడింది రాజకీయ దళారీలు మాత్రమే.

దాదాపుగా 7 కోట్ల జనాభాగల మన రాష్ట్రంలో 10,245 రక్షిత మంచి నీటి పథకాలు 1 లక్ష 80 వేల 499 పైగా బోరు బావులున్నట్లు ఈ మధ్యనే మంత్రి ప్రకటించినా, విజయవాడలో పకడ్బందీగా కట్టామని చెప్పిన రక్షిత మంచి నీటి పథకం కుప్పకూలి కొంతమంది మరణానికి కారణమైంది. 50% పైగా బోర్లు పని చేయకపోవటం, 10% వాటి పంపుసెట్లు బిగించకపోవటం, మరి కొన్నింటిలో నీరు పడకపోవడం చూస్తుంటే ప్రభుత్వం ప్రకటనలతో కాలం గడిపేస్తుంది అని అనిపిస్తుంది.

"సారా మాకొద్దు — త్రాగు సాగు నీరు కావా"లని డిమాండ్‌తో ప్రజలు.

వీధుల్లోకి వస్తున్నారు. ముఖ్యంగా [illegible] లు ప్రాణ వ్యతిరేక [illegible] భాగంగా మంచినీటి కోసం పోరాడుతున్నారు. సగటున [illegible] సం॥ 2 వేల మీటర్లకు పైగా దూరం [illegible] కోసం నడుస్తుందని ఒక సర్వే తెలియజేసింది. [illegible] సాగిస్తున్నది. తన [illegible] నీటి కోస [illegible] కూలంగా తన సంపాదనను కో[illegible] ధర్నాలు రాస్తారోకోలు, [illegible] లు, బావులను సాధించుకు[illegible] మాటిస్తున్నారు. మన కన్నా [illegible] నీటిని నిలువ చేసి ప్రజలకు అందిస్తున్న [illegible] ద్వారా అన్ని ప్రాంతాలకు నీరు అందించవచ్చు. [illegible] జలాశయాల చెక్ డామ్స్‌ని నిర్మించటం [illegible] భూగర్భ జ[illegible] అభివృద్ధి [illegible]చటానికి బదులు మన పాలకులు [illegible] చున్నారు. ఉప్పు నీటిని మంచినీటిగా, [illegible] అభివృద్ధి అయ్యింది. మేఘాలలో [illegible] చిల్లి కృత్రిమ[illegible] సృష్టి [illegible]. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ట్రాపికల్ మెటీరియోలజీలాంటి సంస్థల [illegible] ప్రయోగాలను ప్రభుత్వం [illegible]కోవటంలేదు. ఈ ప్రయోగాల ఖర్చు కూడా నామమాత్రమేనని ప్రకటించారు. వెయ్యిలీటర్లకు 1 పైస నుండి 60 పైసలు ఖర్చు కావచ్చు. ఈ విధానాన్ని మరింత అభివృద్ధి చేస్తూనే సహజసిద్ధంగా లభిస్తున్న నీటిని నిలువ ఉంచిన మన వనరుల కంటే వెయ్యి రెట్లు ఎక్కువ ఉంటుంది. ఒక దేశంయొక్క ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, నాగరికతా ఔన్నత్యం, ఆయా దేశాలలోని నీటి వనరులపై, వాటి వినియోగంపై ఆధారపడి ఉంటుంది. నీటికోసం సాగే ఉద్యమం ఒంటరిగా సాగేదికాదు. ఈ వ్యవస్థను వ్యతిరేకంగా జరిగే పోరాటంతో జత చేయబడి వుంటుంది. సామ్రాజ్యవాదులు తమపై ఆధారపడేలా అవలంభించే ఆర్థిక, రాజకీయ విధానాలను కొనసాగించే భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేక ఉద్యమంలో జలసాధనకు మార్గం.

---

"రాయలసీమ రతనాలసీమ నేడు. క్షామ మేలుతున్న సీమ రాళ్ళసీమ నేడు. ఎన్ని స్వేచ్ఛా సంవత్సరాలు గడించినా తీరని కరువు. రాజు [illegible] తీరని బరువు. బీడు భూమిని బంగారు భూమిగా మార్చుటకు ఎంత శ్రమిస్తున్నారీ సీమ కర్షకులు! కానీ ఏరికి మిగిలేది నిరాశ, కన్నీరు మాత్రమే."

## ఆకలంటు అర్థం నువ్వే

ఆకలంటె అర్థం నేనె సోమాలియాని
ఓఓ భూగోళమా
ఆర్తి అంటె అర్థం నేనె సూడాన్‌ని
ఓఓ భూగోళమా
తుప్పల ఆకులనే తిన్నా ఇక ముళ్ళు మింగలేం
గుంటల మురుగునీరు తాగా ఇక బురద బుక్కలేం
మా పేగు మాడ్చుతున్న దెవరో తెలుసుకొంటిమె
మారుపు నాప జూసేదెవరో గురుతు పడితిమె
బువ్వివ్వరు బట్టివ్వరు
అగ్రరాజ్యాలె చేతి ఆటబొమ్మ ఏలికలు
ప్రజల పొట్టను తాకట్టుపెట్టి / యుద్ధ స్థావరాన్ని జేస్తి రె
పట్టండి ప్రజలు ఆయుధాలు / తరమండి దుష్ట పాలకులను.
కరువంటె అర్థం నేనె రాయలసీమనీ
ఓఓ భరత ఖండమా
కృత్రిమ క్షామమంటే అర్థం నేనె తెలంగాణనీ
ఓఓ భరత ఖండమా
రాళ్ళను గంజి కాచి తాగామిక గుట్టలను కతకలేం
వీళ్ళను నాలుకతో నాకినా మిక బండలు తిని బతకలేం
మా బతుకు బుగ్గి చేస్తుందెవరో కనుగొన్నామె
మా జన్మ రద్దు చేస్తుందెవరో కళ్ళ జూస్తిమె
సాగు నీరివ్వరు తాగు నీరివ్వరు
సామ్రాజ్యవాద దేశాలకు తొత్తు లీ పాలకులు
బతుకు సాగనివ్వరు వెతల సారె బెడతారు
బహుళజాతి కంపెనీలకు బానిస లీ ప్రభువులు
ఎత్తండి ప్రజలు పనిముట్లను
తరమండి దుష్ట పాలకులను
ఆకలంటె అర్థం నువ్వే
ఓఓ. ప్రపంచ యుద్ధ గోళమ
ఆర్తి అంటె అర్థం నువ్వే
ఓఓ భారత యుద్ధ ఖండమా.

సూర్యతేజ

కథ

# ముళ్ళదారి

— బాలకొండ ఆంజనేయులు

కైలాసగిరి మీద పరమశివునిలా కట్టెల బండిమీద కూచొని వున్నాడు శివయ్య. బండి నగల్లో శివయ్య రెండో కొడుకు సుబ్రమణ్యం కూచొని బండి తోలుతున్నాడు. శివుని ఆజ్ఞ మేరకు నడుచుకునే నందీశ్వరునిలా బండికి కట్టిన కాడెద్దులు సమతూకంగా చీకటిలో బండిని లాగుతున్నాయి. కైలాసగిరి మీద మంచు కరిగి మెల్లగా జారుతున్నట్టు తార్రోడ్డుమీద బండి పైర్లు మెల్లగా కదులుతున్నాయి. అప్పుడప్పుడు 'ఈదారిమాది' అన్నట్టు బస్సులు, లారీలు ఇతర వాహనాలు అటూ-ఇటు పోతువుంటే ఎద్దులు బెదరుకుంటున్నాయి. చేతిలో పగ్గాలు బిగబట్టి బెదరే ఎద్దుల్ని కంట్రోలు చేస్తూ చీకటిలో టౌను వేపు బండిని నడిపిస్తున్నాడు సుబ్రమణ్యం.

ముళ్ళ కట్టెల ముళ్ళు లేకుండా నీటుగా జీవిరి చిన్న చిన్న తునకలుగా చేసి మధ్యలోకి చీల్చి చిన్న చిన్న మోపులుగా కట్టి బండికి వరుస క్రమంలో పేర్చినారు- అమ్మేప్పుడు సులువుగా బండి మీదుండి అందించడానికి వీలుగా!

శివయ్య అంత ఎత్తుమీద కూచున్నాడే గాని అతని ఆలోచనలు క్రిందకు-ఇంకా క్రిందకు అన్నట్లు అతన్ని కృంగదీస్తున్నాయి. 'ఏమి కాలమొచ్చెరా బగవంతుడా! కాలుమీద కాలేసుకోని బతికిన కుటుంబానికి యీపొద్దు బజార్లో కట్లమ్ముకోని బతికే కాలమొచ్చె గదా! పూలమ్మిన చోట కట్లమ్మడమంటే ఇదేగావల్లే' అని మనసులో తలచుకుంటూ వుంటే శివయ్యకు తన చిన్నప్పట్నుండి ఇప్పటి వరకు బ్రతికిన బ్రతుకంతా గుర్తుకు వస్తూవుంది.

శివయ్యకు పది పదకొండేండ్ల వయసున్నప్పుడు వారిది ఏడుకాండ్ల సేద్యం. ఈ ముంగారున పొలాలు దున్నటం మొదలుపెడితే మళ్ళీ ముంగార్ల దాక దున్నటం వుండేది. ఏడెనిమిది మంది జీతగాళ్ళు, రోజుకు ముప్పై నలభై మంది కూలోళ్ళు పని చేస్తువుండేవారు. వారింట్లో పొయ్యిలో అగ్గి ఆరిన పైమే లేదు. వండుతూ వుంటే- తింటూ వుంటే- పని చేస్తూ వుంటే రేయికి పగలుకు తేడా తెలిసేదికాదు వాళ్ళకు. ఇక రోజూ చుట్టాలనీ- పై మనుషులనీ తిని పోయేవాళ్ళు ఎంతమందో!

వారిది లంకంత ఇల్లు. ఇంటినిండా ఏ గదిలో చూసినా వడ్లూ- చెనిక్కాయలు- జొన్నలు- కొర్రలు నింపి వుండేవి. గాదుల్లో కాక జెగితిమీద గింజలు నింపిన సంచులు వరుసలు వరుసలుగా పేర్చిపెట్టి వుండేవి. ఇక గడ్డివాములు తాటి చెట్టంత ఎత్తు పదీ పగ్గాల పొడవు. అయిదారు బావుల క్రింద చెరువు క్రింద సేద్యం కాక యాభై

సదువుకోని వుద్యోగంలోకి పోతే యీ సేద్దిమంతా కుక్కల నక్కల పాలు గావల్లనా!' అని తనను వెనకేసుకొని వచ్చి స్కూలుకు పంపించేవాడు కాదు. సంజీవులు తండ్రి మాటకు అడ్డు చెప్పే వాడు కాదు. ఆ విధంగా తన తాత గారా బంతో చదువుకు దూరమయ్యాడు.

చిన్నప్పుడు శివయ్యకు కపిలి తోలడం చూడడమంటే చాలా ఇష్టం. నాలుగు బావుల్లో కపిలి తోలుతూ వుంటే తెల్లవారింది మొదలు అబంలి పొద్దు వరకు అన్ని బావుల దగ్గర తిరిగేవాడు తను.

ఆ రోజుల్లో కపిలి కట్టి నీళ్ళు బయటకు తోడేవారు. దానికి రెండు కాండ్లు ఎద్దులు- ఇద్దరు మనుషులు కాక పశువుల చర్మంతో తయారైన బొక్కెన- పుల్లీ- చెవుకట్లు మీద చెక్క గిలక కలబంద నారతో పేడిన కపిలి మోకు- తోకతాడు ఉపయోగించి బావి నుండి నీరు తోడే వారు. కపిల పాటలు పందేలు వేసుకొని పాడేవారు. తను వాటిని ఎంతో ఆసక్తిగా విని పరవశించేవాడు. 'ఆ పాట మల్లా పాడు' అని జీతగాళ్ళతో పాడించుకొని వినేవాడు. కపిలి నీరు కాలువ గుండా పారుతూ వుంటే ఓ మనిషి చేతిలో 'పార' పట్టుకొని నీరు కయ్యలకు తిప్పి పొలం పారబెట్టే వాడు. తన తాత బ్రతికున్నప్పటికే ఆయిల్ ఇంజన్లు వచ్చాయి తన తండ్రి ఇంటి పెత్తనం కట్టుకునేప్పటికి కరెంటు మోటార్లు వచ్చాయి.

తన తండ్రి హయాంలో ఓసారి పెద్ద కరువు వచ్చింది. ఆ కరువు ఎంతో మందిని బలి తీసుకుంది. సంజీవులు తన మెట్ట పొలంలో సగందాక ఎకరం ముప్పై నలభై రూపాయల మేరకు అమ్మేశాడు.

మిగతా భూములు ఇప్పుడు లేవా? అంటే వున్నాయి. అప్పటి బావులు ఇప్పుడు లేవా? అంటే వున్నాయి. మరి ఇల్లా? ఇల్లా వుంది. అన్నీ వున్నా అల్లునోట్లో శనివుందన్నట్టు ఏ బావి లోను చుక్కనీరు లేదు. వర్షాల్లేవు. వర్షాలొచ్చినా సకాలంలో కురవటం లేదు. పంటలు పెట్టటానికి- పంటలు పండటానికి అదునుతప్పి కురుస్తాయి ఏడాదికి రెండు మూడు వానలు. అవీ నాసుపు వానలు. వంకలు పారింది ఎప్పుడో మరచి పోయారు ప్రజలు. చెరువుల్లో నీరు చూసి పదేండ్లు దాటింది. బాగా వానలు కురిసి వంకలు పారితేకదా! భూమిలో పదును చెరువుల్లో నీరు నిలిచేది. బావుల్లో నీరు పుష్కలంగా వుండేది.

ఆ రోజుల్లో అంత కష్టపడి కపిలి ద్వారా బావిలో నీరు బయటకు తోడే వాళ్ళు. ఇప్పుడు స్విచ్ నొక్కితే చాలు మోటరు గుయ్యిమంటుంది. పాతాళంలోని నీరుహటా క్షణంలో ఏ కష్టం లేకుండా పైకి తెస్తుంది. కరెంటు మోటర్లు వచ్చి పని సులభమయ్యిందనుకుంటే ఇప్పుడు ఆ మోటర్లే పనిలేకుండా పోయింది బావుల్లో నీరులేక. మరి ఇప్పుడు ఏడు కాండ్ల సేద్యం ఎలా చేసేది? పెద్ద పెద్ద గడ్డివాములు-ఇంటినిండా గింజలు ఎలా వస్తాయి?

ఊరి ముందు తమ పొలంలో పశు

వులు- మనుషుల ప్రవేశించకుండ తన తండ్రి సంజీవులు అనంతపురం నుండి ముళ్ళచెట్ల విత్తనాలు తెచ్చి పొలం చుట్టు కంచెలా పెంచాడు అప్పట్లో. ఇప్పుడు అవి పొలమంతా పొదలు పొదలుగా పెరిగిపోయినాయి. కారణం- నీరులేక ఆ పొలం సాగుచెయ్యకు వీడుపడటం వల్ల!

ఆ ముళ్ళచెట్లు వర్షం లేకుండానే నీరు పెట్టకుండానే పెరుగుతాయి. వాటి వేర్లు భూమిలో నీటి మట్టం అందే వరకు చొచ్చుకు పోతాయని అంటారు. ఈ ముళ్ళ చెట్లను 'సర్కారు ముళ్ల చెట్లు' అని 'కంప చెట్లు' అని 'సముద్రం జాలి చెట్లు' అని పిలుస్తారు.

నాడు పశువులు లోనికి ప్రవేశించకుండ కంచెగా కాపాడిన ఆ ముళ్ళ పొదలు నేడు పల్లె ప్రజలు కాలకృత్యాలు తీర్చుకోడానికి- పోకిరి రాయుళ్ళ పేకాటలాడుకోడానికి- పొయ్యిలోకి పుల్లాపుట్రా రూపంలో వంట చెరకుగాను ఉపయోగపడుతువుంది.

ఎదురుగా నిలబడి వున్న లారీ హారన్ మోతవిని ఆలోచనలో నుండి తేరుకొని ముందుకు చూశాడు శివయ్య. గుండె చల్లబడింది. వొళ్ళంతా చెమట పట్టింది. ఇంకేముంది ఎద్దులు రెండూ ముందు నిలబడి వున్న లారీకు ఆనుకుని వున్నాయి.

'వొరా! అప్పయ్యా! యేం జేత్తాండావురా! నిద్ర బోతాండావా!' అని శివయ్య గట్టిగా అరిచేలోగానే బండిని రోడ్డు ప్రక్కగా పోనిచ్చాడు సుబ్రమణ్యం కునికిపాటు నుండి తేరుకొని భయంతో గట్టిగా పగ్గాలు బిగబట్టి ఎద్దుల్ని కంట్రోలు చేస్తూ.

'ఏమయ్యా! ఇంట్లో చెప్పే వొచ్చినారా! మీకేం బతకల్ల నుందా? లేదా? బండిని లారీ కడ్డం తోలు తాండారు' డ్రైవరు లారీ ఆపి కిందకు దిగొచ్చి గట్టిగా మందలించాడు.

'యీ బతుకు బతికేకన్నా సచ్చేదే మేల్లేవయ్యా' అని మనసులో గొణుక్కొని "పొరపాటయ్యిందన్నా! పిల్లోడు తూగినట్లుండాడు" సంజాయిషి చెప్పుకున్నాడు నెమ్మదిగానే క్షమించమన్నట్టు శివయ్య. శివయ్య గొంతువిన్న లారీ డ్రైవరు మసక మసక వెలుతుర్లో శివయ్య ముఖం గుర్తుపట్టి "ఏం శివయ్యన్నా! నువ్వా! ఎవరో అనుకోనుంటినే" అని మళ్ళీ "నన్ను గుర్తు పట్లేదా! నేను డ్రైవరు గపూర్‌ను. రొండేండ్ల కిందట మద్రాసు మార్కెట్టుకు మీవి ద్రాక్ష బుట్టలు ఎత్తపొయ్యింటిమి సూడు" అంటు గుర్తుకు తెచ్చాడు. "ఆ... బాగుండామప్పా! నువ్వు బాగుండవా!" అన్నాడు శివయ్య గుర్తుకు తెచ్చుకున్నట్టు. "బండి జాగ్రత్తగా పోనీండప్ప! లారీలు స్పీడుగా వస్తాంటాయి" అని హెచ్చరించి లారీ ఎక్కుతూ "వస్తానన్నా" అనిచెప్పి లారీ నడుపుకుంటు వెళ్ళిపోయాడు గపూర్.

"అప్పయ్యా! ఆ డ్రైవరు మంచోడు గాబట్టి మనం బతికి పోయినాము. లేకుంటె యేమయ్యుండేవాల్లమో. రొంత చూసి తోలు నాయనా బండి" అని భయభక్తులు చెప్పాడు శివయ్య కొడుక్కు. 'అలాగే' అని బండి రోడ్డు ప్రక్కనే

పోనిస్తున్నాడు సుబ్రమణ్యం.

'అవును! ఇదే డ్రైవరు అదే లారీ రొండేండ్ల కిందట మదరాసుకు ద్రాక్ష బుట్టలు యెత్తక పోయినాము' అని గుర్తుకు తెచ్చుకొని 'మరి యిబ్బుడు ఎద్దుల బండిలో అనంతపురంలో అమ్మేకని కంప కట్టెలు యెత్త పోతాండాము! యెంత మార్పు! ఓడలు బండ్లయితా యంటే ఇంతే గదా!' అని మనసులో వగస్తూ మళ్ళీ గతంలోకి వెళ్ళిపోయాడు శివయ్య.

రెండేళ్ళ క్రితం తన తోటలో కోసిన ద్రాక్ష బుట్టలకెత్తించి తనే మద్రాసు మార్కెట్టుకు లారీలో తీసుకెళ్ళాడు. ద్రాక్ష పంట అదే ఆఖరుసారి. మళ్ళీ పంటకు బావుల్లో నీరు చాలక ద్రాక్ష చెట్లన్నీ నరికేయించాడు తను. ఏడాది క్రితం చీనా చెట్లు ఎండిపోతు వుంటే చూడలేక 'బోగినేపల్లిలో కాపోళ్ల పిల్లోడు యాప్పుల్ల పట్టుకోని నీల్లు యాడ పడేది కరెట్టుగా చెప్పుతాడంట అన్నా!' అని చెంద్రప్ప చెప్పితే ఆయనను పిలి పించి పాయింటు చూపించాడు. తరువాత బోరు వేయించాడు. చుక్కనీరు పడలేదు 'మడకశిర దగ్గిర పల్లిలో అయ్యివారు అంజినేయ సామి పయిలోకొచ్చి గారెం టుగా యాడ నీల్లు పడేది చెప్పుతాడంట మామ' అని క్రిష్ణయ్య చెప్పితే ఆ అయ వారుకు రాను పోను చార్జీలు ఇచ్చి నూట పదహార్లు దక్షిణ చెల్లించి పాయింటు చూపించుకున్నాడు తను. అయ్యవారు చెప్పిన దాని కంటే ఇరవై అడుగులు ఎక్కువేయించాడు బోరు బురద కూడా కనిపించలేదు. బ్రతికే బ్రతుకు పోగొట్టు కోలేక వాళ్ళ-వీళ్ళ చెప్పిన మాటలు విని పొలమంతా బోటు రంధ్రాలు వేయిం చాడు. నీల్లు పడకపోతే చివరకు చీనా చెట్లు కూడా నరికేయించాడు. తన పెళ్ళాం వంటి మీద నగలు- పంటలో వచ్చిన అంతో యింతో డబ్బు జూదంలో పోగొట్టుకున్నట్టు బోర్లకే పోగొట్టు కున్నాడు తను. బోరింగ్ ఆసాములు పైసా వదలిపెట్టకుండ డ్రైవరు పని వాళ్ళ మామూళ్ళతో సహా వసూలు చేసుక పోయారు. కాసింత జాలి కనికరం కూడ లేకుండ. తన రాత యిట్లా వుంటే ఎవరి నని ఏమి లాభ్ములే అనుకున్నాడు తను.

ఇప్పటి సేద్యమంతా వర్షంపైనే ఆధారపడి వుంది. ముంగారున వర్షాలొస్తే మెట్ట దున్ని వేరుశెనగ విత్తులు విత్త తారు. సకాలంలో వానలు కురిస్తే సరి లేకుంటే విత్తనాలు తిరగటం కూడా కల్ల!

గత ఏడాది వర్షాలులేక విత్తనాలుకూడా తిరగలేదు తనకు. ఈసారి సుబ్బయశెట్టి దగ్గర విత్తనం కాయలు అప్పు తెచ్చి విత్తనం విత్తినాడు. మొదట్లో రెండు మూడు వానలు పడితే 'యీ సారి పంట గ్యారెంటీ' అనుకున్నాడు. అయితే మధ్య వానలు బాగా దెబ్బతీసాయి. దానితో సగం పంట కూడా పండలేదు. యాభై మూటలు అవీ తాలు బుడ్డలు ఇంటికి చేరినాయి.

అమ్ముదామనుకుంటే అడిగే నాథుడు లేడు. ఎవరైనా అడిగినా అగ్గవకు అడుగు తారు. రెండేళ్ళ క్రితం అయిదు నూర్లు సంచి వేరుశెనక్కాయలు ఈ సారి

మూడు వందలకు లోమాపే! రైతు పండించిన పంటకు మార్కెట్టు లేకుంటే రైతు ఎట్లా బ్రతికేది. చూసి చూసి ఎక్కడి కంటే అక్కడికి తెక సమ్మకు నేది ఎట్లా! మన సెట్ల వొప్పుతుంది అంటూ వగచాడు.

ఆ యాభై మూటలు అమ్మినా తన అప్పులకు వడ్డీకి కూడా సరిపోదు. పెద్ద కూతురు పెళ్ళికి చేసిన అప్పు రోజు రోజుకు పిల్లలు పెడుతూ వుంది. ఇంటి ఖర్చులకు- బోర్లు వేయించడానికి తెచ్చిన అప్పుమీద వడ్డీమీద వడ్డీ పెరిగిపోతు వుంది. వడ్డీల ముందు గుర్రాలు కూడా పరిగెత్త లేవంటారు. 'ఈ అప్పులన్నీ తీర్చేదెట్లబ్బా! రుణము జన్మాదుల పాలం టారు. సచ్చి కోడో కుక్కో అయ్యి వాళ్ల అప్పు తీర్చాల్సి వస్తుందేమో' అను కున్నాడు తను బాధతో.

అన్నీ జ్ఞాపకమొచ్చి రెండు కన్నీటి బొట్లు కార్చాడుతను. ఆ కన్నీటి బొట్లు తన తొడల మీదపడి వెచ్చగా తడవగానే ఈ లోకంలోకి వచ్చాడు శివయ్య.

అప్పుడే బండి పంగల రోడ్డు దాటి టీవి టవరు దగ్గర కొచ్చింది. బాగా తెల్లవారిపోయింది. సూర్యుడు దేవర కొండ వెనక నుండి పైకొస్తున్నట్లు కని పిస్తున్నాడు. పక్షులు గూళ్ళు వదలి ఆహారం సంపాదించుకు రావటానికి ఆకాశంలో ఎగురుతున్నాయి. టౌన్లో కట్టడాలకు బండ్ల మీద ట్రాక్టర్ల మీద ఇసుక, ఇటుకలు, మన్ను కదలి పోతు న్నాయి. చుట్టూ గ్రామాల్లో నుండి బేల్దారి పనులకు అనంతపురం వచ్చేవాళ్ళు సైకిళ్ళ మీద వస్తున్నారు.

"ఒలే అప్పయ్యా? లెయ్యిరా! బిరిగ్గా పొయ్యి కట్లమ్ముకొని వద్దాం. మల్లా ఎద్దులకు ఎండయితాది" అని తెల్లవారు జామున కోళ్ళు కూస్తానే సుబ్రమణ్యాన్ని లేపి బండి కట్టించాడు. 'వరదాలేదు! బండి బాగానే వచ్చింది. ఎంత బిరిగ్గా అనంతపురం దగ్గిర కొచ్చినాము. యింగ అంతా రొండు కిలోమీటర్లే గదా!' అను కున్నాడు శివయ్య.

మంటలుగా వుంటే తన రెండు అర చేతులు తిప్పి చూసుకున్నాడు శివయ్య. రెండు అరచేతుల్లో ముళ్ళు కట్టెలు కొట్టేప్పుడు ముళ్లు గీచుకొని ఏర్పడ్డ రక్తం గడ్డ కట్టినట్లున్న చారలు కనిపిస్తు న్నాయి. అవి చూస్తుంటే శివయ్య కళ్ళు మరోసారి వర్షించాయి.

అదో యిదో అంటున్నట్లనే టౌను చేరుకుంది బండి. టౌనులో బండి అడుగు పెట్టిందో లేదో 'ఏమయ్యా! ఎట్లిస్తావు కట్టెలు' అని అడిగేవాళ్ళు. 'బండెడు కట్టెలు చెప్పు' అని అడేవాళ్ళు. 'ఈ ప్రకారంగా యిస్తే బండెడు కట్లు ఇక్కడే అయిపోతాయి చూడు.యిస్తావా' అని బేరమాడేవాళ్ళ'సమాధానం యిచ్చేం దుకు శివయ్య ఉక్కిరి బిక్కిరి అవు తున్నాడు.

అదంతా చూస్తుంటే ఆ కట్టెల కున్న గిరాకీ ఏమిటో అప్పుడర్థమయ్యింది శివయ్యకు. అరగంటలో కట్టెల బండి ఖాళీ. కట్టెలన్నీ అమ్మేసి పైకం చేత పట్టుకున్నాడు. ఒక్కొక్క నోటు, చిల్లర లెక్క పెడుతున్నాడు శివయ్య. దగ్గర

రెండు వందలదాకా వుంది ఇప్పుడు శివయ్యకు తన అరచేతుల్లో మంటలు కానీ, మంట పుట్టించే ముచ్చు గీచుకున్న ఆనవాల్లు గాని కనిపిస్తున్నట్టు లేదు. శివయ్య ముఖంలో జ్యోతి వెలిగి నట్టయ్యింది. ఏడాదిలో ఒయాసిస్సును చూపి తన ముఖంలో ఆనంద జ్యోతిని వెలిగించిన పుల్లన్నకు మనసులోనే ధన్యవాదాలు చెప్పుకున్నాడు శివయ్య.

'ఒరే! పుల్లిగా కష్టకాలంలో డబ్బులు చేతికొచ్చేకి ఎంత మంచి వుపాయం చెప్పినావురా! నీకు చేతులెత్తి మొక్కల్లరా!' అనుకున్నాడు మనసులో.

రెండ్రోజుల క్రితం సాయంకాలం జెగితి మీద కూచొని బీడి అంటించుకొని దమ్ము లాగుతున్నాడు శివయ్య. చేతిలో కాఫి గ్లాసుతో వచ్చింది శివయ్య భార్య పార్వతమ్మ. మొగడి చేతికి కాఫి గ్లాసు అందించి ముఖమ్మీది చెమట చీర కొంగుతో తుడుచుకుంటూ 'ఉగాది పండగ దగ్గిరికొస్తాంది. నువ్వేంది చెవులో యేసుకోకుండా వుంటావే' అంది.

'నన్నేమి జెయ్యమంటావు' అని కరువుగా అన్నాడు శివయ్య.

'ఏమి జెయ్యాల్లని నన్నడిగితే నేనేమి చెప్పేది? ఉగాదిపండగంటే సూడాదికొగసారొచ్చే పెద్ద పండుగ. పిల్లోల్లకు బట్టా బాతా అనుకోకుండా అడక్కతినేవాల్ల మాదిరి అట్లే వుండమంటావా? ఆడపిల్లోలకు లంగా పైట్లు లేవు. అన్నీ చినిగిపోయినాయి. మొన్న నాదీ వొగ పాతకోక చింపుకొని పెట్లేసుకుండారు. ఇంగ మగ పిల్లోల్లకు నిక్కర్లన్ని పిత్తల మింద చినిగి పోయినాయి' అంది బాధగా

'ఎవుర్నడిగినా చేతులు యెలకలేత్తం డారు. నన్ను యాటికన్నా దొంగతనానికి పొమ్మంటివా....' గట్టిగా వుంది శివయ్య కంఠం. దొంగతనానికైనా సిద్ధమే అన్నట్లుంది శివయ్య మనసులో ఇప్పుడు.

'ఏందక్కా! బావ గెట్టిగా మాట్లాడు తాండాడు' అంటూ ఇంట్లో కొచ్చాడు పుల్లన్న.

'చూడన్నా! నువ్వైనా చెప్పు....' అంది పార్వతమ్మ మధ్యలోనే ఆపేస్తూ.

శివయ్య ముందుండే బీడీల కట్ట అగ్గిపెట్టె అందుకొని, బీడీల కట్టలో నుండి ఓ బీడి బయటకు లాగి నోట్లో రెండు పెదాల మధ్యన బిగబట్టి, అగ్గిపెట్టె తెరచి, పుల్ల బయటకు తీసి వెలిగించి బీడి అంటించుకొని ఒక్క దమ్ములాగి పొగ బయటకు వదులుతూ 'ఇప్పుడు చెప్పు బావా! ఏంవో అక్కమీద బలే అక్కసుగా వుంటావు' అన్నాడు పుల్లన్న తను వచ్చిన పని నెరవేరిందన్నట్టు.

'ఏందో లేవోయ్! సంసారమన్నంక నూరుంటాయి గాని. ఇంతకూ పొద్దున్నుంటి యాడికి పొయ్యింటివి కనపన్నే లేదే' అడిగాడు శివయ్య.

'అనంతపురం పొయ్యింటి బావా!'

'అనంతపురం పొయ్యింటివా! చెనిక్కాయ ధర ఏమన్నా కనుకుంటివా? రేటు రొంతేమన్నా పెరిగిందా?' ఆశగా అడిగాడు శివయ్య. ధర పెరిగింటే తాలు కాయలయినా అమ్మి తాపం తీర్చుకుందాం అనే ధోరణిలో.

'చూడు బావా! మనతో కొనేటివన్నీ అగ్గవే, వాల్లతో మనం కొనుకునేటివన్నీ ధర లెక్కువ' అన్నాడు పుల్లన్న సమాధానంగా.

'చెనిక్కాయ మాట్లాడిచ్చేవోడు లేదు. టౌన్లో వాల్లంతా దినాము వొగ రకం వంట చేసుకొని తింటాండారు. మనమే యిబ్బుడు యీజాతికి ఎక్కకుండా పొయ్యిందేది' అన్నాడు మళ్ళీ పుల్లన్న.

శివయ్యకు పుల్లన్న మాటలు నిరాశ నిస్పృహ కలిగించాయి.

'తూ! వానెక్క..! యీ బతుకు బతికేకంటే వొగనాడు ఆ రైలు కిందపడి చచ్చేది మేలు. కొనబోతే కొరివి అమ్మబోతే అడివి అన్నెట్లుంది రైతు బతుకు' అన్నాడు. తరువాత 'ఇంతకూ ఏం పని మింద పొయ్యింటివయ్యా అనంతపురం' అన్నాడు శివయ్య.

'ఇంగే పనుంది బావా! బావిలో నీల్లు లేవు. బతికే ఆదరవు లేదు. ఏందో వొగ అవత్త పడుకోవల్ల గదా. మీకేం సామి పెద్దోలు.'

'చూడు....చూడు. జాంతాన మాడద్దునోయ్, చెప్పేదేందో సరిగ్గ చెప్పు' అన్నాడు శివయ్య.

'ఏం లేదు బావ! కంప కట్లు నరుక్కొని పొయ్యి బండి నిండా ఏసక పొయ్యి అనంతపురంలో అమ్ముకోనొత్తిమిలే.'

'అ.... అట్లనా.... యీమాత్ర మొచ్చిందీ లెక్క.'

'నూటయాభై రూపాయలొచ్చిందీ బావా! మనమేమి కష్టపడినాములే ఆ గుట్టల పక్కనుండే కంప చెట్లు నరికి బండి కెత్తక పొయ్యి అంబలి పొద్దుకంతా అమ్ముకో నొచ్చినాము' తేలిగ్గా అన్నాడు పుల్లన్న రోడ్డు పక్కన డబ్బుల సంచి దొరికినంత సంతోషంతో.

పుల్లన్న మాటలు వింటూవుంటే శివయ్యకు ఏదో ఉపాయం మెరుపులా తోచింది. 'పుల్లిగాడు చెప్పింది బాగుందే! ఒండెడు కంప కట్టెలకు నూటాయాభై రూపాయలా! ఇదేదో బాగానే వుంది. ఆ పని నేను చేస్తే! ఎట్లా మా తోటలోనే కంప పొదలుండాయి.' అని మొదట మనసులో తొందరపడినా 'ఈ పని జేస్తే నా కేమన్నా గౌరవం తగ్గుతుందా! చిన్నతనం అయ్యేనా! యెవురన్నా చూస్తే యేమన్నా అనుకుంటారా?' అని గంట రెండు గంటలు తన మనసు సందిగ్ధంలో తటపటాయించినా తుదకు 'సొంత పన్జేసుకుంటే తప్పేముంది? మనమేమి దొంగ పని జేత్తాండామా! రంకు పని జేత్తాండామా!' అని మనసుకు సర్ది చెప్పుకొని మరుసటిరోజు తన పెళ్ళాం పిల్లలతో ముళ్ళచెట్ల మధ్యలోకి ప్రవేశించాడు పద్మవ్యూహంలోకి చొరబడ్డ అభిమన్యుడిలా, శివయ్య. శత్రువుల్లా వున్న ముళ్ళ పొదలను తను కొడవలి, గొడ్డలి ఆయుధాలతో ఎదురించి బండెడు కట్టెలు సిద్ధం చేసుకున్నాడు.

చేతిలోని డబ్బు మళ్ళీ మళ్ళీ లెక్కపెట్టుకుంటూ, దీనికింత ఖర్చు పెడితే సరిపోతుంది. రోజుకు ఇంత డబ్బు వస్తే, తన పొలంలో ముళ్ళ పొదలన్ని

(తరువాయి 55 వ పేజీలో)

# ఎడారిపూలు ఎరుపెక్కితే !

— ఎ. ఎన్.

కనురెప్పల మధ్య మండుతున్న
భూగోళం
రాయలసీమ
కలహండీ కబేళా
ఇథియోపియా ఎండిన స్తన్యం
పాలిపోయిన మేఘాల కింద
వాడిపోయిన కలువ పూవులే !
ఘనకీర్తి గతం వర్తమానాన్ని
శల్యం చేస్తే
కరువు ఇనుప గోళ్ళలో సీమ
ఆకాశ గంగ ఆదరణ లేదు
పాతాళ గంగ కనికరించదు
తెలుగు గంగ గోటి కందదు
పగటి కలలు వికటిస్తే
చుక్కలు లెక్కబెట్టే వారసులు
గతం మేలని కీర్తిస్తారు.
కృష్ణదేవరాయని రాణులు నగలమ్మి
రట
చెరువులు తవ్వించిరట
తేట నీరు తెప్పించిరట
గతమెంత కమ్మనిది
మా కళ్ళ ముందు లేనిది!
ధాతు కరువుకు మూల్యం
పీనుగు గుట్టలు
తెల్ల తలారీలు సైతం కరిగిపోయిన
వైనం....
చాలు మెకంజీ పథకాలు
ఆర్థర్ కాటన్ ప్రయత్నాలు.
ఎండిన అస్థికలతో
కన్న రంగుల కలలు విషమించి
వర్తమానం మృత్యు నృత్యం చేసి
నపుడు
శంఖు స్థాపనలు నెమరేస్తూ
జీవితం యీదుతారు....
ఎడారిలో నీటికోసం
పచ్చటి పైరు కోసం
తలలూచే సుతిమెత్తని పూలకోసం
ఎదురు చూపుల ఎడారి వాసులకు
ఎండమావి
శ్రీబాగ్ ఒప్పందం.
స్వార్థం పులుముకొని రంగులు
మార్చే
రాజకీయ ఊసరవెల్లులు
అభివృద్ధి వారసులై
మిమ్మ నిస్సహాయులుగా గెంటివేసి
నపుడు
ఒప్పందాలు నీటిమీద రాతలే !
జీవితం చిక్కి శల్యమైనా
మేక కసాయిని నమ్ముతుంది !
జీవితం వసివాడినా
మీ కత్తిని నమ్మి తలారి కిస్తారు
వర్షం రాదు కన్నీరు తప్ప
బీటలు వారి నెర్రెలు చీలిన చెరువులు
జిల్లేళ్ళకు ఆనవాళ్ళు
నాగదార చెట్లు రాకాసి ముళ్ళతో
తలలూపుతాయి
నీటి బుగ్గలు ఇసుక పాతరలై
అంతర్గామినులు అంతర్థానమైన సీమ
సోషిల్లిన పెన్న గతం ముత్తయిదువ.
కృష్ణా కావేరీలు కనికరించవు

దీర్ఘ నిద్రలో మునిగిన పథకాలు
కాగితాల్లో కడతాయి సొలెగూళ్ళు.
భూగర్భంలో దాగిన జలసంపద
సముద్రం మింగేసే వృథా నీరు
సీమ ఆవలి జీవనదులు....
చేతికి కంకాళాలిచ్చినాయి.
అవును, జీవితం వృథా కన్నీటి గాథ
శాశ్వతీకరించబడ్డ ఈ ఆకలి ధాత్రి
ఎప్పటికీ తెల్లవారని రాత్రి.
ఎగిరే లేగలు
పాడి యావులు ఏవీ ?
కబేళాగా మారిన సీమలో
దైన్యం తప్ప బతుకేది ?
అంకుశం పట్టిన అలనాటి
పౌరుషాగ్నులేవీ ?
విజయనగర వీరగాథలు
తవ్వితే ఎగిరొచ్చే విలాపాగ్నులు....
విషాదాశ్రువులు....
ఇది రతనాల సీమ
గత వైభవ సీమ
నిజ రాళ్ళ సీమ !
జీవితమా, అంతంలేని నీ గవేషణ కోసం
ఆత్రంగా కలలుకనే
నీ బిడ్డల చూడు....
ఏడవడానికి సిగ్గుపడం
కన్నీరు దాహం తీరుస్తుందని,
చేయి నరుక్కోవడానికి సందేహించం
కనిపించని దైవాల కరుణ కోసం,
రాత్రుళ్ళు దీనంగా శోషిల్లి
ఉదయం కోసం ఆబగా ఎదురుచూస్తే
మిగిలింది నిరాశైనా
నిబ్బరంగా తట్టుకునే సత్తువ నివ్వు
జీవితమా ! కాస్తంత ఓపిక నివ్వు.
పాతాళంలోకి దిగిన ప్రాణం
ఆకాశంలోకి ఎగసిన జీవం
నా చేజారి పోయిందని
ఇసుకలో వెదుక్కుంటున్నాను
జీవితమా, చీకటి పడుతున్నది కాస్త శక్తి నివ్వు.
ఎవరో నవ్వుతున్న సవ్వడి
ఎవరో కదిలినట్లు
ఎవరో చేయి అందించినట్లు
అర్జునుడి నిర్వేదం వీడి ముందుకొస్తే
బాకు దిగేసిన బ్రూటస్‌లు
అభివృద్ధి వారసులు
జెండాలు విపణిలో పెట్టే నాయకులు
తవ్వితే ఖనిజ సంపద
వెదికితే అపురూప వజ్రాల వజ్ర కరూర్
చుట్టూతా వన్యజీవిత రీతులు
రాయలసీమ రతనాల గర్భ !
నరసింహారెడ్డి శౌర్యం
సీమ కొదమల స్వంతం
తరిమెల నాగిరెడ్డి త్యాగం
వదలిపోని సీమ వసంతం
జీవన భీభత్సం చెలరేగ వచ్చు
కల్లోల సముద్రంలో
తుపానులు అసాధారణం కాదు,
వినాశనం వికాసానికి దారి తీయవచ్చు!
నెత్తురు కార్చే సీమ
నేల పగిలిన సీమ
కాంతులీన వచ్చు....
అంకుశం తిరగేస్తే....
రాళ్ళసీమ చిగురించ వచ్చు....

## ఏడుపు పాట

(అనంతపుర జిల్లా సుగాలోళ్ళు ఏడ్చుకుంటూవాళ్ళ బాసలో పాడుకునే కరువుపాట.)

కొండల మింద మొగిలి మేస్తా వుండాది
వాన కుమ్మరించేస్తాదనే ఆశతో
మా తండ్రి తోటలో తిరగతా వుండాడు
నెత్తిన పైగుడ్డేసుకొని మానాయిన
బలే కుశాలతో తిరగతుండాడులే!
వానొస్తే వడ్లరాశిమింద పొలిగోణ్ణి పెట్టొచ్చని
మా నట్టింటంతా చెనిక్కాయలు తెచ్చి పోసెయ్యొచ్చని
మా నాయిన వొళ్ళు తెలవని కుశాలతో
తోటంతా తిరగతుండాడు!!
వాన రావాలని ఇన్నాళ్లూ మా దేముణ్ని
వుత్త చేతల్తోనే మొక్కుకున్నాము!
వాన రావాల్నేగాని మా స్వామిని
కండ్లారా చూసుకోమా, నగల్తో దిగేసి!!
అప్పుడే చూడు
కొండలమింద నుంచి మొగిలి
ఏందో పనుండినట్టు పోతా వుండాది!
ఇంకేం రాలబోతాయి చినుకులు?
తోటకాడ తిరిగే నా నాయినా!
మా ఆడపిలకాయలను మాత్రం కనొద్దు
మాకు - చిన్నప్పుడు చిన్ననగ చెయ్యించాల
పెద్దప్పుడు పెద్దనగ చెయ్యించాల
దీంతో మీరు అప్పులైపోయ్ పూళ్ళొదిల పోతారు!
నా పిచ్చి తండ్రీ!
మా ఆడపిలకాయలను ఎందుకు కన్నావు?
మా తోడబుట్టిన అన్నలారా!
మీకెందుకు చెప్పండి చెల్లెండ్లు?
మా పాదాలకు మీరు గోలుసులు తీసియ్యాలగదా
మీ బావలకు మీరు వుంగరాలు పెట్టాలగదా!
మీకెందుకు చెప్పండి చెల్లెండ్లు?
ఓ నాయినా! ఓ అన్నా!!

(తరువాయి 63 వ పేజీలో)

# కరువు - కాళహస్తి మాహాత్మ్యము

— కాత్యాయనీ విద్మహే

కరువుకు కాళహస్తి మాహాత్మ్యానికి వున్న సంబంధం ఏమిటని ఎవరికైనా విడ్డూరంగా అనిపిస్తే అనిపించవచ్చు. కానీ గత మూడేళ్ళుగా కాళహస్తి మాహాత్మ్యంలోని నత్కీరుని చరిత్రను డిగ్రీ విద్యార్థులకు పాఠంగా చెబుతున్నప్పుడు ఆ పాఠ్యాంశంలో భాగమైన 'దుర్భిక్ష వర్ణనము' చదువుతూ కరువు పరిస్థితిని ధూర్జటి కథలో భాగంగాచేసి ఎంత వాస్తవంగా చిత్రించాడో కదా అని ఆశ్చర్యపడటమే కాక కరువుకు రాజ్యానికి మధ్యవున్న అన్యోన్య వైరుధ్య సంబంధాలను అర్థంచేసుకొనే ప్రయత్నం చేస్తూవచ్చాను. ఆ అవగాహన నుండే ఇప్పుడీ చిన్న వ్యాసం సిద్ధం చేయటం జరిగింది. దీనికి ప్రజాసాహితి' కరువు ప్రత్యేక సంచిక' కోసమై ఈ అంశాన్ని నిర్దేశిస్తూ వ్యాసం వ్రాయమన్న నిర్మలానందగారి ఉత్తరం తక్షణం ప్రేరణ.

'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము'ను వ్రాసిన ధూర్జటి ప్రబంధ యుగపు కవి. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానాన్ని అలంకరించిన అష్టదిగ్గజాలలో ఒకడుగా ప్రసిద్ధి కెక్కాడు. శైవభక్తి నిబద్ధతతో శ్రీకాళహస్తి మాహాత్మ్యము, కాళహస్తీశ్వర శతకము వ్రాశాడు.

విజయనగర రాజుల నాటికి భూస్వామ్య నాగరికత అత్యున్నత స్థాయికి చేరుకొంది. రాజ్యం బలమైన వ్యవస్థగా రూపొందింది. ప్రభుత్వోద్యోగులు తమ అధికారావకాశాలను వినియోగించుకొని రైతులను నిర్బంధించి గ్రామకంఠ భూములను, బంజర్లను సాగు చేయించి విస్తృతంగా వ్యవసాయ సంపద పెరగటానికి దోహదం చేశారు. ఆ ఫలసాయం తాము అనుభవిస్తూ సంపన్న వర్గంగా స్థిరపడ్డారు. వర్తక వ్యాపారాలు ముమ్మరంగా సాగాయి. బంగారం, రత్నాలు, వజ్రాల కోసం గనుల తవ్వకాలు జరిగాయి. రాజవీధులలో రత్నాలు రాసులుగా పోసి అమ్మారన్న ప్రసిద్ధి విజయనగర సామ్రాజ్యకాలానిది. అయితే వ్యవసాయపు పంటల ఎగుమతి ఎంతగా జరుగుతున్నా, వ్యవసాయానికి జీవనాధారమైన నీటిని అందించటానికి చెరువులు, బావులు, కుంటలు, కాలువలు ఎంతగా నిర్మించబడుతున్నా వర్షం సరిగా కురవని సంవత్సరం కరువు కాటకాల బాధను అనుభవించటం విజయనగర సామ్రాజ్యంలో ప్రజలకు తప్పలేదు. ఆకలికి ఎందరో బలి అయి చావటం, ఆకలికి తట్టుకోలేక పిల్లలను, బంధువులను బానిసలుగా అమ్మేసే హైన్యస్థితికి దిగజారటం ఆనాడు విజయనగర సామ్రాజ్యాన్ని సందర్శించిన బార్బోసా లాంటి విదేశీ చరిత్రకారుల వ్రాతలవల్ల తెలుస్తున్నది. 1540 లో వచ్చిన భయంకర కాటకాన్ని

ప్రస్తావిస్తూ 'జోనోదే కాస్త్రో' అనే పోర్చుగీసు యాత్రికుడు జనం బ్రతుకుతెరువులకై పెద్దపెట్టున వలస పోతున్నారని ఆయా సందర్భాలలో వాళ్ళు తమ భూములను, మాన్యాలను అమ్ముకొని పోవటమో, మరెవరికయినా అప్పజెప్పి పోవటమో జరిగేదని వ్రాశాడు.

విజయనగర రాజుల కాలం వాడైన ధూర్జటి ఇటువంటి కరువు పరిస్థితులను ప్రత్యక్షంగా చూడటమో, వినివుండటమో తప్పని సరిగా జరిగివుంటుంది. అందువల్ల తానెంత భక్తి కావ్యరచనా సంకల్పుడైనా మానవ మనస్తత్వం, ప్రవృత్తి ఏ పరిస్థితుల నుండి ఎలా రూపొందుతుందో సమాజంలోని మానవ సంబంధాల నిత్య అనుశీలనం నుండి గ్రహించే కవి సహజ స్వభావం నుండి ఆ కరువు పరిస్థితిని శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో ప్రస్తావించకుండా ఉండలేక పోయాడు.

శ్రీకాళహస్తి మాహాత్మ్యము క్షేత్ర ప్రభావాన్ని తెలిపే కావ్యం. ఆంధ్ర దేశంలోని శైవక్షేత్రమైన కాళహస్తిలోని శివుని సాక్షాత్కారాన్ని పొంది అతనిలో లీనమైన భక్తులలో నత్కీరుడు ఒకడు. నత్కీరుడి చరిత్ర కథనంలో కథకు కావలసిన వాతావరణాన్ని కల్పించటంలో భాగంగా కరువు పరిస్థితి వర్ణించబడింది.

నత్కీరుడు మధురను పరిపాలించే పాండ్య భూపాలుడి ఆస్థానకవి. మధురలో మీనాక్షీ సుందరేశ్వరులు కొలువుతీరి వున్నారు కనుక అది కూడా శైవ క్షేత్రమే. పాండ్యరాజు శివభక్తుడే. "శైవ సంవిత్సార మరాళ రత్నము" లన దగిన పన్నెండు మంది కవులను శివభక్తి రసాపేక్షతో తన ఆస్థానంలో వుంచి పోషించాడు. అట్లాగే రోజులు గడిచిపోతే కథే లేదు. శైవ మహాత్మ్యం ప్రతిష్ఠాపితం కావాలంటే ఒక పరిస్థితి ఏర్పడాలి. దైవ ధిక్కారం జరగాలి. ఆ దైవానికి కోపం రావాలి. భక్తుడిపై కోపగించుకోవాలి. మళ్ళీ ఆ దైవమే భక్తుడికి ప్రసన్నుడై తరుణోపాయం సూచించాలి. నత్కీరుడి చరిత్ర కూడా ఈ కథా నిర్మాణ సూత్రం మీదనే అల్లబడింది. మధురా నగరంలో కరువు రావటం, అందుకు ప్రాతిపదికగా చేయబడింది. ఎనిమిది పద్యాలలో దుర్భిక్ష వర్ణనం చేసిన కవి ఆ తరువాత మానవ జీవిత విధానంపై దాని ప్రభావమెలా వుందో చూపటాన్ని కథాంతర్భాగం చేశాడు.

అడిగినది అర్థులకిస్తూ బంధుజనాలకు సంపదలిస్తూ పాండ్యరాజు రాజ్యం చేస్తున్న తరుణంలోనే వర్షాలు లేక క్షామం పుట్టి రాజ్యంలో పెద్దక్షోభ బయలుదేరింది. వర్షాలు లేకపోవటానికి గ్రహాలు వకంగా పనిచేయటమే కారణమంటాడు కవి. శని గ్రహం మీన రాశిలోకి ప్రవేశించటంవల్ల జనులందరి మనసులు తల్లడిల్లే లాగా సుడిగాలి తిరిగి మబ్బులు విచ్చిపోయి వర్షమనేది కురవకుండా పోయిందని వర్ణించాడు ధూర్జటి. వర్షం లేకపోవటంవల జనుల మనసులు ఎలా తల్లడిల్లుతాయో

ఈనాడు రాయలసీమ రైతాంగం అనుభవంలోవున్న విషయమే.వర్షాలు లేకపంటలు పండక తిండి గింజలకు కరువు ఏర్పడిన పరిస్థితులలో జనం క్షుద్బాధ తీర్చుకోవటానికి ఏది పడితే అది తినటానికి సిద్ధపడతారు.

"గునుకు లూదర్లు బరపటల్ గోళ్ళగోండు
లల్లి బియ్యంబు వెదురు బియ్యంబు గొట్టె
చెట్లు నింజెట్లు తుంగ ముస్తియలు నీఁత
గుంజు మొదలుగ ఁదిన దొరకొనియె జనము" (3-151)

అని ఆ దైన్యస్థితిని వర్ణించాడు ధూర్జటి.

కరువు ముందు మానవ శరీరం మీద తన ప్రభావం చూపిస్తుంది. తిండి లేకపోవటం వలన కండ అనేది మనిషి ఒంటి మీద కరువవుతుంది. తోలు ఎముకలు మాత్రమే మిగిలిన మనుషులు ఈసురోమంటూ ఎక్కడ బడితే అక్కడ కూలి పోతుంటారు. ఆకలికి మలమల మాడి ఏదో ఒక రోజు ఇంత తిండి దొరికినా దానిని తిని హరాయించుకోలేక నేల కూలి ప్రాణాలు విడిస్తుంటారు. ఆ తరువాత కరువు మానవ సంబంధాలమీద తన ప్రభావాన్ని చూపిస్తుంది. తిండి ప్రధాన సమస్య అయినప్పుడు మిగిలిన మానవ సంబంధాలన్నీ అప్రధానాలే అవుతాయి. జీవితాంతం కలసి మెలసి వుంటామనుకొన్న భార్యా భర్తలిద్దరూ కలసి కంటికి రెప్పలా కాపాడి పెంచుకొందాం మనుకొనే పిల్లలు - వీళ్ళందరి మధ్యవున్న, ఉండాల్సిన ఆత్మీయతా సంబంధాన్ని కరువు నిర్దాక్షిణ్యంగా చంపేస్తుంది. కరువు మానవ శరీరం మీద, మానవ సంబంధాల మీద కనబరిచే ఈ ప్రభావాన్నే ధూర్జటి "తోలును నెమ్ములున్మిగిలి త్రోసిన ఁదొంబదిచోట్ల ఁగూరు వా/రాలిని బిడ్డల న్విడిచి యాఁకటి చిచ్చున పెచ్చుపోవు వారు...." (3-153) అనే మాటలలో నిరూపించాడు ఈ కరువు పరిస్థితి చివరకు మనిషిని మనిషి తినటానికి కూడా వెనుదీయని పరిస్థితులను సృష్టిస్తుంది. ఈ పరిస్థితినే "మానిసి మానిసి దిను కఱవని" (3-156) అభివర్ణించాడు ధూర్జటి.

ఇటువంటి కరువు పరిస్థితులలో మూల స్థాన హరద్విజుడు ఒకడు పాండ్య దేశాన్ని వదిలి ఎటైనా పోవాలనుకొన్నాడు. అప్పుడు మహేశుడు కరుణతో అతనికి ప్రసన్నుడై పాండ్యరాజు పైన శృంగార రసానవద్యంగా ఒక పద్యంచెప్పి యిచ్చి ఆ పద్యం తీసుకువెళ్ళి రాజా స్థానంలో చదివితే రాజు మెచ్చుకొని వేయి మాడలిస్తాడని, దానితో అతనికి వెచ్చాలు కొనుక్కోవటానికి వీలవుతుందని అప్పుడిక అతను ఆకలి దిగులుతో బాధపడాల్సిన అవసరం లేకుండా బ్రతకవచ్చని, అతను తృప్తిగా తిని బ్రతికితే కరువుతీరి జగానికంతా సంతోషాన్నిచ్చే వర్షం కురుస్తుందని, అప్పుడు పంటలు పండి జనానికి పండుగ అవుతుందని చెబుతాడు.

ఈ మాటలనుబట్టి చూస్తే ఒక వైపు దేశంలో కరువు విలయతాండవం చేస్తున్నా ప్రజలు తిండిలేక చచ్చిపోతున్నా బ్రతుకు తెరువులు వెతుక్కొంటూ వలస వెళ్ళిపోతున్నా రాజాస్థానం వీటికి అతీతంగా కవితా గోష్ఠులతో కాలం వెళ్ళబుచ్చుతున్నదని అర్థం అవుతుంది. ఆకలిచావులు ఒకవైపు విజృంభిస్తున్న రాజ్యంలోనే విశ్రాంతి వర్గాలు, అధికారవర్గాలు, మేధావులు ఆ కరువు నీడలు సోకని భద్ర ప్రపంచంలో శృంగార రసానుబద్ధమైన కవిత్వాన్ని చదువుకొంటూ హాయిగా కాలక్షేపంచేస్తున్నారు. కొందరి దగ్గర సంపదలు కేంద్రీకృతమై కులాసా జీవితం గడుపుతుంటే మరికొందరు తిండిలేక మలమల మాడిపోయే వర్గ వ్యవస్థ స్వభావాన్ని అర్థం చేసుకోవటానికి ప్రేరణనిస్తాయి ఈ వాక్యాలు. అంతేకాదు. రాజ్యంయొక్క స్వభావమే కరువు పరిస్థితిని సృష్టిస్తుందంటే అతిశయోక్తి కాదు. వర్షాలు లేకపోవటం అందువల్ల పంటలు పండకపోవటం ప్రకృతి పరిణామ ఫలితం కావచ్చు కానీ ఇలా సంపదలు, విలాస జీవితం, భోగాలు ఒకచోట విలసిల్లుతుండగా ఆకలి చావులు మరొకవైపు కొనసాగుతుండటం మాత్రం ప్రకృతి సహజాంశంకాదు. ఉత్పత్తుల పంపిణీ విధానంలోని అవకతవకలు, ఉత్పత్తులున్న మేరకు అన్నీ మార్కెట్‌లోకి రాకుండా కృత్రిమ కరువును సృష్టించటం, శివప్రసన్నత పొందిన హరద్విజుడికిలాగా వెయ్యేసి మాడలు అంతకంటే అధికతరమైన ధనంవున్నవాళ్ళు వాటిని పొందగల అవకాశం వుండటం - ఇవన్నీవర్గ సమాజ సహజ లక్షణాలు కాగా రాజ్యం వాటిని పరిపోషించే వ్యవస్థగా వుంటుంది కనుక "అన్నపు రాసులు ఒకచోట ఆకలి కడుపులు ఒకచోట" అనే పద్ధతిలో ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం వేరుగా కేంద్రీకృతమయ్యే వైరుధ్య స్థితి ఏర్పడుతుంది. ఈ వైరుధ్యాల ఫలితమే ఆకలిచావుల రాజ్యంలో శృంగార రసానువద్యమైన పద్యాలను చదువుకొంటూ, వింటూ కాలక్షేపంచేసే వర్గాలుండటం.

ఇకపోతే కరువు బాధకు ఎందరెందరో మలమలమాడి చనిపోతుంటే,మరెందరో వలసపోతుంటే ఎవరినీ ఆపని శివుడు మూలస్థాన హరద్విజుడ్ని మాత్రం వలసపోకుండా ఎందుకు ఆపినట్లు ? అతను బ్రాహ్మణుడు.శివాలయ పూజారి.అతను కూడా వెళ్ళిపోతే తనకు పూజలుచేసే వాళ్ళెవరు? అందువల్ల అతనికి బ్రతికేమార్గం చూపిస్తేనే తాను నిలబడతాడు. అందుకని అతన్ని ఆపి పాండ్యరాజుకు ఇష్టమైన కవిత్వ కళను అతనికి అరువిచ్చి ఆస్థానంలో ప్రదర్శించి బహుమతులు అందుకొని రమ్మన్నాడు. గోబ్రాహ్మణులు సంతోషిస్తే సుఖిస్తే, ప్రపంచమంతా సంతోషించి సుఖిస్తుందన్న నీతినే తాను చెప్పాడు. రాజుయొక్క మెప్పుపొంది కరువు బాధలనుండి విముక్తి చెందమని శివుడు హరద్విజునికి చెప్పిన వాక్యం రాజ్యానికీ బ్రాహ్మణవర్గానికి వున్న అన్యోన్య సంబంధాన్ని ప్రతిష్ఠాపితం చేసేదే. ఆ రకంగా

రాజు దేవుడు - బ్రాహ్మణుడు ఈ ముగ్గురూ ఒక్కటై మామూలు ప్రజానీకం కంటే భిన్నంగా తమ సుఖంలో సంతోషంలో ప్రజల సుఖ సంతోషాలున్నాయని చెప్పే ఒక అధికారవర్గంగా తమ కనుకూలమైన భావజాల వ్యవస్థ నిర్మాణంలో ఎలా భాగమవుతారో అర్థం చేసుకోవటానికి కూడా ఈ సందర్భం బాగా ఉపయోగ పడుతుంది.

కరువు మానవ శరీరం మీద, సంబంధాలమీద ఎటువంటి దుష్ప్రభావం చూపిస్తుందో చెప్పిన ధూర్జటి అది విలువలనెట్లా ధ్వంసం చేస్తుందో కూడా చెప్పకనే చెప్పాడు. మూలస్థాన హరిద్విజుడు కవికాడు. కవి కానివాడికి శివుడు ఒక పద్యం ఇచ్చి పాండ్య రాజుకు వినిపించి బహుమతి పుచ్చుకొని రమ్మన్నాడు. ఆ పద్యం లోకవృత్త విరుద్ధంగా వుందని నక్కీరుడు అభ్యంతర పెడితే కవిత్వం గురించి ఏమీ తెలియనివాడు కావటంవల్ల, తాను చదివింది దొంగ పద్యం కావటంవల్ల ఏమీ సమాధానం చెప్పలేక హరద్విజుడు సిగ్గుతో, అవమానంతో వెనుదిరిగి వస్తాడు. ఆకలి బాధలో వున్నప్పుడు శివుడిచ్చిన పద్యాన్ని తను వ్రాసిందిగా సభలోచదివితే వచ్చే పరిణామా లెటువంటివన్న రెండవ ఆలోచన కలగలేదతనికి. నక్కీరుడు ఆ పద్యంలో తప్పుపట్టిన తరువాత దానికి తానేమీ సమాధానం చెప్పలేని నిస్సహాయతనుండి అతనిలో 'పరవిద్యాధీనత భూపాల సభల తేజము గలదే' (3-162) అన్న ప్రశ్న ఉదయించింది. ఆ విషయమేచెప్పి శివుడి పద్యం శివుడికి ఇచ్చేశాడు. పరవిద్యను తన విద్యగా ప్రదర్శించే స్థాయికి హరద్విజుడిని దిగ జార్చింది ఏదీ అంటే కరువు. దరిద్రుడయినవాడు చేయని తప్పులేదు అని లోకోక్తి. ఆకలి బాధలోవున్న హరద్విజుడు అలాంటి తప్పే చేశాడు. ఆకలి బాధ అతని వివేకాన్ని కాసేపు కప్పేసింది. కానీ అతనికి త్వరగానే తనేమిటో తెలిసి వచ్చింది. తానొక మామూలు శివారాధనా తత్పరుడైన బ్రాహ్మణుడు. అంతేగాని కవికాడు. 'ఇక్కరవుచే ఇట్లైతి' నను కొంటాడు - అంటే కరువు తనను అబద్ధాలకోరుగా పరవిద్యాడంబరం మీద ఆధారపడి జీవించటానికి తలపెట్టిన మోస గాడిగా మార్చింది. ఇలా బ్రతకటం కాక దరిద్రుడయినా భిక్షమెత్తుకొని కడుపును కాపాడుకొని కరువుకాలం తీరాక వస్తానని తను ఒక నిర్ణయానికి వస్తాడు.

అయితే శివుడతన్ని ఆపటం, సభకు వచ్చి తను వ్రాసిచ్చిన పద్యంలోతప్పు పట్టిన నక్కీరుని శపించటం, మళ్ళీ అతని విముక్తికి కాళహస్తీశ్వర దర్శనాన్ని తరుణోపాయంగా పేర్కొనటం ఇదంతా తరువాత కథ. ఈ కథతో మనకు నిమిత్తం లేదు. కానీ ఈ కథ నిమిత్తంగా ధూర్జటి సమకాలీన కరువు పరిస్థితుల అనుభవాన్ని శాశ్వతంగా రికార్డుచేసిపెట్టి మనకు అందించగలిగాడన్నది ఒక సాహిత్య సామాజిక వాస్తవం.

# ఎవడన్నాడురా...!

— వి. జి.

ఎండిన కంకులు
భగ భగమనే సూర్య భగవానున్ని
సైతం ఎదుర్కొని
నీటిచుక్క లెండమావులైనా
అపాదమస్తకమూ అల్లాడుతూ
నీటి చుక్కకోసం నిరీక్షిస్తే....
బీటలు పడిన మట్టిలో
సైతం
వేళ్ళాను కొనిన మొదలు.
అణువు మొదలు
అణువణువునూ
కలలోనైనా పలకరించని
నీటి బిందువు కోసం దేవురిస్తే....
ఈ రైతు పోషకుని
మాతృక అయిన నేలతల్లి
సూర్య భగవానుడి నిరంతర దాడికి
చిక్కి శల్యమై
ఎండిన గొంతుతో దాహం దాహం
అంటూ
బీటలు వారి
జీవచ్ఛవమై పడి వుంటే....
చాలీ చాలని బత్తెం
చాంతాడంత జీవనాన్ని
కకా వికలం చేస్తుంటే....
పొట్ట చేత పట్టుకొని
ఎండిన బీళ్ళ గుండా
బతికే బతుకులో ఓటమి నంగీకరిస్తూ
మెతుకు కోసం
బతుకు కోసం
భారంగా
జన సమూహాలు
కదిలి పోతుంటే....
ఎవడన్నాడురా....!
రాయలసీమ రత్నగర్భయని?

(46వ పేజీ తరువాయి)

అమ్మితే ఎంత డబ్బు వస్తుంది? అని ఇలా లెక్కలు వేసుకుంటూ బండి ఎక్కాడు శివయ్య.

పూలమ్మిన చోట కట్టెలమ్మడం అనే సామెత దేశమంతా తెలుసు. కానీ తన లాంటి రైతు పంటలమ్మిన చోట కట్టెలమ్మే పరిస్థితి వచ్చినందుకు, బాధ ఒక వేపు తొలుస్తూండగా వూరి వేపు బండిని నెమ్మదిగా నడిపించాడు శివయ్య.

"చెడిపోవాలంటే చెనిక్కాయ పంటేయ్,
బాగుపడాలంటే చెనిక్కాయ యాపారం చెయ్"

# కరువు ప్రాంతాల ప్రజలపట్ల ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని ఖండించండి !



## కరువు నివారణ పథకాల అమలుకోసం సంఘటిత పోరాట మార్గం చేపట్టండి !!

పశ్చిమ కృష్ణాలోని నందిగామ ప్రాంతంలో కరువు పరిస్థితులు నానాటికీ తీవ్ర రూపం దాల్చుతున్నప్పటికీ ప్రభుత్వం దున్నపోతుపై వర్షం పడిన చందంగా వ్యవహరిస్తున్నది. రైతాంగం వేసిన మిర్చి, ప్రత్తి వేరుశనగ, ప్రొద్దు తిరుగుడు లాంటి పంటలకు సాగునీరు అందక, ఈ సంవత్సరం వర్షాలు సరిగా పడక ముఖ్యంగా పేద, మధ్య తరగతి రైతాంగం దివాళా తీశారు. కొన్నిచోట్ల ధనిక రైతాంగం కూడా సంక్షోభంలో పడిపోయారు. ఈ సంవత్సరపు తక్కువ దిగుబడి వచ్చిన పంటలకు క్రితం సంవత్సరానికంటే సగానికి సగం ధరలు పడిపోయినందున రైతాంగం మరిన్ని కష్టాలలోకి నెట్టబడ్డారు. ఈ కరువు పరిస్థితుల్లో పశువులకు మేత లేక కళ్ళముందే పశువులు చనిపోతుంటే రైతాంగం అల్లాడి పోతున్నారు. మరో వైపు ఈ ప్రాంతంలోని వ్యవసాయ కూలీలకు పనులు దొరకక వలస కూలీలుగ బ్రతకాల్సిన దుస్థితి ఏర్పడింది. వలస కూలి పనులు కూడా దొరక్క వ్యవసాయ కూలీల కుటుంబాలు రోజుల తరబడి పస్తుల జీవితాలను ప్రాణాలను కళ్ళల్లో పెట్టుకొని బ్రతుకుతున్నారు. అయినా ప్రభుత్వం ఈనాటికీ ఏ ఒక్క కరువు నివారక చర్య తీసుకొనక పోవటం సిగ్గుచేటు. ఈ ప్రాంతంలో నెలకొన్న తీవ్ర పరిస్థితుల్లో యుద్ధ ప్రాతిపదికపై కరువు నివారణ చర్యలు చేపట్టాల్సిన ప్రభుత్వం - చివరికి గతంలో ఉన్న చందర్లపాడు మండలంలోని ఏటూరు ఎత్తిపోతల పథకాన్ని రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది. ఈ చర్య కరువు ప్రాంతాల పట్ల ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరికి పరాకాష్టగా నిలుస్తుంది.

గత నవంబర్ నెలలో జిల్లా కలెక్టర్ ఈ ప్రాంతాన్ని పరిశీలించటం, చందర్లపాడు మండలాన్ని కరువు ప్రాంతంగా గుర్తించినా ప్రకటించకపోవటం, ఈనాటికీ ప్రభుత్వం వైపు నుంచి ఎటువంటి చర్యా లేకపోగా ఏటూరు ఎత్తిపోతల పథకాన్ని రద్దుచేసే నిర్ణయాన్ని మాత్రం సిగ్గు లేకుండా ప్రకటించింది. అంతేగాక

సాగర్ జలాలను అందించటంలో ఘోరంగా విఫలమైన ప్రభుత్వం రైతాంగం నుంచి భూమిశిస్తు, నీటి తీరువాలను నిర్బంధ పద్ధతుల్లో వసూలు చేయటానికి పూను కొంటుంది.

జిల్లా సబ్ కలెక్టర్ శ్రీ రజిత భార్గవ ఫిబ్రవరి 14వ తేదీన చందర్లపాడు వచ్చిన సందర్భంగా వివిధ గ్రామాల రైతాంగం, రైతుసంఘాల ప్రతినిధులతోపాటు రైతుకూలీ సంఘం జిల్లాఅధ్యక్షులు కా॥ మందా జార్జి నాయకత్వాన ఒక ప్రతినిధివర్గం ఈ ప్రాంత సమస్యలపై మెమోరాండాన్ని అందచేసింది. అంతకు ముందు ఒక మెమోరాండాన్ని చందర్లపాడు యం. ఆర్. ఓ. గార్కి అందచేసింది. కరువు పరిస్థితులు కళ్ళకు కట్టినట్లు కన్పిస్తున్నా సబ్ కలెక్టర్‌గారు మాత్రం "పరిశీలిస్తాం, పై అధికారులకు తెలియజేస్తాం, అంతకంటే మేం ఏమి చేయలేం" అని చెప్పి వెళ్ళి పోయారంటే ఆకలి మంటలతో అలమటిస్తున్న ప్రజలపట్ల ఈ ప్రభుత్వం ఎంత మూర్తీభవించిన నిర్లక్ష్యంతో ఉందో అర్థమౌతుంది. దీనినిబట్టి విజ్ఞప్తులు మెమో రాండాలతో ప్రభుత్వం కదలదని కూడా స్పష్టమౌతుంది. కావున కరువు సమస్య లకు తీవ్రంగా గురి అవుతున్న ప్రజానీకం అంతా గ్రామాలకు గ్రామాలే కదలి సమైక్య ఆందోళన సాగించటం ద్వారానే సమస్యలను పరిష్కరించుకోగల్గుతాము. అలానే వివిధ రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు కూడా ఒకే ఐక్య వేదిక మీదకు వచ్చి నందిగామ ప్రాంత ప్రజలు ఎదుర్కొంటున్న ముఖ్య సమస్యల పరిష్కారం కోసం సంఘటిత పోరాటం సాగించాల్సి వుందని మా సంఘం విజ్ఞప్తి చేస్తున్నది.

ఈ క్రింది ముఖ్యమైన డిమాండ్లను సాధించుకునేవరకు నిలకడైన సంఘటిత ప్రజా ఉద్యమంలో క్రియాశీలక పాత్ర నిర్వహించాల్సిందిగా కరువు పీడిత ప్రజా నీకానికి మా సంఘం విజ్ఞప్తి చేస్తున్నది.

**డిమాండ్లు :**

— నందిగామ ప్రాంతాన్ని తక్షణమే కరువు ప్రాంతంగా ప్రకటించాలి.

— చందర్లపాడు మండలాన్ని కరువు ప్రాంతంగా ప్రభుత్వం గుర్తించి కూడా ప్రకటించకపోవడాన్ని ఖండించండి.

— రద్దు చేసిన ఏటూరు ఎత్తిపోతల పథకాన్ని వెంటనే పునరుద్ధరించాలి.

— సాగర్ కాల్వ చివర భూములకు పూర్తిగా నీరందేలా కాల్వలకు పూర్తిస్థాయిలో పూడికలు తీయించాలి.

— నందిగామ సబ్ డివిజన్‌లో ఉన్న కొత్త ఎత్తిపోతల పథకాలను, పంపింగ్ స్కీములను పూర్తి స్థాయిలో పనిచేయించాలి. అవసరమైన చోట్ల ఎత్తిపోతల పథకాలు చేపట్టాలి.

— ఎన్. సి. కార్పోరేషన్ తక్షణమే రంగంలోకి దిగి, భూములు సర్వే జరిపి

బోరింగులు, ఎత్తిపోతల పథకాలను ప్రారంభించాలి.

— వ్యవసాయ కూలీలకు తక్షణమే పని చూపించాలి. అంత వరకు భోజన సదుపాయాన్ని ఉచితంగా కల్పించాలి.

— భూమిలేని పేదవర్గాలకు బంజరు భూములను, దేవాదాయ భూములను, భూస్వాముల మిగులు భూములను పంచాలి. వారికి పక్కా గృహాలు నిర్మించాలి.

— పేద వర్గాలలో చదువుకున్న నిరుద్యోగులకు అర్హతకు తగిన ఉద్యోగాలు కల్పించాలి.

— అప్పుల ఊబిలో ఉన్న పేద, మధ్య తరగతి రైతాంగం చేసిన బ్యాంక్ అప్పులను రద్దుచేయాలి. వెంటనే వడ్డీలేని కొత్త రుణాలను మంజూరు చేయాలి.

— రైతాంగం పండించిన పంటలకు గిట్టుబాటు ధరలు ఇప్పించాలి. మధ్య దళారీ వ్యాపారుల అక్రమాలను అరికట్టాలి. విపరీతంగా పెంచిన ఎరువుల, పురుగు మందుల ధరలను తగ్గించాలి.

— సాగర్ జలాలను అందించటంలో విఫలమైన ప్రభుత్వం భూమి శిస్తును 1983 నుండి కట్టాలని చేస్తున్న నిర్బంధ చర్యలను తక్షణమే ఆపివేయాలి. భూమి శిస్తును, నీటి తీరువాలను రద్దు చేస్తూ వెంటనే ప్రకటించాలి.

— కరువు ప్రాంతంలో చేపట్టాల్సిన సహాయక చర్యలను యుద్ధ ప్రాతిపదికపై ప్రారంభించాలి.

ఇట్లు
ఆం.ప్ర. రైతు కూలీ సంఘం
నందిగామ ఏరియా

నందిగామ
15-2-93

---

## ఏటా 20 లక్షల హెక్టార్లు బంజరుగా మారుతున్న వైనం
## ఇది ఇలాగే సాగితే అంతా ఎడారే !

ఏటా అడవులు నరకడం, పశువుల మేత కారణంగా 20 లక్షల 50 వేల హెక్టార్ల భూమి బంజరుగా మారుతోంది. ఇలా బంజరు భూముల వైశాల్యం పెరిగిపోయా వుంటే, నీరు, ఆహారధాన్యాలు, అటవీ సంపద, పశుగ్రాసాల కొరత పెరిగి, వాతావరణంలో హెచ్చుతగ్గులు ఎక్కువై, దేశంలోని అధికభాగం ఎడారిగా మారే ప్రమాదం ఏర్పడుతోంది. భారత దేశంలో బంజరు భూములు 175 మిలియన్ల హెక్టార్లు వున్నట్టు అధికారుల అంచనా.

ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం రెండుకోట్ల 76 లక్షల 82 వేల హెక్టార్ల భూమిలో 32 లక్షల 37 వేల హెక్టార్ల బంజరు భూములున్నట్లు 80-82లో సెటిలైట్ ద్వారా కనుగొన్నారు.

# కరువు పాట

— నిరంజన్

ఓచ్చె ఓచ్చె కరువొచ్చెరో రైతన్న
కడుపు లెండె రోజులొచ్చెరో కూలన్న —॥ఓ॥

మనిషికి వెన్నెముక తోడని
రైతుకు గేదెలు తోడురా
తినేందుకు గడ్డి లేక
తాగేందుకు నీళ్ళు లేక
అడ్డికి పావుసేరోలే — గేదెల
అంగట్లో అమ్ముతుండ్రు -॥ఓ॥

తాగె నీళ్ళు లేక జనం
ఆమడ దూరం బోతే
శెంబెడన్ని దొరుకపాయే
దూపమేమొ తీరదాయే
అలిపి రొచ్చేటట్టు గొట్టినా
చుక్క నీల్లు రాకపాయే
వాడలల్లో వున్న బోర్లు
చిలుము బట్టి ఇరిగి పాయె —॥ఓ॥

కరెంటింట్ల పీనుగెల్ల
సావుగాను రాకపాయె
వచ్చిన కరెంట్ కూడ
ఒక్క గడియ ఉండదాయె
బావిలున్న నీల్లన్ని
కాలువకే సరిపాయే
అంత ఇంతో పొలం బెడితే
అంత ఎండి నెర్రే బాపే -॥ఓ॥

శ్రీశైలం పోచంపాడు
జీవ నదులు ఎన్నో వున్న
ప్రాజెక్టులు కట్టమంటె
ఎడారిగా మారుస్తుండ్రు
మతం మత్తులో ముంచి - ప్రజల
పోరు ప్రక్కకు నెట్టుతుండ్రు -॥ఓ॥

# నన్నెవరనీ అడక్కండీ!

—చైతన్యప్రకాశ్

మనిషి నవ్వటమే మహాపరాధమైనట్టు!
ఈ సంధ్య చెరువు ఒడ్డుపై కూర్చున్నా -
తెలుగు సినిమా పచ్చదనమేది?
కట్టకింద భూమి పగుళ్ళు
దోమపోటు వరికాడ
వడగండ్లకు తల విరిగిన వరిగోల
చెమట పట్టి దగ్గుతున్న రైతు ముఖం
డంకెల్‌గాడి బ్యాటయ్యింది!
చెరువెండిన అడుసులో
ప్రాణ భయంతో గిల గిల కొట్టుకుంటున్న చేపల చప్పుడు!
తాడిచెట్టు మధ్య వరకూ
ఎగబాకిన గీతకార్మికుడు
పైకి చూసాడా —
ఎండిన మొగి— ఊడిన దేహం!
పుచ్చిన వ్రేళ్ళతో అమాంతం పెళపెళమని
పడ్తున్న అపశృతి -
బతుకు బట్టను శుభ్రం చేద్దామన్న
చాకలి చేతికి ఎక్కడా తేమ తగలదు!
మునుపు
తెగిన బొక్కెన కోసం
నూతిలో పడి చచ్చిన మనిషి శవం కోసం
పాతాళ గరిగే వేసే వాళ్ళం -
ఇపుడు మంచి కోసం -
మంచి నీటి కోసం పాతాళ గరిగె వేయాల్సినంత
ప్రగతి సాధించాం!
కొత్త సంసారం
సరదా సరద సరిగమలు కాక -
వగలు పోవటం కూడా వలస పోవటంతో పూర్ప్బబడ్తుంది!
ఊరిలో 'లో' అనే తెనుగు గంపలు

మురిగిన పండై జీవితాన్ని "దేవో" అంటుంటాయి!
బతుకే అన్నార్తమై, అగమ్య సంచారమై
ఆకలి డెక్కలై నర్తించే గంగిరెద్దు —
ఇప్పుడు రేడియో సంక్రాంతితో సరిపోల్చుకోలేం!
జంధ్యాలు మోసిన నాగరి కథంతా
ఈ సంధ్యతోపాటే కాలి పోయింది!
పోనీ ... పీడా వదిలింది!
కానీ....ఈ కడు పెందుకదోలా కాలుతుంది!
తైదంబల్లేదు కొర్రంబల్లేదు
గంజీలేదు గటా లేదు
పొయ్యిలో పిల్లి లేచిందా
ఏమో........?!
గ్రామ కుక్కలన్నీ పిచ్చికుక్కలుగా మారిన నేపథ్యం!
పొలిమేరంతా దిరిగి
సమాధి శవాల్ని తవ్వుకుంటున్న దృశ్యం!
పొట్ట చేత పట్టుకున్న రైతు
మెట్టు మెట్టు ఎక్కాదిగా కాంక్రీటు తట్టల క్రింద
ఒళ్ళు విరుచు కుంటుంటాడు!
పల్లె శివారు
ఎండ ధగడు చారికలై మెరుస్తోంది!
అంబా అనే ఆవు చప్పుడేదీ?
పిచపిచ పిట్టప్పుడేది?
జా! జా! ముల గర్ర ఉత్సాహ మేది?
ఎడ్లూ గొడ్లూ సమస్తం
బొంబాయి మిల్స్ రెక్కిలో
స్పూన్‌కు తగుల్తాయి!
వ్యవసాయం సమస్తం
కసాయి కత్తి కింద
కబేళా ఖండిత మాంసపు ముద్దలయ్యింది!
అడవిలో పుట్టాలేదు, చెట్టూ లేదు
చెట్టుకు పిట్టగూడూ లేదు
ఊరూ అడవి ఒకేలా ఒగరుస్తున్న సన్నివేశం!
అయితే....అయ్యిందిలే!

మరి....ఖాకీ కసరత్ కింద నలిగిన లేకీ శల్యం !
మిగిలిన పల్లె అసాంతం కూలిన ఇళ్ళు
నిస్సహాయంగా తూల్తున్న గుండెలు —
నన్నెవరనీ అడక్కండి !
మనిషి నవ్వటమే ఎన్ని మథింపుల మథనమయ్యిందో
నన్నేం చేస్తావని అడిగే కన్నా
నన్నేం చేయమంటావో
ఇప్పుడు నువ్వే చెప్పాలి !

భీవాండీ సిరిసిల్లా ఆకలి దేహాలకు
మగ్గం దారమై ప్రవహిస్తున్న కరువు -
ఎంత అతికిస్తున్నా
పుటుక్కు పుటుక్కున
తెగిపోతున్న మానవ బంధం !
నాకు ప్రతి రాత్రి తల్లి పోయిన రాత్రే !
నేను ప్రతి పగలూ నాన్న శ్మశాన వాటికలోనే
ఎవరితో ఎలా పెళ్ళి చేసుకునేది ?
కాల్చబడిన కళ్ళు లేని ఈ వేళ
ఎలా సంభోగించేది ?
పట్టణం ప్రక్క గుడిసెల్లో
గనేరియా క్రిములు నా గమనాన్ని నిర్దేశిస్తున్నాయి !
నా అమర గెరిల్లా ప్రేయసి
పోతూ పోతూ చంపపై ముద్దెట్టుకుని
నా కను కొనల్లకు ఒక కిట్టు తగి లేసి పోయింది !
అయ్యో....ఈ రాత్రి పాలనలో
చీకటి రక్కసి పాదం కింద ఒక అన్న హతుడు !
మనిషి రక్తాన్ని ఘ్రాణిస్తున్న రాజ్యం !
నాదే కులమని అడక్కండి !
నన్నెవరి బిడ్డడవని అడక్కండి !
నా దేవూరని అడక్కండి !
నాకే కులమూ లేదు-నాదే కులమూకాదు-

తుపాకి గొట్టంచే కన్నాలు బడ్డ
మృత పోస్ట్ మార్టమ్ కాగితమే
నా క్యాస్ట్ సర్టి ఫికెట్
నా తల్లి కల్లోలం -
నా తండ్రి సాయుధ వ్యూహ ప్రతిఘటనాత్మక నక్షల్బరీ
నా గుండె సిరికాకుళ కొండ -
నా ఊరు పోరాటం - నా పేరు కవి
క్షమించండి నన్నెవరనీ అడక్కండీ !
మనిషినయినందుకు మనసుంటబట్టి మాట్లాడు తున్నాను.



(59 వ పేజీ తరువాయి)

రంకు బొంకుల రాజకీయం
రంగు రంగుల నాయకులు
ఓట్లు దొబ్బి సీట్ల నెక్కి
నీళ్లంటే సారనిచ్చే
సారొద్దని సంఘం పెడితే
చాటుగొచ్చి చంపుతుండ్రు
అడువులన్ని నరుకుతుండ్రు
కరువులాను పెంచుతుండ్రు
కరువును సృష్టించే దొరల
కాటికీ పంపాలే మనం
మంచినీళ్ళు దొరికే మార్గ—
మెంచుకుని వురుకుదాం

(49 వ పేజీ తరువాయి)

ఇంకా తోటలుకాడ ఎందుకులే రండి
మాకు పెండ్లిండ్లేమీ వొద్దులే రండి
వుండూరిడిసి పెట్టి పరదేశులమై
పొట్టబట్టుకుని పోదాము!
మీరొక ముద్ద మేమొక ముద్ద తిని
పూపిరైనా నిలుపుకుందాం!!
('ఆదివారం ఆంధ్రజ్యోతి' 13-12-92 తేదీ సౌజన్యంతో)

# కథా సాహిత్యంలో కరువు కాటకాల రాయలసీమ

## — మధురాంతకం రాజారాం

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించడం, రాయలసీమలో ఆధునిక కథానిక అవతరించడం అనే సంఘటనలు రెండూ దాదాపుగా ఒకే సమయంలో సంభవించడం కేవలం యాదృచ్ఛికం. అయితే సరిగ్గా అదే సమయానికి రాయలసీమలో దుర్భర క్షామ పరిస్థితులు వచ్చి విడిది చేయడం మాత్రం కాకతాళీయం గాదు. 'కామమ్మ పుట్టగానే కరువొచ్చినాది' అని జానపద గీతం. రాయలసీమకు కరువుతో గల అనుబంధం అంతకు తక్కువైనదేమీ గాదు. తరతరాలుగా రాయలసీమ వాసికి ఆత్మబంధువు కరువు, పిలవక పోయినా సరే, సగటు లెక్కన పదేళ్ళకు రెండు గార్లయినా వచ్చి పరామర్శించి పోయే పాత చుట్టం.

వయో వృద్ధుల ద్వారా గుండె లవిసిపోయే 'ధాతు కరువు' గాథల్ని విన్న పెద్దల్లో కొందరింకా జీవించే వున్నారు. 'కూడు గుండెకాయ, మెతుకు మేనమామ' అన్న సామెత అప్పట్లో పుట్టినదే అయివుండాలి. తెల్లవారు జామున నిద్రలేచి, కొండలు దాటి అడవుల్లోకి వెళ్ళి చిక్కం నిండుకూ దేవదారాకు కోసి తెచ్చుకునే వాళ్ళట. ఆకు వాడిపోయినా పరవాలేదు. నీళ్ళల్లో నేసి, ఉడకబెట్టి, ఉప్పురాళ్ళు వేసి, కొంచెం మిరప్పొడి చల్లి తినగలిగినంత తిని, మిగిలిన కడుపుకు నీళ్ళు పట్టించే వారట. ఎంత నాలీసు తిండిలోనైనా వైవిధ్యం వుండాలి గదా! అందుకని మధ్య మధ్యలో ఒకొక్కపూట కలమంద గడ్డలతోను, గొట్టి గడ్డలతోను సర్దుకునే వాళ్ళట!

**1947-48** ప్రాంతాల్లో వచ్చిన 'గంజి కరువు' గూడా అలాంటిదే. కొత్తగా దొరతనానికి వచ్చిన ప్రజా ప్రభుత్వ సరదార్లు కరువు సహాయక చర్యల క్రింద గ్రామ కేంద్రాల్లో గంజి కేంద్రాలు ఏర్పాటు చేయడాన్ని బట్టి, దానికి 'గంజి కరువు' అన్న పేరొచ్చింది.

మెట్ట పొలాలు, బక్కచిక్కిన ఆవులు, మట్టి మిద్దెలు, మోట బావులు, పొంచి వున్న కరువులతో పోరాటాలు- ఇదే రాయలసీమ రైతుల భాగ్యాలు. చెరువు లెండిపోతాయి. మిరపమడి మాడిపోతుంది. జొన్నకంకి కంటికి కనిపించదు. చీనీ తోటలో నుంచి ఎండుటాకుల గలగల మాత్రం వినిపిస్తుంది. అడుగుజూపి, కడుపు తరిగిన మోట బావిలో నుంచి ధ్వనులకు ప్రతిధ్వనులు మాత్రం వినవస్తాయి. ఈడ్చే కొద్దీ ఎండల్లో, నీడల్లేని రోడ్లపైన చచ్చిన పిట్టలే కానవస్తాయి....

అలాంటి కరువుల్లో ఒకటి గంజి కరువు!

అడివి నుంచి చింత గింజలూ, ఈతగింజలూ తెచ్చుకుని ఆ పిండితో అంబలి తాగిన ముసలీ ముతకా, పిల్లా జెల్లా కలరా జబ్బు సోకి కళ్ళు తేలవేసేస్తారు.

ప్రభుత్వం యిచ్చిన జొన్నలూ, నూకలూ కాజేసి, గ్రామ పెత్తందారులు యింతే వుప్పు, యిన్ని వుల్లిపాయలూ వేసి చుట్టు ప్రక్కల అయిదారు మైళ్ళ దూరం నుంచి నడిచి వచ్చిన అన్నార్తులకు వేడినీళ్ళు వడ్డిస్తారు. అశక్తులు కొందరైతే నడి దారిలోనే వడదెబ్బకు నీలిగి చస్తారు. పొట్టచేత బట్టుకొని రోడ్డు పనిలో కూలీలుగా చేరిన సన్న కారు రైతులకు, బక్క ప్రాణులకు సగం డబ్బు మాత్రం ముట్ట జెప్పి కంట్రాక్టర్లు కమీషన్ కొట్టేస్తారు. 'షైలా'కు లాంటి వడ్డీ వర్తకులు హెచ్చు వడ్డీకి అప్పులు బెట్టి, మట్టి కలిసిన జొన్నలమ్ముకుంటారు.

అయితే ఒకటి. అది అంధకారంలో ఆశాదీపాలు వెలిగిన కాలం. 'జన్మ భూమి కరువు గడ్డ గావచ్చు. ఎడారి యిసుక తిప్ప కావచ్చు. వట్టి చవిటి పర్ర



గావచ్చు. కానీ అది మనల్ని కన్నతల్లి. మన తల్లిని మనం ప్రేమించకపోతే ఎవరు ప్రేమిస్తారు? ఇప్పుడది హంపీ శిథిలాలలాగే, పెన్నేటి ఇసుక దిబ్బలాగే, బతికి చెడిన వాడి బతుకులాగే బోసిపోయి వుండొచ్చు. కానీ ప్రతి యేటిపైన ఆనకట్టలు వెలుస్తాయి. చెరువు లన్నింటికీ మరమ్మత్తులు జరుగుతాయి. పడిన వాననీరు ఎడి నట్లుగా జలాశయాల్లోకి చేరడానికి కట్టు కాలవలు రూపొందుతాయి. బావుల్లో నీరింకి పోయి మడిలు అర్థాంతరంగా ఎండిపోయే పరిస్థితులింక వుండవు. వచ్చిన స్వాతంత్ర్యం రామరాజ్యంగా మారుతుంది. 'స్వర్గం భూమిపైకి దిగి వస్తుంది.' అన్న ఆశాభావం అప్పట్లో రాయలసీమ వృద్ధి పుత్రుల గుండెల్లో ఆనందతాండవం చేసింది

కానీ ఏం జరిగింది? ఏడుస్తున్న బిడ్డకు చెట్టులోని వెలగకాయను చూపించి నట్టు ప్రభుత్వానిది చాలా వరకు కంటి తుడుపు చర్యలైపోయాయి.

రాయలసీమ రైతులు అల్ప సంతోషులు. ఏడాదికి పది పదిహేను పదున్ల వాన కురిసి, ఏర్లుసాగి, చెరువులు నిండిపోతే వాళ్ళ ప్రభుత్వం నుంచి ఎట్టి సాయము

అర్థించరు. అసలు దాని ఎనికినే పట్టించుకోరు. కానీ తరతరాలుగా వాళ్ళను దగా చేస్తున్నవి వాన మబ్బులే.

ఆకాశవాణి వాతావరణ సూచనలు ఆశావీచికల్లానే ఆహ్లాద పరుస్తాయి. ఈ సంవత్సరం వానకు ఢోకా వుండదని పంచాంగం అయ్యవారు చెప్పేమాట గుండెల్లో ఆనందాన్ని ప్రోది చేస్తుంది. మెట్ట పొలాల బక్క రైతు అప్పో సప్పో చేసి విత్తనాల గింజలు సమకూర్చుకుంటాడు. తొలి ముంగారు వానలు సకాలంలో కురిస్తే మహోత్సాహంతో దుక్కి దున్నుకుంటారు. పునర్వసు కరుణిస్తే విత్తనం వేస్తారు.

'అదిగో పడె, ఇదిగో పడె, మొన్న నెల్లూరులో పది దుక్కుల వానంట! నిన్న విజయవాడలో నరమానవుడు ఇల్లు విడిచి బయటకు రాకుండా ఒకటే జడి వానంట!' అనుకోడమే గానీ రాయలసీమ నేలపైన మాత్రం చినుకు జారదు.

"పునర్వసు పోయ. పుష్యమి వచ్చె. వానలారా!

దినాలు జరగబట్టె, కప్పలకు పెండ్లిండ్లు చేసిరి. వానలారా!

ఎండి నీటలు వారిన చెరువులో విరాట పర్వం చదివించిరి. వానలారా!

ఇంటికి ఒకరు గుంపుగా జేరి రాత్రిపేళ లాంతర్లు పట్టుకుని ఊళ్ళో సందు గొందులన్నీ తిరగతా భజన్లు చేసిరి. వానలారా!

ఊరి బొడ్డు రాయి మీద నూటా ఒకటి కడవల నీళ్ళు పోయించి, పెళ్ళికాని పిల్లలతో కాయగొట్టి పూజ చేసిరి. వానలారా!

ఉన్నట్లుండి ఒకరోజు వాతావరణం మారిపోయ, గాలి నిలిచిపోయ. 'అబ్బ భలే ఉక్కపోస్తా వుందిరా' అనుకుంట్రి జనం.

బయటికొచ్చి చూస్తే మేఘాలు బలంగా క్రమ్ముకుంటూ వుండె.

మెరుపులు మెరిశ. ఉరుములు వురిమ.

అంతా వానను గురించే మాట్లాడుకోబట్టిరి.

'తూర్పు గడ్డమీద అప్పుడే రెండు పదున్ల వాన కురిసిందంట! భూమి అంతా పచ్చగైందంట!'

'ఔనంట! ఆ పక్క అంతా ఆరుద్ర కార్తిలోనే యిత్తనం ఏసినారంట!'

'పునర్వసు రాకుండానే! అంత ముందుగా ఎందుకు ఏసినారబ్బా?'

'ఏమో! మళ్ళా మళ్ళా వానొస్తుందన్న గ్యారంటీ ఏముంది? ముందో వెనుకో యిత్తనం పడితే చాల్లా భగుమంతుడా- అనుకుంటారు.'

'మొన్నటికి మొన్న, వారం దినాల కిందట, గానుగపెంటకాడ మంచి వానంట!'

'అవునంట! ఆ వాన మనకు తగలాల్సింది. మధ్యలో గాలొచ్చి గానుగ పెంటకు వొట్టుకుపోయ....'

'అభానొరే, ఎవరికెంత ప్రాప్తమో అంత, కురిసే వరకు వాన మనదిగాదు. అనే వరకు బువ్వ మనదిగాదు?'

'సామీ, దేవుడా! ఆ వానను మా దిక్కు గూడా కొంచెం పంపించు తండ్రీ!' అని జనం మొక్కుకుండ్రి.

కానీ దేవుడు వాళ్ళ మొర వినలా

క్షణంలో గాలి పుంజుకునె!

మబ్బులన్నీ ఏ మూలకో కొట్టుకపోయ!

పైకి చూస్తే ఒక మబ్బు లే.

ఒక్క వాన చినుకు పడలా.

దినాలు గడిచ.

పుష్యమిపోయ. అశ్లేషవచ్చె.

'కార్తి తప్పిపోయ. ఇంక వాన వచ్చినా లాభంలేదు' అనుకుండ్రి.

అశ్లేషలో వారం దినాలు గడిచేటప్పటికి, ఎట్లాగైతేనేం జలజలా చినుకులు రాలె. 'నిండు పదును' అనుకుండ్రి.

పండుతుందో, ఎండుతుందో నన్న సందేహంతోనే విత్తనం వేసిరి.

మఖలో గూడా వానొచ్చె.

వానొచ్చిన పది రోజులకు కలుపు తీసిరి.

పుబ్బ వచ్చె. పూరేడు తడిసినట్టుగా వానపడె. సెట్లు పూతబట్టె.

వేర్లు దిగాలంటే ఉత్తరలో వాన రావాలగదా! ఉత్తరలో వానరాలా,

హస్తలోమారాలా.

చిత్తకార్తి పోతుందనగా మూడు దినాలు ముమ్మారంగా వానలు కురిస. ఎండిన చేలు కలకలలాడిపోయ.

'సగం పంట అయినా చేతికి రావచ్చు' అనుకుండ్రి జనం.

స్వాతిపోయ. వానరాలా.

విశాఖ వచ్చె. వాన రాలా.

చలి మొదలాయ.

ఇంకెక్కడివాన? - అనుకుండ్రి జనం!!

అందువల్ల వానల్ని నమ్ముకుని సేద్యం చేయడం పెక్కు సందర్భాల్లో అడియాసకే దారితీస్తుందని రాయలసీమ రైతులకు తెలసిపోయింది.

వానలు సమృద్ధిగా పడితేగానీ చెరువులు నిండవు. చెరువులు పైన గూడా ఆధారపడకుండా భూమి సాగుచేయాలంటే బావులు త్రవ్వుకోవలసిందే!

సన్నకారు రైతుకు బావి త్రవ్వుకోడమంటే సామాన్యమైన పనిగాదు. మహాయజ్ఞం!

పోతురాజు గుట్టలో చేటప్పకు ఇరవై మూప్పై గుంటల (దాదాపు రెండె కరాల) పొలం వుంది.

బావికి పూర్వరంగంగా చేద త్రవ్వించారు. అయిదో మట్టులోనే గంగ పెల్లు బికి వచ్చింది (మట్టు=అరడుగులు)

"చేటప్ప కేమప్పా! అదృష్టవంతుడు. అతడు కోరిన కోనలో వాన కురిసింది" అనుకున్నారు జనం. గంగ పూజ జరిగింది నిరుడు చేతికందిన శెనక్కాయల వరు మానంతో పని మొదలు పెట్టాడు. వడ్డె వల్లెబోయ వాళ్ళు పనిలో దిగారు. గుంటకు గుంట అరు రూపాయలు. ఒక కురవ్వొట్టేలు, నాలుగు జతల పంచలు యినాము. అంతే.

లోను కోసం అర్జీ పెట్టాడు. అది రావడం ఆలస్యం కావడంతో భార్య మెడలో వేసుకునే నగను తాకట్టు పెట్టి పని కొనసాగించాడు. బావి మూడో మట్టు దాకా తెగింది.

నాలుగో మట్టులో రాయి తేలింది. మొరుం రాయిలే అనుకుంటే చట్ట బండగా తేలిపోయింది. బండ నెర్లానైనా చీల్చి లేపేస్తే నీళ్ళు పడ్తాయని నమ్మకం, సుత్తులు, నమ్మెట్లు, తూటాలు, నల్లమందులూ కావలిసొచ్చాయి. అందుకు తగిన పనివాళ్ళున్నూ రంగంలో దిగారు. అయిదో మట్టు పూర్తి కావచ్చేటప్పటికి చేటప్ప నాలుగు ఆవులు, ఇరవై రెండు మేకలు, భార్య చెవుల్లో కర్నపూలు, గూబ్బావుర్లు, బొందు పోగులూ, నోముముళ్ళ అమ్ముకోవలసి వచ్చింది.

'ఆశాపాశము లాగదున్ నిడువు' అంటాడు గదా కవి! బావిలో గంగపడి, నాగేలు సాగి, ఒక సంవత్సరం చెరకు దోట వేస్తే అప్పులెన్నయినా పటాపంచలై పోవా? ఆ ధైర్యంతోనే పొలం కొంత అమ్మేసి, ఆ డబ్బుతో పని కొనసాగిస్తాడు చేటప్ప. పొలం చేజారిపోయిన దిగులుతో భార్య జబ్బుపడి, మంచంపాలై మరణి స్తుంది.

బావిలో పడిన చక్రూతితో చేటప్ప భీషణ సమరం సాగిస్తాడు. తొమ్మిదో మట్టు దాకా తెగేటప్పటికి అతడి శక్తి యుక్తులన్నీ వ్యయమైపోతాయి. రాత్రిపూట నాలుగో జాములో బావిలో పడుకుని చెవి ఒగ్గి వింటే నీరు ఏ ప్రక్క నుంచి ఉరవడి చేసేదీ తెలిసిపోతుందని ఎవరో చెప్పారు. పగలంతా బండతో ప్రపంచ యుద్ధం. రాత్రుల్లో గంగాన్వేషణలో జాగరణం!

ఓ రోజు రాత్రి బావిలో దిగాడు. ఈశాన్య మూల నుంచి ఏదో ధ్వని విని పించి వట్టయింది. పాతాళగంగ పారుతున్న పాపసప్త స్వరాల సమ్మేళనంలా వుంది. చేటప్ప గడ్డపార పైకెత్తి రాతి నెరియలో దించాడు. చిమ్మిన గ్రోవిలో నుంచి చిమ్మి నట్టుగా నీరు పైకెగజిమ్ముకుంటూ వచ్చేసింది. చేటప్ప అట్లాగే త్రవ్వుతున్నాడు.

దరి కదిలింది. రాయి చీలింది కిందికి వాలింది. బేటప్ప బండ కింద పడిపోయాడు. పాతాళగంగ మాత్రం పైకి ఉబికి వస్తూనే వుంది....

బేటప్పది జయమా? అపజయమా?

ప్రకృతి చేతిలో అతడు ఓడిపోయాడా? గెలిచాడా?

ఏమైనా ఎడతెగని జీవన పోరాటంలో అతనొక పాత్ర. తన పాత్రను తాను నిర్వహించాడు.

ఈ పోరాటాన్ని రాయలసీమ రైతులింకా నేటికీ ఒక రూపంలో కొనసాగిస్తూనే వున్నారు.

'బావిలో బండపడె. బొక్కెష్టు రేలబడె, ఏలె స్తివి నరసప్పా చెరుకు దోట' అనేది జలాధారం కోసం బావులు త్రవ్వుకుంటున్న రోజుల్లో పుట్టిన పాట.



ఇప్పుడు కపిలె బావులకు, ఎద్దులతో మోట తోలడానికి కాలం చెల్లిపోయింది. పాతాళ గంగ ఎంత లోతులో వుందో తెలుసుకోడానికి బోరింగు బావులు పోటీపడ్డం ప్రారంభమైన తర్వాత భూగర్భ జల వనరులు ఇంకా ఇంకా క్రిందికి వెళ్ళిపోయాయి. వానలు కొంచెం ఎగదీసేటప్పటికి చేద బావులు సైతం మొక్కిన వరమీని దేవుళ్లై పోయాయి. రెండు బిందెల నీళ్ళ కోసం రెండు మైళ్ళు కూడా నడిచివెళ్ళి రావలసిన అవశ్యకత ఏర్పడింది. ట్రాక్టర్ల పైన డ్రమ్ములు, సైకిళ్ళ పైన బిందెలు వేసుకుని జనం నీళ్ళకోసం వెళ్ళి వచ్చే దృశ్యాలు చాలా సహజమై పోయాయి. పంచాయితీ బోర్డు వాళ్ళెక్కడో ఓ బోరింగు బావి త్రవ్వించి, పైపులువేసి, సిఫ్టుల్లో కుళాయిలు పెట్టిస్తే ఆ కొళాయిల దగ్గర బిందెడు నీళ్ళ కోసం దెబ్బలాటా, రగడలా, కక్షలా కార్పణ్యాలు

పెర్రేగి పోయాయి. 'కొళాయిలో నీళ్లొస్తున్నాయన్న కేక వినిపిస్తే సూపర్ బంపర్ లాటరీ తగిలినంత ఆనందం! స్నానానికి పదిహేను బిందెల నీళ్ళు దొరికితే బ్రహ్మానందం! భగవంతుడా, కరెంటు పోకుండా వుండాలి. మోటారు ట్రబులివ్వకుండా వుండాలి. పైపులు పగిలిపోకుండా వుండాలి. ఇంటిలో ఏం జరిగినా నీళ్ళరావు పీళ్ళే నాగరికత అంటారు. ఎవరు ఎన్ని నీళ్ళు వాడతారో తెలిస్తే వాళ్ళ నాగరికత ఏ పాటిదో చెప్పేయొచ్చు' అంటారు. తాగేదానికి ఒక కడవ నీళ్ళు నోచుకోలేనివారికి ఏం నాగరికత వుంటుంది?'

కరువు లీలలింతేనా? ఇంకా వున్నాయి.

"మెండ, ఆకు అల్లాడలేదు. పెద్దోళ్ళ వాగ్దానంలా వుంది ఆకాశం. ఒక మబ్బు తునకలేదు. మొండి జాతి కంప మొక్కలు పెరిగిన గట్లతో, బీడైన రేగటి చేలు, ఎవరో గుండెను ముక్కలు చేసి కర్రలకు గుచ్చి మంటల్లో మాడ్చి మసి బొగ్గులు చేసినట్లుండే రేగటి చాళ్ళు. ఇంకాస్త ముందు పూరి సుందర కల్లాలు, రెండు మూడు కళ్లాల్లో యేరెండు చారల జొన్న వాములో, పొట్టు వాములో తప్పితే అన్నీ దాదాపు మొండి గోడల కళ్లాలే వీధుల్లో పరపతుల్లేవు. పశువులకు కళ్ళాల్లో మేతలేదు. యే కొండగడ్డి లేదు. పెద్దోళ్ళు దాత కరువన ఏదో చెప్తారు. కానీ ఇంత కరువు, పశువులకు గాట్లో యింత మేతలేని చెడ్డ కరువు తనింత వరకు చూళ్ళేదు..."

గవర్మెంటు వాళ్ళు దూర ప్రాంతం నుంచి వరి కసువు తెప్పించి, సబ్సిడీ ధరతో రైతుల కివ్వబోతున్నారన్న వార్త పుల్లారెడ్డి మనసులో ఆనందం చిలకరించింది. అయితే వచ్చిన గడ్డిలో ఎక్కువ భాగం పశువుల డాక్టరు ఊరి భూమందులకు ముట్టజెప్పి, మిగిలిన గడ్డిని భారీ రేటుకు అమ్మి జేబు నింపుకుంటాడు. గడ్డి కోసం వెళ్ళిన పుల్లారెడ్డి తల్లికి 'ఇంకో లారీ వస్తే ఇస్తాలే' అంటూ చావు కబురు చల్లగా చెప్పాడు కడుపు మండిన ముసల్ది ఎలా వూరుకుంటుంది? ఆమెలో ఆక్రోశం కట్టలు త్రెంచుకుంటుంది

'నా బిట్టా! నువ్వ రైతు కొంపల్లోనే పుట్టినావా? కాపోడివేనా? యింత కలి కాలమా? మేం మనుసులం కాదా? పెసిడెంటు, గూనిశెట్టి, పెద్దింట్లోళ్లేనా మనుసులు? మాదీ లెక్కకాదా? నువ్వు నోటికి తినేది రాగా, గడ్డా? యిత్తా మిత్తామని రాసుకుని యిట్టా చేస్తావా? గడ్డికొన్నే యింత అవక్రమమా? యెద్దుల నోరు కొట్టినావు. మానోరు కొట్టినావు. నీకేం కొయ్యేకాలం. దూమ తగల!'

అలాంటి పరిస్థితిలో 'గొడ్లను అమ్మే ఇష్టంగా వుంటే కొంటాం. ఎవరన్నా ఇచ్చేవాళ్ళుంటే చెప్పండమ్మో' అంటూ కొందరు వ్యాపారస్తులు వచ్చి వూళ్లో దిగేవారు. అమ్మకానికి సిద్ధపడిన ముసలాయన, అంతలో ఏదో సందేహం రావ

డంతో 'ఏం నాయనా! మేపుకోడానికేనా?' అని ప్రశ్నించాడు. ఆ వర్తకులెవరో గానీ మంచివాళ్ళే. మాటల్లో మభ్యపెట్టేవాళ్ళు కారు.

"మీకు తెలీకుండా మాకు మాత్రం మేపుఎక్కడుండాది? కసాయి కోసం బెంగుళూరు దోలకపోతాం పెద్దయ్యా!" అన్నారు.

ముసలాయన గుండెల్లో రాయిపడింది. ముఖంలో దిగులు కెరటాలు కెరటాలుగా పొరాడింది.

"ఏం పెద్దాయనా! కసాయికైతే గొడ్లు నమ్మవా?"

"అమ్మకేం జేస్తాం నాయనా! వాటికి మేతలేదు. నీళ్ళన్నా కడుపునిండా తాపుదా మంటే లేకపోయ. భూమ్మీద చుక్క వాన లేక పిటితో పనిలేకపోయ. చూసి చూసే కసాయికి తోలాలంటే మనసొప్పదు. బతికినన్ని రోజులూ కష్టపడి మమ్మల్ని సాకినాయి. తిరిగి యిప్పుడు చస్తాగూడా అవ్వే నాలుగు మెతుకులు పెడుతున్నాయి. ఈ పాడు మనుసులకన్నా పశువులే మేలైనట్టుంది."

అంతేనా కసాయి కరువు దాల్చిన వికృత రూపం?

నమ్ముకున్న నేలపల్లె విశ్వాసరాహిత్య తీర్మానం ప్రకటించి రైతు బిడ్డలు కొందరు రోడ్డు కూలీలై పోయారు. మరి కొందరు పారిశ్రామిక ప్రాంతాలకు వెళ్ళి పోయి ఫ్యాక్టరీల్లో పనివాళ్ళుగా కుదురుకున్నారు. ఇంకా కొందరు పట్నాల్లో రిక్షావాలాలుగా, బరువులెత్తే వాళ్ళుగా స్థిరపడిపోయారు.

'పల్లెల్లో వున్నది తల్లి భారతి' అనే మాటకు చెల్లుబడి లేకపోయింది. అవి ఖిలమై పోయాయి.

మళ్ళీ వానలొస్తే స్వగ్రామాలకు తిరిగి రావచ్చునన్న ఆశతో పచ్చని చెట్లను వెదుక్కుంటూ దూర ప్రాంతాలకు వలస వెళ్ళేవారి సంఖ్య గూడా తక్కువ గాదు. అలా వెళ్ళిన ఒక జట్టులోని కుర్రవాడు వెంకటేను బసిరెడ్డిగారి యింటి ముంగిట నిల్చుని, అరుగుపైన కరెంటు దీపం వెలుగులో బిగ్గరగా చదువుకుంటున్న చిట్టిబాబు పైపే చూస్తున్నాడు. వాడికి తన ఊరిలోని బడి, సావాసకాళ్ళయిన తోడి పిల్లలు, తాను చదువుకునే కిరసనాయిలు బుడ్డి దీపం, నోటు పుస్తకాల్లో తాను దాచుకున్న నెమలి పింఛాలు మొదలైనవన్నీ జ్ఞప్తికి వస్తాయి. అప్రయత్నంగా వాడి నోటి నుంచి మాటలు వెలువడ్తాయి—

"నాకూ ఆ పాఠం వచ్చు."

చిట్టిబాబు తలతిప్పి వెంకటేను చూస్తాడు. చిరుగుల షరాయి చొక్కాలవాడు, రేగిన దుబ్బు వెంట్రుకల వాడు, చిక్కి శల్యంలా వున్నవాడు. ఉన్న వూరువిడిచి పొట్ట చేతబట్టుకొని, ఎండుటాకులా కొట్టుకొచ్చిన వాడు- వీడికింత పొగరా? వాడి భరతం పట్టమంటూ పాలేరును ఉసికొల్పుతాడు.

అయితే శివంగి పిల్లిలా పాలేరు కందకుండా పరుగెడుతున్నాడు వెంకటేసు.

పరుగెడుతూ తన పాఠంలోని పాఠం వల్లిస్తున్నాడు

'భారతదేశము నా మాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు. నేను నా దేశమును ప్రేమించుచున్నాను....'

అవును, ఎండిన పంట, వాగు, వంక, పశువులు మట్టిలో కలిసిపోయినా నలుగు వాన తుంపరలు పడేసరికి మళ్ళీ పులకించి, పులకరించే గరిక పోచలాంటి వాడు రాయలసీమ రైతు. గుండె నిబ్బరంతో బ్రతుకు వెళ్ళదీస్తూనే, పరిస్థితు లనుకూలించినప్పుడు లేచి నిల్చుని, ఓపిక తెచ్చుకుని, బలం పుంజుకుని భూమిని పచ్చటి తివాచీగా మార్చడానికి ప్రయత్నిస్తూనే వుంటాడు.

[ఈ వ్యాస రచనలో మునిపల్లె రాజు, కె. సభా, స్వామి, సింగమనేని నారాయణ, కేతు విశ్వనాథరెడ్డి, చక్రవేణు, మహేంద్ర మొదలైనవారి కథలు ఉపకరించాయి -రచయిత]

## 'విముక్తి' కథ నేపథ్యం

1984, 85, 86 ఈ మూడు సంవత్సరాలూ పొత్తిగా వర్షాలు లేక మా ప్రాంతం (అనంతపురం జిల్లా) బాగా దుర్భిక్షంలోపడిపోయింది. కళ్ళారా కనిపించే కరువు - ఒక సంవత్సరం కాదు, రెండు సంవత్సరాలు కాదు, వరుసగా మూడు సంవత్సరాలు - బావుల్లో పొత్తిగా నీళ్ళు ఇంకిపోయి పిచ్చి మొక్కలు పెరిగాయి. వంకా, వాగూ, చెరువుల్లో తడి ఇసుక కూడా లేదు. మెట్ట పొలాల్లో పంటలే లేవు. ఇక్కడి ప్రధానమైన పంట వేరుశనక్కాయి. మూడేళ్ళు వరసగా విత్తనం కూడా దొరక్క రైతులంతా దివాలాతీసి అప్పుల్లో కూరుకుపోయారు- బావుల కింద వందలాదీ ఎకరాల సేద్యం బీడయింది. రైతన్న వాడికి పని లేకుండా పోయింది. మధ్యతరగతి రైతుల చేతుల్లో కూడా చిల్లిగవ్వ ఆడటంలేదు. కనీసం బీడీల కట్ట అప్పు పుట్టించుకోటానికి కూడా వేటిరించాల్సిన పరిస్థితి వచ్చింది రైతుకు. చాలా మంది రైతులు బంగారం కుదువ పెట్టి, వడ్డీలకు పెద్ద మొత్తాలు తెచ్చి బావుల్లో బోర్లు వేయించారు చాలా మందికి బోర్లు ఫెయిలయ్యాయి. అప్పట్లో భారతదేశం మొత్తం మీద దోట కుషన్లు చాలా ఎక్కువగా వున్న జిల్లా అనంతపురం జిల్లా. ఈ మాట అతిశయోక్తికి అంటున్నది ఏమాత్రం కాదు. చాలా మంది రైతులు చేసేందుకు పనిలేక, తింటానికి ఇంట్లో తిండి గింజలు లేక, అప్పులూ పుట్టక యమయాతన అనుభవించారు. కొంతమంది రైతులు తెగించి అభిమానాన్ని పక్కకుపెట్టి రోడ్డు కూలీలుగా మారిపోయారు.

ఈ దుర్భరస్థితి చాలా రోజులపాటు నా మనసును వేధిస్తూ వచ్చింది. ఆ వేదన నుండీ రూపుదిద్దుకున్నది ఈ 'విముక్తి' కథ.

ఈ కథ రచనా కాలం 1986 డిసెంబరు. —— సింగమనేని నారాయణ

# అస్థిపంజరాల సోమాలియా

— బి. గంగాధర

అస్థిపంజరమై అస్థిపంజాలు దేవురి
స్తున్నాయి !
అవి
శ్వాసించనూ లేవు
జ్వలించనూ లేవు
నిరీక్షించనూ లేవు
కన్నీళ్ళు గార్చనూ లేవు !
నేటి సోమాలియా అస్థిపంజరమై
ప్రపంచపు ముంగిట పడిగాపులు
గాస్తోంది !
అక్కడ
పీక్కుతినే తెగ బలిసిన
రాబందులు సైతం
అస్థిపంజరాలై ఉంటాయ్!
నేటి సోమాలియా
ఒక్కొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసంలో
వేలాది బొట్లుగా నేలి రాలి కరిగి
పోతోంది
అక్కడ
వసంతమూ లేదు
శిశిరమూ లేదు
కనుచూపు మేర
కరువు రక్కసి కరాళనృత్యం తప్ప!
అది
ప్రపంచపు శ్మశాన వాటిక !
అది
ప్రపంచపు ఎండిన ప్రేగు !
అవును అచట
ఒకొక్కప్పుడు
సామ్రాజ్యవాదానికి కొమ్ము గాసిన
ఫిరంగుల శబ్దాలూ లేవు.
హోరుమనే
సామ్రాజ్య వాదపు
పోరు బరీ లేదు. / అక్కడ
స్వచ్ఛమైన వెన్నెల రాత్రుల్లో సైతం



మెరిసే చుక్కలు
కన్నీటి బొట్లను చుక్కలు చుక్కలుగా
కురిపిస్తాయి ! / అది
మూర్చిల్లిన సోమాలియా
(తరువాయి 76 వ పేజీలో)

# రాయలసీమ కరువుల గాథ - పెన్నేటి పాట

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

"అచట నొక నాడు పండె ముత్యాల చాలు
అట నొకప్పుడు నిండె కావ్యాల జాలు
అచ్చట నొకప్డు కురిసె భాష్పాల జల్లు
విరిసె నటనాడు వేయంచు విచ్చుకత్తి"
(విద్వాన్ విశ్వం - పెన్నేటి పాట)

విజయనగర రాజుల కాలంలో నిర్మించిన చెరువులు కాలక్రమంలో శిథిలమయ్యాయి. తల పరిగలు - నీటి బుగ్గలు వట్టి పోయాయి. పన్నీరు జల్లులు కురిసిన సీమ కన్నీటి కాల్వల సీమగా పరిణమించింది.

సీమ కరువు కాటకాలకు పుట్టిల్లు. 'రాయలసీమలో కరువు పిలిస్తే పలుకుతుంది. అనంతపురం జిల్లాలో పిలవకపోయినా పలుకుతుంది.' అన్న విద్వాన్ విశ్వంగారి మాటల్లో అవాస్తం అణువంతైనా లేదు.

కరువు కాటకాలు కొన్ని శతాబ్దాలుగా రాయలసీమలో తిష్ట వేసుకున్నాయి. క్రీ. శ. 1326, 1390-91, 1396, 1398-99, 1402, 1423-24, 1442, 1454, 1475, 1540, 1631, 1646, 1756, 1782, 1791-82, సంవత్సరాల్లోనేగాక, బ్రిటిష్ పాలనలో కరువులు మరింత తరచుగా ప్రత్యక్షమైనాయి. కేవలం వర్షాభావం వల్లనేకాక, భూమి శిస్తు విధానం, విపరీతమైన పన్నుల భారం, ఆహార ధాన్యాలను విచక్షణారహితంగా ఎగుమతి చేయటం, స్థానిక పరిశ్రమలను నాశనం చేయటం, వ్యాపారవర్గాలకు విస్తృతమైన స్వేచ్ఛ కల్పించటం, ఉమ్మడి కుటుంబాల విచ్ఛిన్నత, కేంద్రం- ప్రాంతాల మధ్య పాలనలో సమన్వయం లేకపోవుట, పాలనా వ్యయం, సైనిక వ్యయం పెరిగిపోవుట మున్నగు కారణాలు కరువుల పెరుగుదలకు దోహదకారులయ్యాయి.

1800-1900 మధ్య దాదాపు 15 సం॥లు పూర్తిగా కరువులు సంభవించాయి. వీటన్నింటిలో అత్యంత దారుణమైనవి-1832-33లో వచ్చిన నందననామ సంవత్సర కరువు ( *గుంటూరు కరువు) ఆ తర్వాత వచ్చిన ధాతనామ సంవత్సర కరువు (1876-77).

సరిగ్గా నందన కరువు ప్రారంభంలో సి. పి. బ్రౌన్ గుంటూరుకు యాక్టింగ్ కలెక్టరుగా వెళ్ళాడు. 1832 డిసెంబర్ 21వ తేదీన ఛార్జి తీసుకున్నాడు. 26వ తేదీన ఒక రిపోర్టులో బ్రౌన్ ఇలా రాశాడు. "....The prices are also greatly enhanced from the total rain failure of rain this month, great number of people and cattle are dying. Plundering of villages

by bandits, robbers etc., are of frequent occurances of the cholera still continues. ("Hyderabad, A.P. State Archives, Guntur Dt. Records, Vol. 3988 P : 319)

"ఒక రెజిమెంటు తాలూకు సైన్యం మచిలీపట్నం నుండి బళ్ళారి వెళ్తూ గుంటూరు గుండా వస్తుందనీ, వాళ్ళకు తగిన సరఫరాలు, సదుపాయాలు అందజేయ మని బ్రౌన్‌కు హుకుం ఇస్తే, యీగడ్డు పరిస్థితుల్లో వాళ్ళ వసతులు గిసతులు చూడా లంటే సాధ్యమా ?" అంటూ 1832 డిసెంబర్ 31న బ్రౌన్ మరొక జాబులో వ్రాశాడు.



1833 జనవరి 16న మరో జాబు వ్రాస్తూ కరువు పరిస్థితుల వల్ల జిల్లాలో లూటీలు, దొంగతనాలు ఎక్కువ య్యాయని వ్రాశాడు.

చీఫ్ సెక్రటరీకి, జాబులోని పద జాలం రుచించలేదు.'కరువు (Famine) అంటావేమి? కొరత(Scarcity) అనవచ్చు కదా?' అని మందలిస్తూ బ్రౌన్‌కు తాఖీదు పంపాడు.

"తనకు ప్రజలు పంపుకునే అర్జీ లలో 'కరువు' అనే వ్రాసుకుంటు న్నారు, పసి పిల్లలను అమ్ముకుంటు న్నారు. ఆకలి చావులు ఎక్కడ పడితే అక్కడ సంభవిస్తున్నాయని వారం వారం తనకు రిపోర్టులు వస్తున్నాయి. కాబట్టే 'కరువు' అని వ్రాయవలసి వచ్చిందని తన సంజాయిషీ రిపోర్టులు వ్రాసు కొన్నాడు.

"1831-32లో గుంటూరు జిల్లా జనాభా 5, 12, 317 మంది కాగా 1832-33లో 3, 57, 038 మందికి దిగి పోయింది. అంటే వొక్క ఏడాదిలో దాదాపు మూడో వంతు మంది మటు మాయమయ్యారు. ఆ మరుసటేడు లక్షా ఇరవై వేల మంది తగ్గిపోయారు. ఈ కరువు తర్వాత పదేళ్ళకు కూడా జిల్లా జనాభా 3 1/2 లక్షలు దాటలేదు.

"ఈ కరువు పొట్టన పెట్టుకున్న మనుషులశవాలను రోడ్డుకు రెండు పక్కలా అమర్చితే ఆ పొడవు 20 మైళ్ళు వుంటుందని అంచనా వేశారు. ఇక పశు నష్టం చెప్పనలవి కాదు. పాడి పశువులు, ఎద్దులు, గొర్రెలు, మేకలు, ఈ రెండేళ్ళ కాలంలో మొత్తం 6 లక్షలకు పైగా మల మల మాడిపోయాయి. బ్రౌన్ జాబుల్లో

స్థానిక చరిత్ర శకలాల - కడప జాబిల సంకలనం - పర్యవేక్షణ డా॥ జి. యస్. రెడ్డి, పరిశోధన: బంగోరె - pages 41-42).

తరతరాలుగా రాయలసీమ జిల్లాలు కరువు రాక్షస కాపురాలుగా మారాయి. విదేశీయులైన సర్ ఆర్థర్ కాటన్, కల్నల్ మెకంజీలు రాయలసీమను ఎడారి కాకుండా కాపాడేందుకు అవిశ్రాంతంగా కృషి చేశారు. కడప, కర్నూలు కాలువ వారి చలవే అనాలి.

రాయలసీమ అంతటిని పీల్చి పిప్పి చేసిన బ్రిటీష్ చరిత్రకారులు 'గుంటూరు కరువు' అని పరిగణించారు హాన 1832-33లో వచ్చిన కరువు వందన 'కరువు'గా పేరు వచ్చింది.

"కోటి కొక్కరిది ఇప్పటి రాయలసీమ
పేట కొక్కెరలేని పెద్ద రాయలసీమ
వేటాడి వేటాడి వెదికినా ఇందులో
నేటి పేదల సీమ-నిజ రూపు కనబడదు
ఇది ఎడారిలోని ఒయాసిస్సే కానివ్వు
పడగొట్టిన పేదకేమో వట్టి ఎండమావు
"కోటి గొంతుల కిన్నెర మీటి కొనుచు
కోటి గుండెల కంజరి కొట్టుకొనుచు"

అంటూ నేటి రాయలసీమ కన్నీటి పాటను 'పెన్నేటి పాట'గా వినిపించారు విద్వాన్ విశ్వంగారు.

(తరువాయి 73 వ పేజీలో)

ప్రపంచపు ఒడిలో
భూమాత ఒడిలో
ఓ సోమాలియా !
దాహం దాహం అంటూ
మెలి తిరిగిపోతోంది !!
చివరిగా . . .
ఓ సోమాలియా....! ఓసోమాలియా!
మోసపోయావు సోమాలియా!
ప్రపంచం నిట్టూరుస్తుందే గాని
ఓదార్చదు !!!

# కరువులో దేశమా ?

తిరునగరి రామాంజనేయులు

కరువూ కరువూ దారుణ కరువూ
దేశంలో కరువా.... అయ్యో - కరువులో దేశమా ?!
రాయలసీమా సర్కారాంధ్రా
తెలంగాణాలలో భయానకంగా
లక్షలాది ప్రజ సాలు పొడవునా
కుక్షి మాడి చస్తున్నారే!
ధాతు కరువు, బెంగాల్ కరువుల్లా
ఖ్యాతికెక్కె యీనాటి కరువులు ॥దేశంలో॥

చెట్ల బెరళ్ళూ, చింత గింజలు
ఆకు అలము కలబంద గడ్డలు
గొడ్లను సైతం కోసుకు తిన్నా
ఆరని ఆకలి, తీరని కరువూ ॥దేశంలో॥

కాయో, కసరో, కొట్టుకు తిన్నా
మండే డొక్కలు, ఎండిన గొంతులు
దాహం దాహం శోషిలు దేహం
తడుపు కొనుటకే దొరకదు నీరూ ॥దేశంలో॥

పరాయి ప్రభువుల పరిపాలనలో
కరువా కాదిది స్వరాజ్య పాలన!
బుక్కెడు బువ్వకు గుక్కెడు నీటికి
లెక్కలేని ప్రాణాలల్లాడెను! ॥దేశంలో॥

సస్య శ్యామలమౌ ఆంధ్రోవని
నిత్య పస్తులతో విలపిస్తుందే,
సుక్షేత్రంబౌ తెల్గుగడ్డ కడు
శూన్యంలో కృశి యిస్తుందే; ॥దేశంలో॥
చుక్క చినుకుకై స్వాతి చిప్పలా
చచ్చిన గొడ్లకు రాబందుల్లా
చూచే మనుషులు-వాడిన మొగాలు
కొంపా గోడీ వదలేశారూ
గంజికి బిడ్డల నమ్మేశారూ ॥దేశంలో॥

ఆకు లలము తిని కర్చేవాహా
అంటు రోగముల కుమిలేవాహూ
పీనుగు పెంటల పొర్లేవాహూ
కనిపిస్తున్నా కానని ప్రభువులు ! ॥దేశంలో॥

కరువయ్యా అని కంఠం విప్పితె
మరణించారను మాట చెప్పితె
అహింస మార్గ అగ్ర నాయకులు
అల్లరి మూకల అలజడులంటూ
పార్టీ స్వార్థపు ప్రచారమంటూ
బుకాయింపులతొ దొరాయింపులతొ ॥దేశంలో॥

చిట్కా లెన్నో చెప్పిరి పెద్దలు
క్షామం బందే చెట్లు నాటుడని
వర్షాలంటే వరుణ పూజలని
సంతు నిరోదం సాగించండని
ఉపోషాలతో పొదుపు చేయమని
ఉపదేశిస్తూ క్షామ దేవతను
ఉపాసించి బలిపించారే ! ॥ దేశంలో॥

ఎడతెగకుండా పారే నదులు
ఏమీ తోచక వెల వెల బోయాయ్ !
పసిడి పండు భూదేవత భోరున
పొట్ట బాదుకొని వలవల ఏడ్చే !
అంగటిలోనా అన్నీ వున్నా
అల్లుని నోటా శనిలా వుందే ! ॥దేశంలో॥

(రచనా కాలం : 1950)

* రాయలసీమ ప్రజలు అప్పులలో పుట్టి, అప్పులలో పెరిగి, అప్పులలో చస్తున్నారు. ప్రజలు ఒక కరువు నుండి బయటపడే సమయానికి మరొక కరువు ప్రత్యక్షమవ్వడంతో వారి ఆర్థిక పరిస్థితులు తారుమారు అవుతున్నాయి"

— ప్రొఫెసర్ గంగూలీ.
ప్రముఖ ఆర్థిక నిపుణుడు

# కరువు కోరల్లో నల్లగొండ

**— నిరంజన్**

నల్లగొండ
ఎడారిగా మారి
స్మశాన కొంప కావచ్చు
కాలగర్భంలో కలసి పోవచ్చు
దానికోసం "ఆశ్చర్య పడాల్సిన"
అవసరం లేదు.

నల్లగొండ జిల్లా ప్రజలు చాలా తీవ్రంగా ఎదుర్కొంటున్న తక్షణ సమస్యలు నీటి సమస్య, ఫీల్డ్ ఫైరింగ్ రేంజ్ సమస్య, అణు విద్యుత్ కేంద్ర సమస్య. జిల్లాలో నదులు, ప్రాజెక్టులు ఉండి కూడ ప్రజలకు నీరందక పంటలు పండక తినడానికి తిండిలేక పశువులకు మేత లేక రైతాంగం ఆస్తి పాస్తులను అమ్ముకొని వలస పోతున్నారు. గ్రామానికి 75% శాతం లేబర్ జనం విజయవాడ, భద్రాచలం, బొంబాయి, హైదరాబాద్‌లాంటి నగరప్రాంతాలకు వలస పోతున్నారు. వర్షాలు పడక పోవటం వలన చెరువుల్లో, కుంటల్లో నీరులేక వ్యవసాయ బావుల్లో, నీరింకి పోయి గ్రామాల్లో 50% వ్యవసాయ బావులు ఎండిపోతున్నాయి. తినడానికి పంటలు పండక, త్రాగడానికి నీళ్ళులేక, ఉండడానికి ఇండ్లు లేక తీవ్రమైన కరువు కాట కాల కోరలలో ఇరుక్కుపోయి అనేక ఇబ్బందులకు గురౌతున్నారు.

కరువంటే
అనావృష్టి,
సాగునీటి,
ఆకలి సమస్యే
కాదు
తాగు నీటి సమస్య
కూడ.

నల్లగొండలో ఇవేవి ప్రజలకు అమవుగా లేవు. జిల్లాలో అనేకచోట్ల వున్న ఉప్పు, ఫ్లోరైడ్‌వంటి హానికరమయిన స్థాయిలోవున్న నీటిని విధిలేక తాగి 20లక్షల మంది ప్రజలు ప్రాణాంతకమైన జబ్బులకి లోనవుతున్నారు. దేశంలో 52 శాతం గ్రామాలు అంటే దాదాపు రెండున్నర లక్షలకు పైగా గ్రామాలు మంచినీటి సమస్యతో సతమతమవుతున్న దాండ్లో నల్లగొండ జిల్లా ప్రధానమైనదిగా గవర్నమెంట్ అధికారులు ప్రకటిస్తున్నారు.

సాగునీరు లేక వ్యవసాయానికి వీలుగావున్న భూములన్నీ ఎడారిగా మారు

తున్నాయి. మారుతున్న పరిస్థితుల్ని చూస్తే ఆశ్చర్యపడాల్సిన పనిలేదనిపిస్తుంది. కరువువల్ల మధ్యతరగతి, పేద రైతాంగం, వ్యవసాయ కూలీలు అత్యధికంగా బాధపడుతుండగా, దానివలన లాభపడుతున్న వర్గాలు కూడ కొన్ని వున్నాయి. శాశ్వత కరువు నివారణ పథకాల పేరుతో, ఏటేటా తాత్కాలిక కరువు సహాయం పేరిట ప్రభుత్వాలు ఖర్చుపెడుతున్న కోట్లాది ధనం లంచగొండి అధికారులు, ప్రభుత్వనేతలు, రాజకీయ నాయకులు, కాంట్రాక్టర్లు చేపట్టే గ్రామీణ ధనికుల జేబుల్లోకి చేరుతున్నాయి. దళారి సంస్కృతి దేశాన్నేలుతున్నంటు కరువు కాలంలో సరుకులు దాచేసి ధరలు పెంచేసి నల్ల వ్యాపారస్తులు, గ్రామీణ ధనికులు విపరీత లాభాలు సంపాదించుకుంటున్నారు. ప్రభుత్వాలు తమ గిడ్డంగులలోని నిలువలను పందికొక్కుల పాలైనా చేస్తారు గాని ప్రజల ఆకలిని తీర్చడానికి ఏమాత్రం ఇష్టపడరు. ఈ దోపిడీ సమాజంలో మానవ శ్రమ వర్తకపు సరుకుగా పతనమైవుండగా కరువు కాలంలో శ్రమించగల, సుఖాన్నందించగల, సంపదలు సృష్టించగల మనిషి ఒక సరుకుగా అమ్ముడుబోయే బానిస హీన స్థితికి నెట్టివేయబడుతుంది. పేద ప్రజల మానవత్వం పూర్తిగా నిరాకరణకు, పరాయికరణకు బలైపోతున్నది. తమ శ్రమమీదనే ఒక తమ శరీరం మీదనే పూర్తి హక్కును కోల్పోతున్నారు. ప్రజలు పశువులవలె అమ్మబడుతున్నారు, కొనబడుతున్నారు. ఇట్లాంటి స్థితికినెట్టివేయబడుతున్న పరిస్థితిలో పీడక పాలక వర్గాలు కరువు కాటకాలను సృష్టించకుండా ఉండలేరు. దానికి పరిష్కరించనూలేరు. ప్రాజెక్టులు కట్టించనూలేరు.అందుకే కరువును, పేదరికాన్ని ఆర్థిక సాంఘిక సమస్యగా గుర్తించక వాటి పరిష్కారం కోసం పోరాడుతున్న వారిని అణిచివేసేందుకు, పేదల మీద దాడులకు ప్లానువేస్తూన్నారు. నల్లగొండ జిల్లా ప్రజానీకాన్ని ఇటు నీటి సమస్యతో, అటు ఫైరింగ్ రేంజ్ సమస్యతో, అటు విద్యుత్ కేంద్ర సమస్యతో చంపుకుతినే సులువైన ప్రణాళికను బయటికి తెచ్చారు.

### ప్రజల ప్రాణందీసే ఫైరింగ్ రేంజ్ :

ప్రజల జీవితాన్ని, సంస్కృతిని అల్లకల్లోలం చేస్తున్న కరువు పరిస్థితి ఉండగానే గిరిజనుల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవనంలో భాగమై వారి ప్రాణంలో ప్రాణమైన రాచకొండ అడవిని లాగి వేయాలని చూస్తున్నారు. అడవిని కంటికి రెప్పలా కాపాడుకొంటూ వచ్చిన గిరిజనుల బతుకుల్లో, అటవీ ఉత్పత్తుల్లో నిప్పులు పోస్తున్నారు. వర్షపాతం కోసం అడివిని పెంచాల్సిన ప్రభుత్వాలు సామ్రాజ్యవాదుల కీలుబొమ్మలుగా తయారయి ఆయుధ శిక్షణకై అడవిని నరుకుతున్నారు. ప్రకృతి పలవరించిన రాచకొండకు రాజకీయం పూసి రంగరించి నూరుతున్నారు. గిరిజనుల ఖ్మాముల్లో తుపాకులు దించి నోట్లో నిప్పులు పోయజూస్తున్నారు. పచ్చ పచ్చని

ఫైర్లతో కళకళలాడే గిరిజనుల బతుకుల్లో బలుసాకు నూరి బొచ్చ్యాలని ప్రభుత్వ కుట్ర పన్నుతున్నది.

రాచకొండ ఏరియాలో ఏ తండా జూసినా అన్ని పూరి గుడెసెలే. తండలకు కరెంటులేదు, రోడ్లులేవు. తాగడానికి నీళ్ళులేవు. ఉన్న నీటిలో ఫ్లోరిన్ అధికంగా వుంది. ఆ నీళ్ళుతాగి యువకులు మూలన పడుతున్నారు. రక్షిత మంచి నీటికోసం కేటాయించిన డబ్బులను సర్పంచ్‌లు దిగమింగుతున్నారు. చెరువులు, కుంటలు తెగినా పట్టించుకోవడంలేదు. జీవనం వ్యవసాయం మీద ఆధారపడి బతుకున్నవారున్నారు. ఈ ఫైరింగ్ రేంజ్‌వల్ల సంస్థాన్ నారాయణపురం మండలం, చౌటుప్పల్ మండలం, రంగారెడ్డిజిల్లా సరిహద్దు మండలాల గ్రామాలకు చెందిన ప్రజలు 70 వేలమంది భూములు, ఆస్తిపాస్తులు విడిచి 50 వేల ఎకరాల భూమిని ఖాళీచేసి వెళ్ళిపోవాలి. ఈ అడవిమీద ఆధారపడి బతికే బంటు, బోయ, మత్స్య, గీతా కార్మికులను మొత్తం బజారున పడేస్తుంది. ప్రభుత్వం, చదువురాక జ్ఞానంలేక చీకటి బతుకులు అడివిలో బతుకుతున్న అమాయకత్వాన్ని అసరా చేసుకొని 50వేల రూపాయల విలువచేసే భూములను ఎకరానికి 5 వేల రూపాయలు ఇస్తామని అవినీతి అన్యాయాలకు గురిచేస్తున్నారు.

## ప్రభుత్వానికి ప్రజలు ముఖ్యమా ? పులులు ముఖ్యమా ?

భూమినే స్వంతం చేసుకొని అడవి గుట్టల్లో బ్రతుకుతున్న ప్రజలకు ప్రభుత్వము ఏ ఒక్క సమస్య పరిష్కారం కోసం ఆలోచించేదికాక 60 సంవత్సరాలుగా తాత తండ్రుల నుండి పోడుగొట్టి పొలాలుచేసి "మట్టిలో మాణిక్యాలు" పండిస్తున్నారు. ఇట్లాంటి పరిస్థితిలో ఫైరింగ్ పెడుతామనడం గిరిజనులను బయ పెడుతూ ప్రాణాలతో చెలగాట మాడుతున్నది పీడక పాలకవర్గ ప్రభుత్వం. ప్రజల మౌలిక సమస్యలను ఈ ప్రభుత్వాలు పరిష్కరించలేవని తెలంగాణ జిల్లాలో ఎక్కడికక్కడి సంఘాలుగా ఏర్పడి ప్రజా పోరాటాలు చేస్తుంటే పోరాటాలను అణచటం కోసం సరిహద్దు బలగాలను దింపి వారికి కోట్ల రూపాయలను ఖర్చుపెడుతు పోరాడే ప్రజలను నిర్బంధించి చిత్రహింసలకు గురి చేస్తూ పట్టుకుపోయి కాల్చిచంపి ఎన్‌కౌంటర్లని కట్టు కథలల్లుతూ మనిషిగా బ్రతికే కనీస హక్కును కాలరాస్తున్నారు. ఈ ప్రాంతంలో 50 వేల మందికి నష్టాన్ని కలిగించే "ఫైరింగ్ రేంజ్" ముఖ్యమా ? 60 పులులు ముఖ్యమా ? పులులకు ప్రాముఖ్యత నిచ్చి ప్రజలను చంపుటకు కోట్ల కోట్ల రూపాయలు "ఫైరింగ్ రేంజ్"కు ఖర్చుచేస్తూ ప్రజల తక్షణ సమస్యలకు ఖర్చుపెట్టకుండ అనవసరమైన వాటిని ఆలోచిస్తూ డబ్బును దుబారా చేస్తూ ప్రజలను చంపించాలని చూస్తున్నది ప్రభుత్వం.

ప్రజల దగ్గర అనేక పద్ధతుల్లో వసూలు చేసిన డబ్బును ప్రజల అవస

రాలకు ఖర్చుపెట్టాలని, దోపిడీ, అవినీతి, అన్యాయం, అక్రమం, రౌడీరాజ్యం, లంచగొండితనానికి వ్యతిరేకంగా, సామ్రాజ్యవాద, భూస్వామ్య శక్తులుసృష్టిస్తున్న విష సంస్కృతికి వ్యతిరేకంగా ఉద్యమిస్తుంటే వారిని అణచివేయడంకోసం జరిగే కుట్రలో భాగంగానే ఈ రోజు నల్లగొండ జిల్లాలో మిలటరీ, పోలీసు బలగాలను దింపి తుపాకులు కాల్చడం కోసం శిక్షణా కేంద్రాన్ని "రాచకొండ" గుట్టల్లో నిర్మించబోతున్నారు. ప్రజలను ఆర్థిక, సాంఘిక అసమానతల నుండి రక్షించక వీటికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులుచేసేసంస్కృతిలో ప్రజల జీవనాన్ని ఉనికిని పరోక్షంగా, ప్రత్యక్షంగా దెబ్బతీసేది అణువిద్యుత్ కేంద్రం. 4 వేల కోట్లరూపా యల ఖర్చుతో నిర్మించే కేంద్రాన్ని రద్దుచేసి తక్కువ ఖర్చుతో ప్రజలకు నష్టం కాని జల, థర్మల్ విద్యుత్ కేంద్రాలను నిర్మించవచ్చుగదా ! నాగార్జునసాగర్‌లో అణు విద్యుత్ కేంద్రం నిర్మించి ప్రజల గుండెల్లో ఆటంబాంబులను నింపాలని కుట్ర చేస్తున్నారు.

ఇదంతా సామ్రాజ్యవాదుల కుట్ర. సామ్రాజ్యవాదాన్ని ప్రభుత్వ ఆర్థిక విధానాల్లోనో, రాజకీయ విధానాల్లోనో, పెట్టుబడుల రూపంలోనో ఇప్పటివరకు చూశాం. కాని "అణువిద్యుత్ కేంద్రం," "ఫీల్డు ఫైరింగ్ రేంజ్" పెట్టడం జరిగితే డైరెక్టుగా సామ్రాజ్యవాద భూతం పచ్చగా బతుకుతున్న ప్రజల జీవితాన్ని ఛిన్నా భిన్నంచేసి వారి జీవితాలనుచిదిమిచేయటం మనంకళ్ళారా చూస్తాం. ఇది ప్రజలంతా సహించరానిది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కాంక్షించే ప్రతి ఒక్కరూ వ్యతిరేకిస్తూ డిమాండ్ చేయాలి. మన చుట్టువున్న పర్యావరణ ప్రకృతిని ధ్వంసం చేస్తూ కరువు కోరల్లో ఇరికిస్తున్న సామ్రాజ్యవాద సంస్కృతికి వ్యతిరేకంగా అంతా ఏకమై పోరాడాలి.



## దేశంలో 99 ఆకలి జిల్లాలు

"భారతదేశం మొత్తం మీద 99 జిల్లాలు తరచు అనావృష్టికి గురయ్యే ప్రాంతాలుగా ప్రభుత్వం గుర్తించింది. పది లక్షల ఎనభై వేల చదరపు కిలో మీటర్ల విస్తీర్ణం గల ఈ ప్రాంతంలో సగటున ఏడాదికి 750 మిల్లీ మీటర్ల కంటే తక్కువగా వర్షం పడుతోంది. కరువు కాటకాలకు గురయ్యే ప్రాంతంలో దాదాపు సగభాగం దక్కన్ పీఠభూమిలోనే వుంది."

— కేంద్ర జిల్లా సంఘ చైర్మన్ శ్రీ యం.పి. చితాలే
లండన్‌లో 86 జులై 17-18 తేదీల్లో
జరిగిన సింపోజియంలో నుంచి....
(ఉదయం. 17-2-1987)

# కరువు చెట్టు

ఇంకా
సూర్యుడుదయించలేదు
కాకుల కేకలు, పగలు రాత్రికెళ్ళరుగని
ఆకలి పొలికేకలు
లోతు కెళ్ళిన పొట్ట,
లెక్కకోసం వెన్నుపూసల్ని మార్కు పెడుతోంది
హోటల్‌లో పోయిన వారంనాటి క్లోరినైజెడ్ వాటర్ కంపు !
సాయుధ భూస్వామింట్లో లవంగాలు ఇంపు
నాసికా రంధ్రాల్ని చెరో ప్రక్క పంచుకుంటె,
గుండెలో ప్రాణాలు పిడికిలి దాటిపోనప్పుడు
నీటినీ, కూటినీ వెతుక్కుంటూ,
నూతినీ, గోతినీ కెలుక్కుంటూ,
ప్రక్క వాడింట్లోనైనా, ప్రక్క ఊరు చెరువులోనైనా,
ఇంత ప్రాణాన్ని చూడాలనే తపనతో
అనంతాన్ని సమీక్షిస్తూ,
కాస్త పిచ్చిగా - మరికాస్త ధైర్యంగా,
పిడచ కట్టిన గొంతు పాఠాలు చెప్తుందని,
పొట్టకి భాషుందని అంటె విస్మయం !
కళ్ళల్లో ఆదిత్యుని కోటి జ్యోత్స్నలిస్తుందంటె నమ్మారు !!
తెలుసుకోవాలంటె,
గొంతుని పిండి, ఎఱ్ఱ నీళ్ళని
పేగులికిస్తే అవులిస్తాయి !
కన్నీటిని తాగలేం,
పరమాణువుని పది లక్షల శకలాలు వేసేందుకు సిద్ధమే !
ఈ ప్రక్క చూడు,
రాళ్ళల్లో వేరుతన్ని, రక్తాన్ని పీల్చివేసి
ఆకలి, దాహాల సంకలనం,
జల రహితంగా పెరుగుతున్న
ఓ కరువు చెట్టు.

— వియ్యస్సార్ కాండూరి

# పల్లె ఉన్నాది-పని ఉన్నాది

—అప్పన్నగారి గోపాలరావు

శివుడా జంగామ - శివుడా జంగామ
శివ శివ జంగామ - శివుడా జంగామ ॥శి॥

పల్లె ఉన్నాది-పని ఉన్నాది
పట్నంలో ఏముందో-పాడుబడ్డాది ప॥—శి॥
బాయి ఉన్నాది - బంధమున్నాది
దున్నడానికి రెండు - దున్నలున్నాయి బా॥—శి॥
కూలి ఉన్నాది - నాలి ఉన్నాది
కూకుండి తినకుండా - పని ఉన్నాది కూ॥—శి॥
చెట్టు ఉన్నాది - పుట్ట ఉన్నాది
అడవిలో పుట్ట - తేనె ఉన్నాది చె॥—శి॥
చెరువు ఉన్నాది - కుంట ఉన్నాది
వానతో పొంగెటి - వాగు ఉన్నాది చె॥—శి॥
బాయి పాడాయె - బోర్లు ఫేలాయె
తాగా డానికి చుక్క - నీరు కరువాయె బా॥—శి॥
అడవులు లేవాయె - అలుము లేదాయె
కష్టానికి కూడా - కట్టె కరువాయె అ॥—శి॥
ఏరు ఎండిపాయె - వాగు పారదాయె
ఏటిలో ఇతకంత - పట్నమెళ్ళిపాయె ॥ఏ—శి॥
చెర్వు పూడిపాయె — కుంట తెగిపాయె
చుక్క నీరు లేక - డొక్క లెండిపాయె చె॥—శి॥
నదులు యాడొనాయె - కాల్వ లేదాయె
కట్టు కాల్వపూడి - భూమి బీడాయె న॥—శి॥
మెట్ట పాడాయె - తరి చౌడాయె
పచ్చే లిడి భూమి - ఒర్రెలై పాయె మె॥—శి॥
కరువులు మొదలాయె - కాటకాలాయె
గంజిలోకి బుక్క - గింజ కరువాయె క॥—శి॥
ఎరువు నకిలిదాయె - మందు నకిలిదాయె
ఊర్కుండి చూస్తుంటే - ఉరితాడు మెడకాయె ఎ॥—శి॥

(తరువాయి 91వ పేజీలో )

# రాయలసీమలో పచ్చదనం ఎలా సాధించవచ్చు?

— సర్దేశాయి తిరుమలరావు

కటకం నుంచి శ్రీరంగపట్నం వరకు విస్తరించిన సీమ రాయలవారి సీమ. రాను రాను కుంచించుకుపోయి ప్రస్తుతం నాలుగు జిల్లాలకే వాడుతున్నాం. అనంత భూపాలుని ఆస్థానంలో (ఉత్తర విజయనగర రాజుల కాలం) వుండి "అభిషక్తరాగం" రాసిన నడమింటి వెంకటపతి. కడపజిల్లా సిద్దవటంకు చెందిన ఆయన, తన కావ్యంలో 'రాయలసీమ' అనే మాటను వాడాడు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు గానీ, చిలుకూరి నారాయణరావుగారు గానీ, ఆ మాటను పునరుద్ధరించారేమోగాని, వారే ఆ నామకరణం చేశారనడం పొరపాటు.

ఇవి సాధారణంగా కరువు ప్రాంతం. సమస్యలకు మూలకారణం జనసంఖ్య. రాయల కాలంలో ఇంత జనసంఖ్య లేదు. అప్పుడు ప్రతి వూరికీ చెరువు వున్నది. వూరి పేర్లు కూడా చెరువులే. ఎక్కడ చూచినా చెరువులే. చెరువులతో సస్యశ్యామలం చేశారు. సర్కారు జిల్లాల నుంచి ఎందరో బ్రాహ్మణులు, కవులు ఇక్కడికి వలస వచ్చేశారు.

కాని రాను రాను చరిత్ర గతిలో రాయలసీమ వెనుక పడిపోయింది. కరువు అంటే వరి ధాన్యం పండకపోవడం అనికాదు. రాయలసీమలో జొన్న, కొర్ర, రాగి బాగా పండుతాయి. వీటికి నీళ్ళ చాల తక్కువ మాత్రమే అవసరం. అయితే ఇవి వ్యాపార పంటలు కావు. వీటివల్ల ఎక్కువ లాభాలు రావు. వరి కూడా ఇప్పుడు వ్యాపార పంట అయిపోయింది. పూర్వం మేము కొర్ర బియ్యంతో భోజనం చేసే వాళ్ళం. ఇప్పుడు అవి కావాలన్నా దొరకవు. 50, 60 ఏళ్ళ క్రితం బ్రాహ్మణులు మాత్రమే కొర్ర బియ్యం తినేవారు. మా వూరిలో కరణాంమేం. మా వూరు ఆదోని దగ్గర. ఆలూరు తాలూకా జూహాలోపురం. మా వూరిలో మేముగాక మిగిలిన వారంతా శూద్రులే. కమ్మ, రెడ్డి కుటుంబాల్లోనూ కొర్ర బియ్యమే వాడేవారు. పెద్ద వెంకట్రామప్ప అనే కమ్మాయన అనేవాడు "మాకెందుకు స్వామీ! ఎద్దు ముడ్డి పొడుచుకునే వాళ్ళం- మాకు ఎందుకు కోర్ర బియ్యం?" అని.

వీటి సమస్య ఇప్పటి కంటే అప్పుడు- 1930 నుంచి 1938 వరకు చాల ఘోరంగా వుండేది. మేం బ్రాహ్మణులమని చెప్పాగా - మేము నీళ్ళ తెచ్చుకోవడం చాల కష్టంగా వుండేది. మా తల్లిగారు తెల్లవారు జామున కడవ దీసుకుని రెండు

మైళ్ళు పోయేది నీళ్ళు తెచ్చుకోవానికి. అక్కడి చిప్పల్లోంచి తీసుకొని నీరు కడవలో పోసుకోవాలి. ముంచుకు రావడం కాదు. అంత కష్టం.

అప్పట్లో రైతులందరికీ నష్టాలు వచ్చేవి ఇప్పుడు చిన్న రైతులకు మాత్రమే నష్టాలు వస్తున్నాయి. పెద్ద రైతుకు రావడం లేదు. పొలానికి నీరు విషయంలో చిన్న రైతుకు ఇప్పటికీ కష్టమే. అందరూ వరి పండించాలంటే ఇక్కడ నీళ్ళ కరువు గనుక సాధ్యం కాదు. ఈ నేలలో పత్తి, నూనెగింజల పంటలు, ధనియాలు, జొన్న లాంటివి పండుతాయి. వీటికి పెద్దగా నీళ్ళక్కర్లేదు. నీళ్ళుంటే దిగుబడి ఎక్కువ వస్తుంది.

కె.ఎల్. రావుగారి 'గంగా- కావేరి సంధానం' రాలేదు. దస్తూర్ అనే ఇంజనీరు 'గార్లండ్ స్కీమ్' అన్నాడు 1960లో. ఇవన్నీ పత్రాల్లో వున్నాయి. ఇరుగు పొరుగు రాష్ట్రాలు నదీ జలాల కోసం కొట్లాడుకుంటున్నాయి. జలాభావ పరిస్థితి రాయలసీమ ఎదుర్కొంటేనే వుంటుంది. కనుక నీటిపై ఆధారపడే పంటల గురించి మరచి పోవాలి. అర్ధ ఎడారి పంటల ద్వారా కొంత సుసంపన్నం చేసుకోవచ్చు. కానీ తూర్పు గోదావరి జిల్లాలో లాగా, తంజావూరులో లాగా రాయలసీమను మార్చాలంటే సాధ్యం కాదు.

కాబట్టి ఇప్పుడు మనం ఏం చేయాలి? నూనె పంటలు ఎక్కడైనా వేయ వచ్చు. వేరుశనగ, పొద్దుతిరుగుడు, కుసుమలు, నువ్వులు మొదలగు వాటికి కొంచెం నీళ్ళుంటే చాలు ప్రత్తి పండుతుంది. ఇక్కడ పండించడం లేదు. అందరూ గుంటూరు పోతున్నారు నల్లరేగడి భూమి అంటూ. సుగంధ తైలాలుండే పంటలు న్నాయి. ధనియా, వాము పెద్ద ఎత్తున పండించి నూనె తీసి ఎగుమతి చేయవచ్చు. దవనం, పుదీనా లాంటి సుగంధ మొక్కలు పెంచవచ్చు. ఇక్కడి వారికి వ్యాపార మనస్తత్వం లేదు- ఏదో ప్రభుత్వ స్కీము కోసం ప్రయత్నిస్తారు. అది మంజూరు కాలేదంటే అలాగా అని వెళ్ళిపోతారు కాని అది వచ్చేవరకు పట్టుదలగా ప్రయత్నిం చరు.

సుబాబుల్ మొక్కలు రెండేళ్ళలో 50 అడుగులు పెరుగుతాయి. సామాజిక అడవులకు పనికి వస్తుంది. ఎక్కడ బడితే అక్కడ పెరుగుతుంది. ఫర్నిచర్‌కు బాగుంటుంది. అడవి ఆముదము - రతన్‌జోత్ అంటారు ఉత్తర భారతంలో. 20 ఏళ్ళు వుంటుంది. విత్తనాలు వస్తాయి. దాని నుంచి నూనె తీసి పెట్రోలుగా మార్చ వచ్చు. వీటికి క్రిమి కీటకాలు- చీడలు పీడలు రావు. నీళ్ళు అక్కర్లేదు.

మెక్సికన్ భాషలో జిబోబా అనే చెట్టు వుంది. మెక్సికో దేశం రాయలసీమ లాగానే వుంటుంది. ఈ జిబోబా ఎడారిలో కూడా బాగా వస్తుంది. దాని విత్తనాల

నుంచి తైలం తీయవచ్చు. మనదేశంలో జోధ్‌పూర్ వైపు తీస్తున్నారు. దీని తైలం ద్రవరూపంలో వుండే మైనం. చాల పరిశ్రమల్లో ఉపయోగపడుతుంది. విమానాల్లో వాడవచ్చు. రకరకాల రసాయనాలు తయారు చేయవచ్చు.

పత్తి గింజల నుంచి ఖాద్య తైలం తీసింది మొదట మేమే. అప్పుడు అందరూ అపహాస్యం చేసారు. ఇప్పుడు ఆ నూనె ప్రధానమైంది.

నీళ్ళు వుంటేనే అంతా బాగుంటుందనుకోవడం సరికాదు. "వరి వేయాలి"- సర్కారు వాళ్ళలాగ అనుకోడం సరికాదు. ఒరిస్సాలో వున్నన్ని నదులు, అడవులు ఎక్కడా లేవు. కాని ఎప్పుడూ అక్కడ కరువులే. ఇటీవల చూశాం కదా- కలహండి కరువు. బీహార్ అంతటి సహజ వనరులు వున్న ప్రాంతం ఎక్కడా లేదు. కాని అక్కడ ఎప్పుడూ కరువుంటుంది.

ఇక్కడ రాయలసీమలో భారీ పరిశ్రమలు పెట్టుకోవాలి. స్విట్జర్లాండ్ వుంది. అందులో ఒక మొక్క పుట్టదు. అంతా పర్వతమయం. అక్కడ భారీ పరిశ్రమలు- పెద్ద పెద్ద పరిశ్రమలు- అతి సున్నితమైన రసాయనకాలు ఉత్పత్తి చేస్తారు. స్విట్జర్లాండ్ అంటే రసాయనకాలలో భారీ పరిశ్రమలో ప్రపంచానికే అగ్రస్థానం. అక్కడ ఒక మొక్క కూడా మొలవదే. ఆహారం కొనుక్కుంటారు.

రాయలసీమలో ఒక్కటైనా భారీ పరిశ్రమ వుందా? ఇక్కడా అక్కడా పాతవి కొన్ని నూనె మిల్లులు వున్నాయి. ఇక్కడ బెరైటైస్, క్వార్ట్జ్, గ్రానైట్, సల్ఫర్ పుష్కలంగా దొరుకుతాయి. ఖనిజాల పటంలో కడప బేసిన్ ఖనిజాలకు ప్రసిద్ధి.

పెనుగొండ దగ్గర ప్రేమ్‌జీ హరిరామ్ అనే గుజరాతీ కలబంద ప్లాంటేషన్ పెట్టి, దాన్నుంచి నార తీసాడు. కలబంద నారలో మోకులు తయారుచేసి బొంబాయికి పంపిస్తాడు. కోటీశ్వరుడైనా చాల వినయంగా వ్యాపారం చేస్తాడు. సిలికాన్ నుండి తీసే సెమీ కండక్టర్స్ తయారు చేయడానికి చక్కని **air conditioned room** ఇస్తే ఆడవాళ్ళే చేస్తారు.

బంగారమూ, వజ్రాలూ ఒకేచోట ప్రపంచంలో ఎక్కడా దొరకలేదు. ఇక్కడ రెండూ దొరుకుతాయి. కన్యాకుబ్జం అంటే కనోజ్ అనే వూరు వుంది. ఆ వూరిలో ఎక్కువగా ముస్లిములు. దీనిలో ప్రతి ఒక్క కుటుంబం సుగంధ ద్రవ్యం తయారు చేస్తారు. కాసిగడ్డి అంటే **Palmnosa grass** నుంచి నూనె పల్లెటూరి వారు కూడా తీయవచ్చు. మంచి వాసన. అట్లానే జావాసిట్రుల్లో గ్రాసీ అని వుంది. దీని నూనెకి ఎంతో డిమాండ్ వుంది. వీటిని పెంచడానికి నీళ్ళు అక్కర లేదు.

రాయలసీమ ఈ పద్ధతిలో పంటలు పండించాలే గాని- నీళ్ళు దెచ్చి కడవలతో గుమ్మరించడం సాధ్యం కాదు....

## రాళ్ళసీమకూలన్న

— ఎం. జి. ఎం.

ఓ....రాయలసీమ రైతన్నా రాళ్ళసీమ కూలన్నా
తెగించి లేవరన్నా ఎదిరించి పోరుమన్నా.... ॥ఓ....॥

తినబోతె తిండిలేకా
తాగబోతె నీళ్ళులేకా
పస్తులతె బతుకాయె
డొక్కలెండు సచ్చుడాయె
నిలువనీడ లేకపాయె
చెట్టుకింద బతుకుడాయె

ఏందిరా నీ బతుకు ఓరన్నా....
ఎదిరించి పోరు జేయ నడువన్నా ॥ఓ....॥

పొద్దు పొద్దూన లేచి
సద్దికూడు గట్టుకొని
నాపరాయి గనిలోకి
బిక్కు బిక్కు మంటెల్లి
చిటపట ఎండలోన
బండరాయి పైకి దీసి

నీ కండలన్ని కరిగిపాయె ఓరన్నా
నీ బతుకు బండలాగ మారె కూలన్నా....॥ఓ....॥

గడ్డపార లేయంగా
జారిపోయి కాలు చితికె
సైజు బండ దెంపంగా
ఉలి జారి చేయిదెలె
నొప్పులా బాధలకు
నరాలు బీకబట్టె

మందు మాకు లేక నీకు ఓరన్నా
కుళ్ళబట్టె నీదు వొళ్ళు కూలన్నా....॥ఓ....॥

మందులకు మాకులకు
వంద రూపాయలప్పు దెస్తే
పడ్డీమీద వడ్డిగట్టి

లాగబట్టె దొరబాబు
కట్టలేను బాంచెనంటె
కాళ్ళు రెక్క లూడదీసె

నీ బతుకు భారమై పాయె కూలన్నా
అయ్యో పిల్లినోట్లో ఎలుక వైతి ఓరన్నా -- ॥ఓ....॥

అత్యావస్ర అప్పిచ్చి
వడ్డిలేదని చెప్పి
వంద రూపాయల చెదరం
ముప్పదని లెక్కగట్టి
తగని దోపిడీ జేసి
ఆలిమెళ్ళో పుస్తెలాగె

ఎందిరా ఈ దోపిడి ఓరన్నా -- సే....
ఈ సేటుగాళ్ళ జులుమేందిర కూలన్నా.... ఓ॥

సేటుగాడు బండ నమ్మి
మేడమీద మేడగట్టె
కాలినడక దిరిగెటోడు
కార్లమీద దిరుగబట్టె
పుల్లెరలు లాగినోడు
పులిలాగ దిరుగ బట్టె

ఎడ్లు ఎట్టి జేసినా ఓరన్నా
నీ గుడిసె మారదేమిరా కూలన్నా....॥ఓ॥

ఎంత కాల మనిగి ఉన్నా
నీరాత మారదన్నా
ఎదురింటి పోరు జేస్తే
నీ బతుకు మారునన్నా
ఎర్రజెండ నీడలోనా
పోరుబాట జేయమన్నా

తిరుగుబాటు జెండలెత్తి ఓరన్నా
నీవు — రణం జేయ ముందుకురుకు కూలన్నా.

# పెన్నేటి కతలకు ప్రేరణ

## —పి. రామకృష్ణా రెడ్డి

"ఆంగ్లేయుల దొరతనములో ఈ సీమ ఎన్ని విధముల నెంతవచ్చునోఅన్ని విధములను ఎండినది, ఎండించబడినది. ప్రజల పరవశత, అధికారుల అలక్ష్యము, ఇరుగు పొరుగు వారి స్వార్థపరత, వీనికితోడు దైవము దయ తప్పుట, ఇన్నీ కలసి నేటి రాయలసీమ రూపుగొన్నది"

—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

ఈ మాటలు దాదాపు మూడున్నర దశాబ్దాలక్రితం, విద్వాన్ విశ్వం "పెన్నేటి పాట" కావ్యానికి రాసిన ముందు మాటలో అన్నవి. రాళ్ళపల్లి చెప్పిన కారణాల్లో ఆయన విశ్వాసానికి సంబంధించిన 'దైవము దయ తప్పుట' అన్న ఒక్క మాట తప్పితే మిగతావన్నీ భౌతిక జీవితానికి సంబంధించినవే. చారిత్రక, రాజకీయ, ఆర్థిక, సామాజిక కారణాలే. వీటన్నిట్నీ చాలా సక్రమంగా అర్థం చేసుకుని చెప్పా రాయన. "ఇన్నీ కలసి నేటి రాయలసీమ రూపుగొన్నది" అని రాళ్ళపల్లి అన్నప్ప టికీ, ఇప్పటికీ రాయలసీమ రూపులో ఏ మార్పులేదు. వాస్తవానికి ఆయన చెప్పిన 'ఇన్నీ' మరికొన్నీకలసి నేటి రాయలసీమ రూపుగొన్నది. అప్పుడు 'ఇరుగుపొరుగు వారి స్వార్థత' మాత్రమే వుంటే, ఇప్పుడు అక్కడివారి స్వార్థత కూడా అందుకు తోడయింది. అప్పుడెక్కడా కనిపించని అంతకు ముందటి పాలెగాళ్ళ సంస్కృతికి చెందిన ముఠా రాజకీయ ప్రత్యక్ష పోరాటాలు సీమలోని నాలుగు జిల్లాలలో కొన సాగుతున్నాయి. తుపాకులూ, బాంబులూ ఆ 'అధికార' పోరాటాలకు విస్తృతినీ, ప్రోత్సాహాన్నీ ఇస్తున్నాయి. అప్పుడు శ్రీ బాగ్ వొడంబడికకూ, కృష్ణా—పెన్నార్ ప్రాజెక్టుకూ బయటివారు తూట్లు పొడిస్తే, ఇప్పుడు రాయలసీమకు రాయలసీమ రాజ కీయ పాలెగాళ్ళే అన్యాయం చేయడానికి సిద్ధంగా వున్నారు. అధికార పీఠంతో ప్రత్యక్ష భాగస్వామ్యం లేనప్పుడు, 'ఉద్యమాలు' నడిపిన వాళ్ళు, అధికార పీఠాని కెక్కుతూనే ఉద్యమం పూసెత్తకపోవడమేగాక అధికార పంపకాలకోసం పోరాడు కుంటున్నారు. నీటికోసం జరిపే పోరాటాలు కూడా అంతిమంగా తమవర్గ ప్రయోజ నాలను సాధించేవే అయినా, వర్గ ప్రయోజనాలా, తన ప్రయోజనాలా అన్నసందర్భం వచ్చినప్పుడు తన ప్రయోజనాలమీదనే నిలిచే 'స్వార్థత' గూడు కట్టింది.

రాళ్ళపల్లి చెప్పినప్పటి రాయలసీమకూ, ఇప్పటి రాయలసీమకూ ఏదైనా మార్పు కనిపిస్తోందంటే, ఇదిగో ఈ రకమైన మార్పు మాత్రమే కనిపిస్తోంది.

అప్పుడు....

"కోటి గొంతుల కిన్నెర మీటుకొనుచు

కోటి గుండెల కంజరి కొట్టుకొనుచు"

విద్వాన్ విశ్వం పాడిన 'పెన్నేటి పాట' గుండెలు బ్రద్దలయ్యే, చెవులు దిమ్మెత్తే హోరులా తాకింది. అప్పటికి ఆ బాధలోని చారిత్రక, సామాజిక కారణాలు అర్థం కాలేదు కానీ ఆ బాధ మాత్రం అర్థం అయింది. ఆ బాధ అందరూ పట్టించుకోతగినదనీ, "నెత్తి నోరిడి మొత్తుకోనిండు నన్ను" అని ఆయనన్నా ఆయనొక్కడే మొత్తుకోవలసింది కాదనీ అర్థమయింది. "ఇదే పెన్న, ఇదే పెన్న, నిదానించి నడు" అని ఆయన భుజం తట్టి చెబుతూ, ముందు నడుస్తూంటే.... మా వూళ్ళో మా ఇంటి పక్కనే వున్న పెన్నను చూస్తూ, "ఇదేనా? ఇదేనా?" అనుకున్నాను.

"ఈ యేటి కాల్వ లోతుల
పాయలుగ పారు నీటి ప్రతి బొట్టున, నీ
చాయల రైతుల నెత్తుటి
చాయలు సమ్మిళితమై విచారము గొల్పున్"

అన్నప్పుడు, అదేనని నిర్ణయించుకున్నాను.

"ఇంత మంచి పెన్న తల్లి
ఎందుకిట్ల మారెనో?
ఇంత మంచి కన్నతల్లి
ఎందుకిట్ల ఎండెనో?"

అంటున్నప్పుడు 'పెన్నేటిపాట' కన్నీటి పాటయ్యేది. బాల్యమంత అమ్మ వొడిలో గడిపినట్లు. పెన్నలో ఆట పాటల్తో గడిపిన నాకు, రాత్రింబవళ్ళ జీవితంలో

(84 వ పేజీ తరువాయి)

కూడు లేదాయె - గుడ్డ లేదాయె
పని కోసం బతుకు - పట్నం పాలాయె　　కూ॥—శి॥
ఆదేమొ ననుకుంటె - అంత వుట్టిదాయె
పట్నంల మన్నుబడ - పాపామైపాయె　　ఆ॥—శి॥
కూలి లేదాయె - నాలి లేదాయె
కూకుందమన్నా - జాగ లేదాయె　　కూ॥—శి॥
పట్నం పాడాయె - పల్లె బీడాయె
బ్రతకడానికి కూడ - జాగ లేదాయె　　కు॥—శి॥
నదులు పొంగాలె - కాల్వ మర్రాలె
మనిషి మనిషికింత - భూమి ఉండాలె　　న॥—శి॥

విడనీయరాని భాగంగా కలసిపోయిన పెన్నను గురించి ఏవో కొత్త సంగతులు తెలిసినట్లయింది. పెన్నానదికీ, పెన్నానది పక్కనే వున్న ప్రజల జీవితానికీ అంత దగ్గరి సంబంధం వున్నట్టు అంతకు ముందు తెలిసినట్లనిపించలేదు. ఇంకో రకంగా, అంత వరకూ నాకు తెలిసిన సాహిత్యంలో కూడా అది కొత్త సంగతే.

"పెన్నేటి పాట ప్రభావం నాలో చాలా కాలం నుంచీ అలా వుండిపోయింది గానీ ఇలా 'పెన్నేటి కతలు', రాస్తానని గానీ, రాయాలని గానీ, రాయకముందు ఆలోచించినట్లు చెప్పలేను. అయితే, యీ కతలు అసంకల్పితంగా, అప్రయత్నంగా అంత వరకూ అనాకారంగా వుండి అప్పటి కప్పుడు హఠాత్తుగా పుట్టినవా? ఇందులోని ఏ కతను చూసుకున్నా నాకలా అనిపించడమే లేదు. ఈ కతలకు, యీ జ్ఞాపకాలకు తేడాలూ అనుభవాలకు 'ఉనికి', 'గతి క్రమం' వున్నాయి. అందుకే నేను ప్రణాళికను వేసుకోక పోయినా వాటి ప్రణాళిక ప్రకారం, వాటి క్రమం ప్రకారం అవి ముందుకు వచ్చాయి"

("పెన్నేటి కత"లకు రాసుకున్న 'ముందు మాట'లో)

అయితే, నేనిప్పుడు కృష్ణాజిల్లాలో కాక, కడప జిల్లాలో, పెన్నానది పక్కనే వుండి వుంటే పెన్నేటి కతలు రాసేవన్నా? చెప్పలేను. విద్వాన్ విశ్వం కూడ 'పెన్నేటిపాట'ను అనంతపురం జిల్లాలో వుండగా రాశారా?, లేక బయటికి వచ్చాకే రాశారా? అన్నది తెలీదు. అది ప్రాంతీయ తత్వంకాదు. కృష్ణాజిల్లాలో ప్రజలందరూ సుభిక్షంగా వుండగా, కడప జిల్లా ప్రజలు మాత్రమే ఆకలికి అలమటిస్తున్నట్టు చెప్పడమూ కాదు. అభివృద్ధి కున్న వెలుగు-నీడల ముఖాలలో, వెలుగు ముఖంలో కూడా నీడలుండవచ్చు కానీ, కొట్టొచ్చినట్టు కనిపించేది ప్రధాన వైరుధ్యమే. అది కనిపించేదెప్పుడు? కొంత వెలుగులో నుంచీ చూసినప్పుడే.

అభివృద్ధి చెందిన ప్రాంతానికీ, వెనుకబడిన ప్రాంతానికీ మధ్య ప్రజల జీవన విధానాల్లో, ఆలోచనల్లో తేడాలుంటాయి. ఈ తేడాలు ఆయా ప్రాంతాల సంస్కృతికి సంబంధించినవి మాత్రమే కాదు. అభివృద్ధి, వెనుకబడిన తనం నుంచీ ఉత్పన్నమైన తేడాలవి. ఈ తేడాలు రెండు ప్రాంతాల మొత్తం ప్రజల నుంచీ కనిపించడమే విశేషం. దీన్ని ఇంకొంచెం వివరిస్తాను. అభివృద్ధి చెందిన ప్రాంతాలలో కూడా పేదలూ, సంపన్నులూ వుంటారు. పై కులాలవారూ, కింది కులాల వారూ వుంటారు. ఆ ప్రాంతాలలో ఆ రెండు వర్గాల వారి మధ్యనా, పై, కింది కులాల వారి మధ్యనా ఎన్నో తేడాలుంటాయి. అయినా, వెనుకబడిన ప్రాంతంలోని వాళ్ళతో పోలిస్తే, లేదా ముఖాముఖి నిలిస్తే.... స్థూలంగా అభివృద్ధి చెందిన ప్రాంతాలలోని సంపన్నుల, అగ్రవర్ణాల భావజాలమే ఎక్కువ ప్రాబల్యంతో వున్నట్టు కనిపిస్తుంది. పేదల మీదా, కింది కులాలవారి మీదా కూడా ఆ భావజాలమే అప్పుడు అధికారం చూపుతున్నట్టు కనిపిస్తుంది.

అలాగే, వెనుకబడిన ప్రాంతాలలో కూడా ధనవంతులుంటారు, పేద లెటూ ఎక్కువ గానే వుంటారు. అగ్రవర్ణాల వారుంటారు. అడుగు కులాల వారుంటారు, వాళ్ళ మధ్యన తేడాలూ వుంటాయి. ఈ వెనుకబడిన ప్రాంతానికి చెందిన సంపన్నుడూ, అగ్రవర్ణుడూ అయినా సరే, అభివృద్ధి చెందిన ప్రాంతం సంపన్న, అగ్రవర్ణం వాడి ముందు తక్కువ స్థాయిలో వుండవలసిందే. అభివృద్ధి చెందిన ప్రాంతంలోని పేదవాళ్ళు కింది కులాలవాళ్ళూ అయినా, వెనుకబడిన ప్రాంతంలోని సంపన్నుడినీ, సవర్ణుడినీ చులకనగా చూడగలరనేది అవాస్తవం కాదు.

ఇదంతా చెప్పడమెందుకంటే ప్రజల మధ్య వున్న తేడాలు ఎన్నటికీ పోయేవి కావని చెప్పి, భయపెట్టాలని కాదు. అభివృద్ధి చెందిన ప్రాంతానికీ, వెనుకబడిన ప్రాంతానికీ పెద్ద తేడా వుంటుందని, అది కేవలం 'అభివృద్ధి' 'వెనుకబడ్డం' అన్నవాటి మీదనే ఎక్కువగా ఆధారపడి వుంటుందని చెప్పడానికి. "సకల దేశ కార్మికులారా! ఐక్యం కండి" అని మార్క్స్ అన్నా, కార్మికులందరూ ఐక్యం కాలేదు. అలాగే, ఏ ప్రాంతంలో వున్నా పేదవాళ్ళ సమస్యలు ఒకేలా వున్నప్పటికీ, అన్ని ప్రాంతాలలోని పేదవాళ్ళూ ఐక్యం కాలేకపోతున్నారు. అందుకు ఇలాంటి అవరోధాలే కారణమని అనుకుంటున్నాను. ఏవో ఉప్పెనలాగా, ఉద్యమమో, విప్లవమో వచ్చినప్పుడు వేరే పరిస్థితిగానీ సాధారణ పరిస్థితిలో ఇటువంటి అడ్డంకులుంటాయని భావిస్తున్నాను. కులాలూ, మతాలూ ప్రజల్ని విడదీస్తున్నట్టే, అసమంగా జరిగే అభివృద్ధికి కూడా. వెలునీడల ముఖాలుండి ప్రజల్ని విడదీస్తూ వుంటుందని నాకు తెలిసినంతట్లో అభిప్రాయ పడుతున్నాను. బుచ్చిబాబు తన 'చివరికి మిగిలేది' నవల్లో.... ఆంధ్ర దేశంలోని మూడు ప్రాంతాల వారి మధ్యన పరస్పర వైషమ్యాలున్నట్టు చెప్పారు. ఆయన ఎక్కువగా అది ప్రాంతీయ విభేదాలన్నట్టు చెప్పారు కానీ, ఆ విభేధాలు 'అభివృద్ధి'కీ, 'వెనుకబడినతనాని'కీ మధ్య వున్నవని నేను భావిస్తున్నాను.

ఈ పరిస్థితి నేను 'పెన్నేటి కతలు' రాయ వలసిన అవసరం కల్పించివుండ వచ్చని అనుకుంటున్నాను. "మంచి అన్నది మాల ఐతే మాల నే అగుదున్" అనడం ఉడుకుమోతనం వల్లనో, ఉక్రోషం వల్లనో కాదు. 'వెనుకబడిన తనం' అన్యాయాలకీ అవమానాలకీ గురవుతున్నప్పుడు వెనుకబడిన వాళ్ళలోని క్రోధం అది. వెనుకబడినతనాన్ని ప్రేమించడం కాదుఅది. "వెనుక బడిన వాళ్ళని ప్రేమించి చేసేదేముంది?" అని ప్రశ్నిస్తే...."ప్రేమించక చేసేదేముంది?" అనేదే జవాబు.

దేశం సామ్రాజ్యవాదుల పాలన కింద వున్నప్పుడు, ప్రాచీనాంధ్ర వైభవాన్ని స్మరించే సాహిత్యం వెలువడిన సంగతి తెలిసిందే. అందులో ఉద్దేశం స్ఫూర్తి పొందడమూ, ప్రేరణ స్ఫూర్తి చెందడమూ కావచ్చు కానీ, సారాంశంలో అది పాలక వర్గ భావజాలమే. వెనుకబడిన ప్రజలనో, ప్రాంతాన్నో ప్రేమించడం ప్రజాస్వామికము. అయితే, రచయితకు ప్రజాస్వామిక దృక్పథమూ, స్వభావమూ లేకపోతే, 'వెనుకబడిన తనం'లో సహజంగా వుండే అప్రజాస్వామిక లక్షణాలను కూడా

'గ్లోరిఫై' చేసే ప్రమాదం వుంది. అందువల్ల వెనుక బడిన వాళ్ళని మరింత వెనక్కి నెట్టడ మవుతుంది. ఇది చెప్పడ మెందుకంటే "నాకు ప్రజాస్వామిక దృక్పథం వుంది" అని నేనే చెప్పుకోడానికి కాదు 'పెన్నేటి కతలు' చెప్పడంలో నా ఆలోచన వున్నదున్నట్టు చెప్పాలన్నది కాక, ప్రాంతాలని కోరుకున్నది కూడా వుందని చెప్ప డానికి.

ప్రపంచంలో అభివృద్ధిచెందిన దేశానికా నీ, జాతికికానీ, ప్రాంతానికికానీ 'ఐడెం టిటీ' అక్కర్లేదు. అభివృద్ధే వాటి 'ఐడెంటిటీ' అవసరమైతే, ఇంకాఅభివృద్ధిచెంద డానికి వున్న 'ఐడెంటిటీ'ని పూర్తిగా పోగొట్టుకోడానికైనా సిద్ధపడతాయి. దురాక్ర మణకీ, అణచివేతకీ, వెనుకబడిన తనానికి గురైనవాటి విషయం ఇందుకు వ్యతిరేకం. వాటికి తమని తాము నిరూపించుకోవలసిన అవసరం వుంటుంది. దురాక్రమణకు గురైన దేశం అయితే, అది దురాక్రమించిన దేశంతోనూ, అణచివేతకు గురైనజాతి అయితే అణచి వేస్తున్న జాతితోనూ, వెనుకబడిన ప్రాంతం అయితే, అభివృద్ధి చెందిన ప్రాంతాలతోనూ చేస్తున్న పోరాటం అది. దాన్ని పరిమితమై పోవడంగానో హద్దుల్ని నిర్ణయించుకోవడంగానో భావించడం పొరపాటే కాదు, అన్యాయం కూడా. అందువల్ల మాండలికంలోగాక మరొక రకంగా, 'పెన్నేటి కతలు', చెప్పడ మన్నది, అసంభవమూ, అసంబద్ధమూ, అయిన విషయం.

పెన్నేటి కతలు, కథలని ఎవరూ అనరు. మామూలు సాహిత్య ప్రమాణా లకు నిలిచేవి కూడా కావు. సంఘటిత పోరాటాలను కాకపోతేమానె, ప్రత్యేకంగా సంఘర్షణనైనా చిత్రించినవి కావు. అయినా, నాకు 'పెన్నేటి కత'లంటే ఇష్టం. అంతకు ముందు కథలు రాసినప్పటి కంటే, 'పెన్నేటి కతలు' రాసినప్పుడు ఎక్కువ సంతృప్తికలిగింది. ఆ సంతృప్తి ఇప్పటికీ పల్చబడినట్టులేదు. ఆ కతల్ని ఒక్కొ దాన్ని ఉదహరిస్తూ, వాటి నేపథ్యమేమిటో వివరించాలనుకున్నాను గానీ, అదిప్పుడు సాధ్యమయ్యేదిగా, సబబైనదిగా కనిపించడంలేదు. అంతకన్నా, అసలు 'పెన్నేటి కతలు', ఎందుకు రాయవలసి వచ్చిందో చెప్పడం అవసర మని పించింది. చెప్పడ మంటే....సరిగ్గా "ఇదిగిదిగో.... ఇందుకే రాశానని తేల్చి చెప్పడం సాధ్యం కాదు." "ఈ పరిస్థితి పెన్నేటి కతలు రాయవలసిన అవసరం కల్పించి వుంటుందను కుంటున్నాను" అన్నాను. ఆ పరిస్థితి ఏమిటో సూచించాను. అంగీకరించనూవచ్చు అంగీకరించనివాళ్ళు అంగీకరించకనూ పోవచ్చు.

"ఈ కతలేమైనా జీవిత సమస్యల్ని చిత్రించాయా? ఆ సమస్యల్ని పరిష్క రించుకునే సూచనల్ని ఇచ్చాయా? ఆ మాట గట్టిగా చెప్పలేను" అన్నానప్పుడు. ఆ కతల్లో సమస్యలూ, వాటి పరిష్కారాలూ ప్రత్యేకంగా కనిపించవు. పోరాటాలూ, సంఘర్షణలూ లేవు. అయితే, సమస్యలైనా, సంఘర్షణలైనా, పోరాటమైనా ఆకతలు వాటి 'ఐడెంటిటీని' చెప్పుకోడంలో అంతర్లీనంగా వున్నాయి.

ఈ మాట గట్టిగా చెప్పగలనిప్పుడు.

# పిల్లల ప్రపంచం





## కరువంటే ఏమిటి ?

పిల్లలూ-

మీకు 'క రు వు' గురించి ఈ నెల చెప్పాలి. ఇంతకూ మీకు కరువంటే తెలుసా? పచ్చని చెట్లూ - రంగురంగుల పూలూ, పక్షులూ, అందమైన నీలాకాశం చూసి పులకరించే మీలో చాలా మందికి 'కరువు' గురించి తెలిసి ఉండదు. మీకే కాదు చాలా మంది పెద్ద వారికి సైతం కరువు గురించి పూర్తిగా తెలియదు.

మీరు పుట్టక ముందే ఈ దేశంలో కరువు వచ్చి వేలాది మంది ప్రజలు చచ్చిపోయారు. అలాంటి కరువంటే ఏమిటి ? అది ఎందుకు వస్తుంది? అనే విషయాలు ప్రతి ఒక్క పిల్లవాడూ తెలుసుకోవాలి.

మీలో చాలా మంది పేపర్ చూసే ఉం టా రు. లేదా టి. వీ. లో చూసి ఉంటారు. 'సోమాలియా' అనే దేశంలో పిల్లల పెద్ద తలకాయలు మాత్రం కని పిస్తుంటాయి. పొట్ట అనేది అసలుందా అనిపిస్తుంది. ఎముకలకు చర్మంఅతుక్కు పోయినట్లుగా ఉంటుంది. మీరు అస్థి పంజరాలు చూసి ఉంటారు. దాదాపు అలా ఉంటారు. అక్కడి పిల్లలేకాదు పెద్దవారు కూడా. వారికి తిండి లేదు. నీళ్ళలేవు.

ఇంక మన రాష్ట్రం విషయం చూసు కుంటే 'రాయలసీమ' గురించి ఒకనాటి 'రతనాలసీమ' గా ఇప్పటికీ మీరు పాఠాలు చదువుకుంటారు. అక్కడ నీళ్ళులేవు. ఓ బిందెడు నీళ్ళు కావాలంటే మైళ్ళు దూరం నడిచిపోవాలి. నీళ్ళు లేకపోతే జీవించటం ఎంతకష్టం. లేచింది మొదలు నీళ్ళు తెచ్చుకోవాటమే పనయితే,అక్కడి ప్రజలు ఎలా చదువుకుంటారు ?ముందు పంటలు పండుతాయా ? పచ్చదనం ఉంటుందా? తినటానికి తిండి ఉంటుందా?

అందుకే అక్కడి భూములు నెర్రెలు వచ్చి ఉంటాయి. అక్కడి పశువులు 'సోమాలియా' పిల్లల్లా ఉం టా యి. అక్కడ దొరికే కొద్దిపాటి నీరు కూడా మలినంగా ఉండటం వలన రకరకాలు వ్యాధులొస్తాయి. పశువుల్ని 'కబేళా'కు తోలేస్తుంటారు. అదే కరువంటే.

అయితే మీకు తెలియవలసిన విష యాలు ఇంకా చాలా ఉన్నాయి. అవి పుస్తకాల్లో ఉండవు. అందుకని మీరం

నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd., డి. సి. ఎమ్. ఎస్. బిల్డింగ్స్, ఎస్. ఆర్. పేట, ఏలూరు

దరూ ఇతర పుస్తకాలుకూడా చదువుతూ ఉండాలి. ఇంతకూ నీళ్ళులేవని కదా మనం అనుకున్నాం. ఇప్పుడు చూడండి. నిన్నటి దాకా భయంకరమైన ఎండ లయితే, ఈ రోజున కొన్ని రాష్ట్రాల్లో వరదలు విరుచుకుపడి ముంచి పారేస్తు న్నాయి. మరి ఈ నీరంతా సముద్రాన్ని చేరుకుంటాది.

ఈ నీటికే ఆనకట్టలు కడితే అన్ని వసరాలకూ వినియోగించుకోవచ్చు. మరి ఎందుకు కట్టరూ' ని మీరు అడుగు తారు. డబ్బులు లేవాలి నేది జవాబు. మరి డబ్బుల ప్రభుత్వం దగ్గర లేవని అంటారు.

మరిదేశంలో బోల్డంత డబ్బు ఉండాలి కదా. అదంతా ఏమై పోయింది? ఇదే అసలు ప్రశ్న.

నీళ్ళన్నీ సముద్రంలో కలిసినట్లుగా డబ్బులన్నీ కొంతమంది దగ్గరకు చేరి పోతున్నాయి. అలాంటి వారందరూ సముద్రంలా పెరిగిపోతున్నారు. అందు వల్ల ఏమౌతుంది తెలుసా ?

నీటికి కరువు - తిండికి కరువు ఉద్యోగాలకు కరువు — చదువుకు కరువు చదువుకోవటానికి కరువు ఇలా ఒకటి కాదు సవాలక్ష కరువులువస్తాయి. 'కరువు' అనేది వస్తున్నదంటే ఒకటే అర్థం - డబ్బులన్నీ కొంతమంది దగ్గర పోగు పడటం. మీరు పెద్దవారవుతున్న కొద్దీ విషయాలు ఇంకా బాగా అర్థం అవు

చివరిగా ఏంటంటే 'రాయలసీమ' లోనో, తెలంగాణాలోనో, ఒరిస్సాలోనో కరువు ఉంది కదా - అది మన దాకా రాదు అనుకో కూడదు. మనం యిలా చూస్తూ కూర్చుంటే దేశమంతా కరువుతో నిండిపోతుంది. అందుకే ఈసారి 'కరువు' మీద ప్రత్యేక సంచిక తెచ్చారు. ఇది చదవండి. తెలియని విషయాలు పెద్దవారిని అడగండి.

'పిల్లల ప్రపంచం' ఆదర్శం ఏమిటో తెలుసా ?

"ఈ ప్రపంచం పిల్లలిది. ఇందులో కూటికోసమే పనిచేసే పిల్లలుండరాదు కళ్ళులేని, తిండి దొరకని ఊర్లు ఉండ కూడదు. ఆకలుండ కూడదు. దేనికీ, ఎవరికీ 'కరువు' ఉండ కూడదు.

అలాంటి మంచి ప్రపంచం నిర్మిం చాలనే మీ పెద్దల ఆరాటం. వారిని గమ నించండి. వారిని ఆదర్శంగా స్వీక రించండి.

మీ మావయ్య

## వాయిస్ ఆఫ్ చిన్ని

లో ఫ్రెండ్స్ చాలా కాలంతర్వాత కలుసుకుంటున్నాం కదా. మీరు ఇప్పుడు ల్లి రు చేసుకుంటున్న ఈ పట్టిక ను కొన్ని వివరా అందిస్తున్నాను.

ముందుగా ఈ దేశంలో కరువా - నేను ఒప్పుకోను' అన్నాడు బుల్లి అదేంటిరా అంటే వాడు ఇలా అన్నాడు.

(తరువాయి 98 వ పేజీలో)

## కరువు గురించి....

—ప్రజా సాహితి

కరువును నిర్వచించలేం. కాని అది కొట్టవచ్చినట్లు కనబడుతుంది ... ఒక దేశం ఆహార కొరత అంటుంది- మరో దేశం కరువు అంటుంది." (టేలర్ 1947 పే. 98, 102).

పూర్తి ఆహార కొరత సుదీర్ఘకాలం కొనసాగి మరణాల సంఖ్య పెరిగిపో తుంది కరువు సమయంలో. అది విశాల ప్రాంతానికి విస్తరించి అత్యధిక జనాభాను బాధితులుగా మారుస్తుంది.

కరువు వాతకుగురైన ప్రజలు క్రమంగా క్షీణించిపోతారు. వారి ఇళ్ళలోగానీ, వీధుల్లోగానీ, రోడ్లపైగానీ పడి వుంటారు. వారు అస్థిపంజరాలౌతారు. కడుపు ఉబ్బి పోయి చావుకు ఎదురు చూస్తూంటారు

కరువు ప్రాంతంలో బిచ్చగాళ్ళు అసంఖ్యాకంగా వుంటారు. కొట్లాటలు, లక్ష్య రహితమైన తిరుగుళ్ళు, లక్ష్యాధారిత వలసలూ వుంటాయి. స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ పొలాల్లో, వీధుల్లో, చెత్త కుండీల్లో ఆహారం వెదుక్కుంటుంటారు పేదవారు తమ పశువులను అమ్మివేయడమో, తినడమో చేస్తారు.

1920-21లో ఉత్తర చైనాలో ఏర్పడిన కరువుకో సాధారణ ఆహార పదార్థాలు దొరకక, నేల తంగేడు ఆకులతో చేసిన పిండి, పూల విత్తనాలు, బూరుగు పిందెలు, రంపపు పొట్టు, పత్తి గింజలు, ఎల్మ్ వృక్షపు బెరడు, తీపి బంగాళా దుంపలు మొదలైనవి తింటూ వచ్చారు. (మేల్లరీ-1926 పే 2)

1932-33 సోవియట్ యూనియన్‌లో కరువును చూచిన క్రవ్‌చెంకో అనే ప్రభుత్వాధికారితో ఒక రైతాంగ యువతి చెప్పిన విషయాను ఇలా వున్నాయి.

"నేను చనిపోయినవారి గురించి చెప్పను....

సగం చనిపోయినవారు, చావానికి తయారుగావున్న వారి పరిస్థితి [illegible] పెట్రోపోల్‌లో ఆకలితో కడుపులు ఉబ్బిపోయిన వారున్నారు. రోజూ [illegible] చనిపోతున్నారో తెలియదు. వాళ్ళు ఎంత క్షీణించిపోయారంటే, వాళ్ళు ఇళ్ళలో నుంచి బయటకు కదలలేని పరిస్థితిలో వున్నారు. ఒక వ్యాగన్ ఆ [illegible] శవాలను తీసుకు రావడానికి పోతుంటుంది. ఏమేమి మాకు అందుబాటులోకి వచ్చాయో - కుక్కలు, చుంచులు, పక్షులు, అన్నిటినీ తినేసాం రేపు చెట్ల బెరడు వలచి తినేస్తాం. గుర్రపు లద్దెలు తిన్నాం-వాటిలో ఒక్కోసారి ధాన్యపు గింజలు కనబడ్డాయి."

వీటికి తోడు కరువు పీడిత ప్రాంతాల్లో ఇళ్ళ దోపిడీ, దొంగతనాలు,→

(96 వ పేజీ తరువాయి)

'నేను లెక్కలు రాసుకుంటున్నా ఈ ప్రపంచమంతా మీదే మీదే మీదే అని ఈ పెద్దవారంతా పాటలు పాడుతుంటారు కదా. అందుకే ఇందులో ఎవరెవరు ఎంతెంత తీసుకుంటున్నారో రాసి పెట్టుకుంటున్నా."

1. రాయలసీమలో నీళ్ళులేవు. మరి బాంబులు ఎందుకున్నవి ?"

2. ప్రకాశంజిల్లాలో కొన్ని వేలకోట్ల గ్రానైట్ దొరికింది.

3. గోదావరి బేసిన్‌తో మరికొన్ని వేల కోట్ల చమురూ, గ్యాసూ ఉందిట.

4. హర్షద్ మెహతా అనువాడు అందు వేల కోట్లు (రూపాయలే) మోసం చేసెను.

5. అని ఎవరి దగ్గరకు చేరాయో - ఎవరికీ తెలియకుండా ఉన్నది.

6. 'బోఫోర్స్' అను కేసులో 900 కోట్లు (రూపాయలు మాత్రమే) స్విస్ బ్యాంకులలో చేరెను.

7. ప్రపంచ బ్యాంకునుండి అయిదు వేల కోట్లు అప్పు వచ్చెను.

ముందే చెప్పాను కదా - బుల్లిగాడి లిస్టు చాలా ఉండి. ఇంతకూ 'కరువు' ఉంది అనటానికి నాకూ నోరు రావటం లేదు. ఇన్ని వేల కోట్ల రూపాయలు ఉంటే కరువెందుకు వస్తుంది? అయినా 'కరువొచ్చి పడటం' కొంత మందికే, కొన్ని ప్రాంతాలకే అయినప్పుడు ఇందులో ఏదో ఉంది కదూ —

అందుకే బుల్లిగాడే కాదు. మనమూ లెక్కలు తయారు చేసుకుందాం. ఎవరెవరు ఎంత తీసుకున్నా రేపు తప్పకుండా వసూలు చేసుకుందాం.

## వచ్చే సంచిక నుండి

గత సంచికలో 'పిల్లల ప్రపంచం' చేసిన విజ్ఞప్తికి ఇప్పుడిప్పుడే ప్రతిస్పందన వస్తోంది. వచ్చే సంచిక నుండి కవులూ, కవయిత్రులూ, కళాకారులూ తమ తమ బాల్యంలో ఎలాంటి ప్రేరణ పొందారో వివరిస్తారు. పిల్లలందరూ అలాంటి అపురూప అనుభవాలను చదివి వాటినుండి ఎంతో నేర్చుకుంటారని ఆశిస్తున్నాం.

→హత్యలు చోటు చేసుకుంటాయి. నరమాంస భక్షణ అరుదే ఐనా రహస్యంగా జరుగుతుంది కనుక తెలియదు. వ్యాధులు విజృంభిస్తాయి. రోగ నిరోధక శక్తి ఆహారం లేకపోవడం వల్ల నశిస్తుంది.

పేదవారిపై కరువు భూతం విచ్చలవిడిగా విహరిస్తుంది. కొనగలిగినవారు ఎక్కువెక్కువ ఆహార పదార్థాలు కొనుక్కొని నిల్వ చేసుకుంటారు. వీటిని తాము తినడానికిగానీ, ఎక్కువ రేటుకు అమ్ముకోడానికిగానీ నిల్వ చేసుకుంటారు. కూలీ రేట్లు పెరిగే ఆహార ధాన్యాల ధరలకు అనుగుణంగా వుండవు. తక్కువ ఆదాయం కల కుటుంబాలవారు అకలి బాధను ఎదుర్కొంటారు. వాళ్ళు నెమ్మది నెమ్మదిగా వారి ఆస్తులూ, గుడ్డలూ, ఇంట్లో వస్తువులూ అమ్మేసుకుంటారు.

1845-1849 లల ఐర్లండు [illegible]
ఐర్లండ్‌లోని చేపల వృత్తి వారంతా తమ పని ముట్లను అన్నంకోసం అమ్మేసుకున్నారు. ఆ కరువులోనూ-ఇతర కరువుల్లోనూ విత్తనాలకోసం వుంచిన ధాన్యాన్ని తినేసారు. చైనా కరువులో పిల్లలను అమ్మివేయడం- పురుషులు బానిసలుగా తమకు తామే అమ్ముడుపోవటం జరిగింది. వ్యభిచారం పెరిగిపోయింది. అప్పుడూ కొనగాలుదార్లు వుంటారు. ఎందుకంటే అత్యధిక జనాభా కరువు వాత పడినా, మొత్తం సమూలంగా అందరినీ కరువు చంపదు. ఆ ప్రజల్లోనే కొందరు కరువు పరిస్థితుల వల్ల లాభపడతారు. కొందరు తమ అధికారం స్థాయిని బట్టి రక్షింపబడతారు.

కరువుకు శతకోటి కారణాలు చెప్పవచ్చు. వాల్‌ఫర్డ్ అనే ఆయన 1878-79లో కరువుకు 12 కారణాలు ఏకరువు పెట్టాడు. వీటిని రెండు రకాలు చేశాడు:

1. మానవుడి అదుపులో లేని సహజ కారణాలు

2. మానవుడు అదుపు చేయ గల్గిన కృత్రిమ కారణాలు

సహజ కారణాల్లో 1. వర్షాభావ పరిస్థితి, 2. అధిక వర్షాలు, వరదలు, 3. అత్యధిక శీతల వాతావరణం, తుఫాన్లు, గాలివానలు-ఉప్పెనలు-మిడతలతో పంటలు నాశనం. కృత్రిమ కారణాల్లో 1. దిగ్బంధనం చేసిన యుద్ధం, 2. ఆహార ధాన్యాల నిల్వలనూ, పంటలనూ నాశనం చేయడం, 3. యుద్ధ సమయంలో వచ్చే ఇబ్బందులూ, 4. విప్లవాలు—ప్రత్యక్షంగా రైతాంగానికీ, అధికార వర్గానికీ ఓనివల్ల వ్యవసాయ ఉత్పత్తులు తగ్గిపోతాయి. 5. అధిక పన్నులు. రైతుల నుంచి అదనంగా ధాన్య సేకరణ (సోవియట్ రష్యాలో 1932-33లలో జరిగినట్లుగా) 6. యుద్ధ వ్యూహంలో భాగంగా శత్రువుకు కరువు సృష్టించడం.

కరువు ఒక దేశం మొత్తంగా రావడం అరుదు. దేశంలోని కొన్ని ప్రాంతాలలో చూస్తాం. ఆస్ట్రేలియా, ఈస్ట్ ఇండీస్, సహారాకు దక్షిణాన గల ఆఫ్రికాలో సహజ కరువులు రాలేదు. ఉత్తర అమెరికా, సెంట్రల్ అమెరికాలో 1051లో వచ్చిన మెక్సికో కరువు కనబడ్తోంది. తరచుగా వర్షాభావ పరిస్థితి వల్ల ఈశాన్య బ్రెజిల్‌లో (దక్షిణ అమెరికా) కరువు పరిస్థితులుంటూ వుంటాయి. జపాన్‌లో 1732-33, 1783-87, 1832-1836లలో తీవ్రమైన కరువులు వచ్చాయి.

రష్యాకు పడమరగా వున్న యూరప్‌లో 1940ల నాటి ఐరిష్ కరువు తప్ప మిగిలినవేవీ రాలేదు. (నట్ హాంసన్ వాసిన 'ఆకలి' నవల నేపథ్యం ఈ ఐరిష్ కరువే).

రెండవ ప్రపంచ యుద్ధం వల్ల గ్రీసులోనూ, హాలెండ్ పశ్చిమ ప్రాంతం లోనూ కృత్రిమ కరువులు వచ్చాయి. ప్రథమ ప్రపంచ యుద్ధం తర్వాత, జరుగు తున్నపుడు ఆహార కొరత వచ్చింది. పర్షియాలో 1871లో, ఆసియా మైనర్‌లో

1874-75 లలో, ఈజిప్టులో 1897లో, బ్రెజిల్‌లో 1877లో, మొరాకోలో 1877-78లలో కరువులు వచ్చాయి. ఈ కాలంలోనే రష్యాలో 10 కరువులు, ఇండియాలో 13 కరువులు (బెంగాల్ కరువు 1943 కాక) వచ్చాయి.

1850 నుంచి చైనాలో వచ్చిన కరువులు ఎన్నో లెక్క చెప్పడం సాధ్యం కాదు. కాని తీవ్రమైన కరువులు 1877-78, 1919-20, 1929-30లలో వచ్చాయి. 1906, 1911, 1916, 1924లలో తక్కువస్థాయి కరువులు వచ్చాయి.

రష్యా, ఇండియా, చైనా దేశాలలో ప్రపంచ ప్రఖ్యాత గాంచిన కరువు ప్రాంతాలున్నాయి. ఇవి ఎడారులకు దగ్గర వర్షం ఎప్పుడూ తక్కువ. వేసవి కాలం ఎక్కువ. తక్కువ వర్షపాతం వల్ల పంటల దిగుబడి చాలా తక్కువ. అదీగాక ఈ ప్రాంతాల్లో పేద రైతాంగ ప్రజల సాంద్రత వుంది.

రష్యాలో వోల్గాప్రాంతం: చైనాలో ఎల్లోనది లోయప్రాంతం, ఇండియాలో వాయువ్యం దక్కన్ పీఠభూమి- ఇటువంటి ప్రాంతాలే.

10 లక్షల మంది ప్రజలు మరణించిన కరువులు, 1. ఐరిష్ కరువు 1845-49, 2. ఇండియా 1877-78, 1896-97, 1889—1900, 1943, 3. రష్యా: 1821-22, 1932-33, 4. చైనా 1877-78, 1929-30.

కరువు వల్ల సరైన తిండి దొరకదు. దానితో వ్యాధి నిరోధక శక్తి తగ్గిపోతుంది మలేరియా, ఫ్లూ, టి. బి. మశూచి, కలరా, టైఫాయిడ్ జబ్బులు విజృంభిస్తాయి. ఏది దొరికితే అది తినడం వల్ల డయేరియా వస్తుంది.

కరువు వల్ల మరణాల సంఖ్య పెరగడమే గాని జననాల సంఖ్యకూడా తగ్గుతుంది. గ్రామాల్లోని వారు పట్టణాలకు శరణార్థులుగా వలస వస్తారు. ప్రభుత్వ కేంద్రాలు వున్న నగరాలకు వెళ్తారు. కరువు తగ్గిన తర్వాత స్వస్థలాలకు వెళ్తారు. వీళ్ళలో అత్యధికులు కొత్త ప్రాంతాల్లో స్థిరపడిపోతారు. సాధారణంగా కరువువల్ల దేశం వదలి వేరే దేశం వెళ్ళడం తక్కువ. ఒక్క ఐర్లండ్‌లో 1840 కరువులో మాత్రమే 10 లక్షలకు పైగా ప్రజలు అమెరికా వెళ్ళి స్థిరపడిపోయారు.

ఐదు శతాబ్దాల క్రిందట దైవాగ్రహం వల్ల కరువు వస్తుందనీ-ఇది తప్పనిసరి వ్యవహారం అనుకునే వారు.

---

## "నీళ్ళు" కథకు ప్రేరణ

**— పెద్దిభొట్ల సుబ్బరామయ్య**

1963 వ సంవత్సరం "భారతి" లో అచ్చయింది "నీళ్ళు." అంతకు ముందెన్నడో 1956 ప్రాంతాలలో అనుకుంటాను, విజయవాడలో మా ఇంటికి ఒకనాటి తెల్లవారుజామున ఒక పద్దెనిమిది సంవత్సరాల అబ్బాయి వచ్చాడు. తనను తాను పరిచయం చేసుకున్నాడు. అతని పేరు మునుస్వామో, మునిరత్నమో

ఇప్పుడు గుర్తులేదు. [illegible] దినాలలో నా క్లాస్ మేట్ తమ్ముడు. సిగ్గరి. చాలా బిడియ పడుతూ తనను గురించి చెప్తున్నాడు. ఎస్సెల్సీ పాసైనాడు. ఇక్కడ ఒక రాష్ట్ర ప్రభుత్వ శాఖలో కేవలం తాత్కాలికంగా - మూడు నెలలు మాత్రమే ఒక పోస్టింగ్. జీతం నెలకు 62 రూపాయలని గుర్తు. అతని రెండు చేతులకు ఆరేసి వ్రేళ్ళుండటం విశేషం. మా యింటి ముందు గది ఒకటి provide చేశాను. ఆనాడే ఉదయం మాయింటి ముందున్న బావి దగ్గరికి వెళ్ళిన అతని మొదటి రియాక్షన్ "అరే! బావిలో నీళ్లు ఇంత పైకి ఉన్నా యేమిటండీ ........ చెంబో ముంచుకోవచ్చునే" అని. నేను నవ్వి ఊరుకున్నాను. వాళ్ళ ఊరుని గురించీ ప్రాంతాలను గురించీ చెప్పాడు. అక్కడి నీటికరువు గురించీ చెప్పాడు. అక్కడి చెరువులు ఎప్పుడూ నిండవన్నాడు. వర్షాలు చాలా తక్కువ అనీ, వర్షం పడితే మహానందపడి పోతామన్నాడు. పొలాలలో అంతటా నువ్వులు, ఆముదాలు, అక్కడక్కడ కొన్ని తప్ప ఏవీ పండవన్నాడు. ఇంకా చాలా చెప్పాడు. రోజూ బావి దగ్గర లెక్కలేనన్ని బాల్చీలు తోడి స్నానంచేసేవాడు. ఆ తర్వాత మూడు నెలలే అతను ఉన్నది. ఈ మధ్యలో ఒకసారి కృష్ణకు విపరీతంగా వరద లొచ్చాయి. నీటిమట్టం దాదాపు రైలు వంతెనను తాకుతున్నది. తీర్థప్రజగా అందరూ చూడ్డానికి వెళ్ళేవారు. మేమూ వెళ్ళాము. ఒడ్డున నిలబడ్డాము. ఆ సూర్యాస్తమయ వేళ అతడు నాపక్కనే నిశ్శబ్దంగా నిలబడ్డాడు ఒక రకమైన ఆశ్చర్యంతో. ఎదురుగా పెద్ద జలరాశి. సాయంవేళ సూర్యకాంతిలో అద్భుత దృశ్యం.

నేను అతన్ని పలకరించాను. ఉన్నట్టుండి "ఇన్ని నీళ్ళు పుట్టి నప్పటినుంచీ ఒక్కచోట చూడలేదు" అన్నాడు. నాకు చిత్రమనిపించింది.

ఆ తర్వాత ఆయన వెళ్ళిపోయాడు.

చాలా సంవత్సరాల తర్వాత- అయిదు సంవత్సరాల తర్వాత అనుకుంటాను- మా మిత్రుడు అంటే అతని అన్నను ఒక పెళ్ళిలో ఒంగోలులో కలుసుకోడం తటస్థించింది. మాటల సందర్భంలో "మీ తమ్ముడెలా వున్నా"డని వాకబు చేశాను. అతను విచారంగా మొహంపెట్టి "చచ్చిపోయాడు. రెండేళ్ళయింది" అని చెప్పాడు.

ఆ మాటతో నా మనసులో ఎక్కడో లోపల పొరలలో అణిగిపడి వున్న అతని మాటలు, అతని వాలకం అన్నీ గుర్తుకు వచ్చాయి. గొప్ప బాధ వంటిది కలిగింది.

అప్పుడే బహుశా ఈ కథకు బీజం పడి వుండాలి. తర్వాత కొన్నాళ్ళపాటు అది నన్ను వదలక వేధించింది.

ఆ తర్వాత ఈ కథ వ్రాశాను.

ఇన్నాళ్ళుగా ఈ కథ పాఠకులకు గుర్తుండి పోవడం నాకు ఆనందం కలిగిస్తున్నది.

## చైతన్య వాహిని

**అరుణోదయ-విజయవాడ బ్రాంతం :**

★ జూలై 10న ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ (APTF) వారి కృష్ణాజిల్లా విద్యా వైజ్ఞానిక మహాసభల సందర్భంగా వారి ఆహ్వానంపై డంకెల్ ప్రతిపాదనలపై అధిక ధరలపై వీధి భాగవత యక్షగాన ప్రక్రియలో రూపొందించిన "అప్పుల భారతం" ప్రదర్శించారు. APTF బహిరంగసభా వేదికపై "మతోన్మాదం- ఉపాధ్యాయుల కర్తవ్యం" అనే అంశంపై అరుణోదయ రాష్ట్ర అధ్యక్షులు కా॥ దివికుమార్ ఉపన్యసించారు.

★ జూలై 15న, విజయనగరం జిల్లా బొబ్బిలిలో ఆం ప్ర. రైతు కూలీ సంఘం ఆధ్వర్యంలో డంకెల్ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా జరిగిన ఊరేగింపులో అగ్రభాగాన సామ్రాజ్యవాది తన డంకెల్ ప్రతిపాదనల షరతుల ఉరితాడు బిగించి భారతదేశాన్ని లాక్కుపోతున్న వేషాన్ని ప్రదర్శించారు. తాండ్ర పాపారాయుడు కోట ముందు భాగాన జరిగిన బహిరంగ సభలో కా॥ దివికుమార్ ఉపన్యసించారు. అనంతరం "అప్పులభారతం" వీధి భాగవతం ప్రదర్శించగా ఏజెన్సీ ప్రాంతాల నుంచి వచ్చిన గిరిజన రైతాంగం పెద్దఎత్తున ప్రతిస్పందించారు.

★ జూలై 29న ప్రకాశంజిల్లా పొందురులో ఆం. ప్ర. రైతు కూలీ సంఘం వారి బహిరంగ సభలో "అప్పుల భారతం", పుట్టపర్తి సత్యసాయిబాబా దురాగతాలపై "హత్య బాబోయ్" వీధి నాటకాన్ని ప్రదర్శించారు.

---

★ గొప్ప ఆందోళనాకారుడు తరిమెల కా॥నాగిరెడ్డి గారి 17వ వర్ధంతి సందర్భంగ 28-7-93 తేదీన అనంతపురం కృష్ణా కళామందిరంలో జరిగిన సభలో కా॥ నాగిరెడ్డి గారిపై రాసిన కవితలతో తరిమెల నాగిరెడ్డి స్మారక ట్రస్టు ప్రచురించిన 'నాగిరెడ్డికి కలాల నివాళు' పుస్తకాన్ని జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబుగారు ఆవిష్కరించారు.

## పుట్టపర్తి ఘోరాలపై రాష్ట్ర వ్యాపిత ప్రజా సదస్సు :

★ పెద్ద చదువు సంధ్యలు లేని, మరాఠీ మాంత్రికుడి వేషం, సత్యహరిశ్చంద్ర వేషంతో రంగస్థల నటుడైన రత్నాకర సత్యనారాయణ రాజు "సత్య సాయిబాబా"గా బతికున్న దేవుడిగా అవతార మెత్తిన నాటి నుండే వినోదాస్పదుడని, దొంగ బాబా అని, ఇంద్ర జాలికుడని, హోమో సెక్సువల్ అని హేతువాదులు, నాస్తికులు, వాస్తవ వాదులు, కమ్యూనిస్టులు, ప్రజాసంఘాలు అతనిని ఎదుర్కొంటూనే ఉన్నాయి. ఇటీవల పుట్టపర్తి ఘటనలు, 6 గురి హత్యలు, బాబా ఎటువంటి దైవిక శక్తులూ లేని మామూలు వ్యక్తేనని, ప్రశాంతి నిలయంలో అంతులేని గూఢు పురాణి ఉందని, నిధుల విషయంలో పెద్ద స్థాయిలో అవినీతి మయమై ఉందని తేలుతోంది. జూన్ 6 ఘటనల అనంతరం నుండే జనసాహితి, అరుణోదయ, తదితర సంస్థలు సాయిబాబాను హత్యానేరం క్రింద అరెస్టులు చేయాలని డిమాండ్ చేస్తూ వస్తున్నాయి. హేతువాద సంఘం ఒక రాష్ట్రస్థాయి సదస్సు నిర్వహించ బూనింది. ఆ ప్రయత్నంలో అన్ని ప్రజా సంఘాల ఐక్య కార్యక్రమంగా రూపొందీ, అందుకు సన్నాహక సమావేశాలు నిర్వహించింది. ఆ సమావేశాన్ని అన్ని ప్రజా సంస్థలతోపాటు అరుణోదయ, జనసాహితి ప్రతినిధులు కూడా హాజరయ్యారు. కా॥ వై.కె. కన్వీనర్‌గా ఒక కార్యనిర్వాహణకమేటి ఏర్పడింది. జూలై 25న తుమ్మలపల్లి కళాక్షేత్రంలో సుమారు 1000 మంది ప్రతినిధులతో రాష్ట్ర ప్రజా సదస్సు జరిగింది. ఆ సదస్సుకి కామ్రేడ్ వై.కె, కామ్రేడ్ దివికుమార్, కామ్రేడ్ S.S.C. బోస్, కామ్రేడ్ V.V. కృష్ణారావు, మైత్రేయ అధ్యక్ష వర్గంగా వ్యవహరించారు. అనేక ప్రజా సంస్థల సాంస్కృతిక కార్యకర్తలతో బాటు అరుణోదయ కళాకారులు కూడా సత్యసాయిబాబా బండారంపై పాటలు పాడారు. ఈ సదస్సు సందర్భంగా అరుణోదయ, విజయవాడ బృందం "హత్య బాబోయ్" అనే వీధి నాటికను రూపొందించింది. ఊరేగింపు బయలుదేరటానికి ముందు కళాక్షేత్రం వద్ద, కలెక్టర్ ఆఫీసు వద్ద కొన్ని భాగాలను ప్రదర్శించారు. కళాక్షేత్రం నుండి, సబ్‌కలెక్టర్ ఆఫీసు వరకూ సాగిన ఊరేగింపు అగ్రభాగాన సాయిబాబా వేషాన్ని, ఆయనకు వంగి వంగి దండాలు, పాదాభివందనాలు

చేస్తున్న దేశప్రధాని వేషాన్ని ప్రదర్శించారు. "దొంగ బాబాలకు రాష్ట్రపతి, ప్రధాని, మంత్రుల పాదాభివందనాలు. సిగ్గు సిగ్గు", "సత్యసాయిబాబాను అరెస్టు చేయాలి" "బాబాలపీడ - దేశానికి పీడ" బి. జె. పి కాంగ్రెసు మత రాజకీయాలు నశించాలి మొ॥న నినాదాలతో విజయవాడ నగర ప్రజల్ని విశేషంగా ఆకర్షించింది.

## తక్కెళ్ళపాడులో అరుణోదయ బహిరంగసభ

21-7-93 నాడు నల్లగొండ జిల్లా అరుణోదయ కార్యవర్గ సమావేశం తక్కెళ్ళపాడు గ్రామంలో జరిగింది. ఆ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో అరుణోదయ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ రామారావు ఆధ్వర్యాన విప్లవ గీతా లాలపించారు.

ఆ సందర్భంగా అరుణోదయ రాష్ట్ర అధ్యక్షుడు కా॥ దివికుమార్ ప్రస్తుత పతన సాంస్కృతిక విలువలను ఎండ గడుతూ ప్రసంగించారు. సాగునీటికి, తాగునీటికి కరువేర్పడి సాధారణ ప్రజానీకం కటకటలాడుతున్నారని.... అయితే దేశంలో నీతి, నిజాయితీకి కరువేర్పడి అవినీతి మయంగా మారిపోయిందని చెప్పారు. పాలక వర్గ రాజకీయాల్లోకి రౌడీలు, గూండాలు ప్రవేశించిన విధంగానే.... మతోన్మాదాలు రామునికి నైవేద్యంగా గతంలో వడపప్పు, పానకం యిచ్చిన దానికి బదులు నేడు మానవ మాంసమూ రక్తమూ అర్పిస్తున్నారని వ్యంగ్యంగా విమర్శించారు.

అశ్లీల చిత్రాలూ, సాహిత్యంతో యువతరాన్ని పెడదారి పట్టించడానికి పథకం ప్రకారం కుట్రలు చేస్తున్నారనీ.... చిత్తకార్తె సంస్కృతిని వ్యాపింప చేస్తున్నారనీ.... అందుకే మహిళలపై హత్యాచారాలు పెరిగిపోతున్నాయని కా॥ దివి కుమార్ వివరించారు.

సత్యసాయి బాబా ఆదేశం మేరకే పోలీసులు నలుగురుని కాల్చి చంపారనీ... ప్రభుత్వం బాబాకి.... హంతకుడ్ని— కాపాడలని కంకణం కట్టుకోవటం నీతి బాహ్యమైన విషయంగా చెబుతూ సత్యసాయి బాబాను హత్యానేరం కింద అరెస్టు చేయాలని డిమాండ్ చేశారు. బి.జె.పి- కాంగ్రెసు మత రాజకీయాలను ఎండగట్టారు.

తర్వాత నల్లగొండ జిల్లా PDSU సభ్యుడు కా॥ భాస్కర్ కూడా ప్రసంగించారు సాయిబాబాపై కూడా కళాకారులు పాటలు పాడారు.

---

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of
JANA SAHITI (A.P.), at Chaitanya Printers, Vijayawada-2.
for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA

# అహోబిలంలో దాగిన పెన్నా...

భగ్గు మంటున్న ఇసుకలో
చాపులేని ఎండమావులను దాటి
విద్వాన్ విశ్వం పిలుపు ఇప్పటికీ ఆశగా
"అదిగదిగో పెన్నానది........!"
ఇప్పుడు మల్లేల నారాయణ వేదన లోంచి
"అదే పెన్నా....ఇదిగిదిగో పెన్నా...."
పోరాటాల నిరంతరాన్వేషణలో
జనజీవన సామెతలను జాలు వారుస్తున్నది!
ఆర్ద్రితలో గుండె చెలిమలు పారించే
రాళ్ళసీమ రతనాల చేతులు
ముఠాల మాత్సర్యంలో ఆయుధ సంస్కృతిలో
పెరుగుతున్న పెత్తందారీ ఆగ్రహానికి
రక్తం మడుగుల్లో అమాయకులు....
ఇక్కడే మాంత్రికుడి కొండగుహలా
మనిషిని అతి చిన్న వామనుడిగా కుదించి
ఎటుచూసినా / ఆక్రమించే అహోబిలంలో
భయం భయంగా పొదిగిపోతున్న సరస్సు
కిందికి దిగిన జలపాతం / కొండ చిలువలా కదులుతూ
భక్తుల ఆరాటంలోని ఆరోహణలో
మళ్ళీ బిలంలోకే నర్సింహ స్వామిని వెతుక్కుంటూ!
తరతరాల అగ్ర కుల అటవీ రాజ్యానికి
ముసుగేసి మురిపించే ఎన్నికల్లో
ప్రాణ భయంతో ఎస్కార్ట్ తుపాకులవెంట
పెనవేసుకొంటున్న బాంబుల పంట,
నల్లమల గిరుల్లో అల్లుకుని
ప్రజ్వరిల్లుతున్న ప్రతీకార జ్వాల.
నాపరాళ్ళను తవ్వి మెరుగులు దిద్దే
కరువు సీమ నుదుటి చెమట ఆరనేలేదు.
ప్రజాస్వామ్యం చాటున పాలేగాళ్ళ పాలన
నీడల్లో ధూళిగా ఎగురుతున్న కష్టజీవి
ఈ సీమ కడగండ్ల విముక్తి కోసమే
విప్లవ వారసత్వంలో / మెరిసే రైతులు వజ్రాలు
మరింత సాన బట్టవలసిన వాళ్ళు!